చ్చాంగన రథ్యవేఁగ నెదురై పతిగన్నులు గోచరింపఁగన్. 246

చ. కని యదలించి రోసిచెదుఁగా కడగాలము సేర నెక్కడం
జనియెదు భర్తకాఁపురము పైఁపడ కుక్కనునాజ్యమిందునే
మనమనసైన నిచ్చినఁటిమార్గముఁబట్టుదె కాచువాఁడుఁగా
డని నను నిచ్చలోనెఱుఁగవా తగవా నగుబాటుసేయఁగన్. 247

క. కేళవులనీచెడుపోకలఁ, దెలియనె రేపగలుగాచి తిరుగనె చేయం
గలిగినదాఁగునె యన నం, దుల కాజగటాఁగ జాలిఁదూలక పలికెన్. 248

ఉ. ఓసరిపోయి నిల్వెడలకుండ నయో నను రాణివాసిఁగాఁ
జేసితొ తొత్తులం బనులుసేయఁగనిచ్చినఁ బోలదంటి నే
వానికిఁబోర నన్నుఁగడవం బనిపాటలు సేయువారలే
రీ సురఁద్రావి మైమఱచి ప్రేలెదు కంటివొ పట్టుకొంటివో. 249

క. తూరకు నారకు బయలికి, రారా దనుమేర గలదొ రానో పోనో
యారా చూడవె నేఁడే, లారోసమువచ్చెఁ గ్రొత్తలా యిత్తఱిఁగుల్. 250

క. పలుకులకేమీ రోసము, గలిగినమగవాఁడవయినఁ గాచి కడంకం
దలతలఁబట్టికొనంగా, వలదంటినొ చంపి త్రోవ నలదంటినొకో. 251

క. రుసివంటిదాన నన్నీ, కుసిగుంపానరించి యేమిగుడిచెదు పాపం
బసిపోలెఁ దాకు నిను నే,నుసురన్నం జాలుఁ జాలు నోహో యనుఁడున్. 252

ఉ. కాలికుడన్పతివ్రతవు గావె యయో నిను నీవ యెన్నకో
నేల జగం బెఱుంగదె మఱి యేను నెఱుంగుదు వింతవాఁడనే
చాలుఁ బురె పతివ్రతలు సంజకడం బెఱవాడఁబోక సం
శీలము యిల్లుసేరు మెడసేయక యన్నియుఁ జక్కనయ్యెడున్. 253

వ. అని రోషపరుషవచనంబులం గినియుచు గృహంబునకుం గొనిపోయి యయ్యవ
గాకి అంపటాలిం గాలంగేలం బొడిచి పెడమఱలందిగిచి నిట్రాత నేఁతపగ్గంబునం
బంధించి కాలికుండు నిద్రించె నంతఁ గొంతప్రొద్దరిగిన. 254

శా. జారప్రేరితయై వినిర్భయమనీషం దూతి యేతెంచి చే
బారంబెట్టి కుటీరభారవహశుంభత్సంభృతస్తంభవి
స్ఫారప్రాంజాలరజ్జుబంధితవయస్యం గాంచి కన్నీరుము
న్నీరై వెల్లివడంగఁ గాలికుని లో నిందింపుచుం గూరిమిన్. 255

క. ఎదఁజేర్చి కర్ణమొయ్యనఁ, గదిసి ప్రయోజనముఁ జెతిచెఁ గా చెలియా యీ
ముదకఁడు పరిప్రార్థారయి,న్నదురించిరి ప్రజలు వే చనిన మేల్గాదే. 256

ఉ. వెన్నెలరాకకై మొగము వ్రేల్చుచకోరముభంగి జారుఁ డో
కన్నులఁగల్గునిద్ర గడకన్నులఁదూర్పక యొప్పుచెప్పు వ
చ్చున్నను డాయుచుం జెదురుచూడ్కిఁ బ్రియంబున నీదురాక కీ
ట్లెన్నియొ చెప్ప నేల చను మే నిటనుండెదఁ గట్టివైచినన్. 257

క. చనిరమ్మా నీవని బంధనమూడ్చినఁ దంతువాయి తొలిమిన్నై నొం
డనక గృహస్తంభంబునఁ, దనుఁగట్టిన త్రాటఁ బెనఁచి దానిం గట్టెన్. 258

క. కట్టి తనమాటుగా న, ద్దిట్ట గృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్
మిట్టాడని యాబెడిదపు, నట్టక నడురేయి మబ్బునం జెలి చనియెన్. 259

చ. అలమిననిద్రఁ జొక్కి చెడి యంతనె మేల్కని కాళికుండు పే
రలుఁగున సారెసం బిలువ నించువెఱుం బరకీయ గావునం
బలుకక యుండె నందులకు భావమునం గనలుట్టి మేలువాల్
కొళవులఁబూని ముక్కుఁ దఱిగెం దొరిగె న్రుధిరంబు భోరునన్. 260

క. ముక్కరకు నోఁచకుండ, న్నక్కఱఁ గావించి పలువముండా చెడుమం
చొక్కమునంబున నిదురం, జొక్కెం గాళికుఁడు దొంటిచొప్పున నంతన్. 261

ఉ. అక్కడఁ దంతువాయి ప్రియ నప్రతిమాంగజ సౌఖ్యసంగతిం
జొక్కఁగఁ జేసి మందిరము చొప్పునఁ గ్రమ్మఱ యిల్లుసొచ్చి పే
రక్కునఁ జేర్చి వార్తగలదా యన మాతిక యేపవార్త నా
ముక్కుకువచ్చె నీచెలిమి మూలబడ న్విడు మిల్లుసేరెదన్. 262

ఉ. నావిని తంతువాయి పదనంబున లేవగ నంకురింప దూ
తీవిధికృత్య మెవ్వరికిఁ దీఱదు మానుపనంచు బంధముల్
వేవడలింపఁ ద్రెవ్వి పృథివీస్థలిఁ గూలినముక్కుఁ గొంచు నా
త్మావసథంబుఁ జేర తురకాంగన డెందమునం దలంకుచున్. 263

క. అ నేఁత కానిచెలి గృహ, మానిన నిట్రాత వంటి యటునిటు త్రాటం
దా నిరుచేతులమర్చి య, థానియతిం గూయుచుండెఁ దత్సమయమునన్. 264

సీ. సింధుజామాతృదక్షిణచక్షురంగంబు మందేహగర్వనిర్మథనకేళి
సకలవేదద్రుమస్కంధంబు జలరుహప్రభవగాత్రించరోద్భవమహంబు
సంజ్వరార్తరథాంగసమ్మదప్రతిపాది దారుణ తిమిరకాంతారవహ్ని
కమలినీవదనప్రకాశపోషణమూల మాశ్రిత జనజీవనౌషధంబు
తే. కుముదసమ్మదమథనని స్తిమితవేగ, మపిపతద్వీరకృతసురాయతనమార్గ
మలఘునీహారకిరటిపాళలపరంబు గ్రహపతింసంబు పూర్వాద్రిఁ గానవచ్చె. 265

చ. తెలతెలవేఁగిన న్నిదురఁదేఱి కరంబులు సాఁచి లేచి క
న్గెలఁకులఁ జూడఁ జూచు మగని న్గని నాలిపిసాళి వెర్కి నా
కలితపతివ్రతామహిమఁ గావక నన్ను విరూపిఁ జేసితి
క్కలుషము నిన్ను ముంచుకొనుఁ గాక విరూపత నన్నుఁ బొందునే 266

చ. అనుచితచిత్తవృత్తిఁ బురుషాంతరచింతనహింప నిన్ను నొ
క్కనిగడపం బతివ్రతనుగాని యొకప్పుడుఁ గాను బుంశ్చలిన్
వినుఁ డిదె లోకపాలకులు వేయును నేటికి సాధ్వినేని సం
జనితకృపన్ మదాననముఁ జక్కఁగఁ జేయుఁడు కీర్తికెక్కఁగన్. 267

వ. అని యేడ్చి మఱియు నద్దుశ్చరి మగనినుద్దేశించి యిట్లను హాలామదంబునం జేసి కల్ల నిజంబు లేర్పఱుపనేరక నన్నింతఁ జేయుదుగా కేమి నీచేతులు నొచ్చెదు నన్నుం గీడువొందుమనే యని మందలించినం జూచి భయవిస్మయంబులు సందడింప నక్కవిందుండు తచ్చరణంబులం బడి పరమపాతకుండ నపరాధి నా నేరంబు క్షమింపుమనుచు బంధంబులూడ్చి ప్రశంసించె నత్తెఱం గంతయు నందుండుటం జేసి చూచి యాతి యతివిస్మయరసావేశితాంతఃకరణుండయ్యె నంతకుమున్న గృహీతచ్ఛిన్న నాసాపుటయై చని కుటీరాభ్యంతరంబున ముసుంగిడికొనియున్న క్షురకాంగనం బిలిచి తద్వల్లభుం డిట్లనియె. 268

చ. కరితలఁ జూడవే నిమురఁ గానవె యివ్విధి నున్న నెట్లు కాఁ
పురము పురంబునం గొఱఁగఁ బోవలె నా క్షురభాండమిమ్ము నా
కరిమున కన్న నయ్యువిద గాకిముసుంగెడలింప కూర్జిత
క్షురమొకటిచ్చె గాజరొదనాత్మతరాంతరంబు గప్పఁగన్. ... 269

చ. క్షుర మొకఁ డిచ్చినం గనలుచు న్మగఁ డాజగడాఁగ కిట్లనున్
గరువము నీకుఁ జెల్లినది గా క్షుభాండము గాక యొండు కీ
క్షురమొకఁ డంచు నోఁబలుకుచుం గుటిరాంతరసీమ నై చెఁ ద
క్షురము కఠోరభంగి నదిమూచి తదీయ ఘనాటి యేడ్చుచున్. 270

ఉ. నేరము సేయ మార్పలుక నీతికిఁ బాసినఁ దానగాను న
న్నూరకముక్కఁ గోసె వినరో ప్రజలార దయాధురంధరుల్
గారె యనాథనైన నను గావరె ధర్మము లేకపోయెనే
యూరికిదిక్కు లేదె యిట నుండఁగఁ బాపము నన్నుఁ బోఁటికిన్. 271

చ. కురియఁ దొడంగెఁ జూడుఁ డిదిగో రుధిరంబు శితక్షురంబునన్
తఱిగినముక్కుఁ గన్గొనుఁడు నా కిటుగాఁ గతమేమి కావరే

పరుసునవచ్చు నెట్లవనిఁబండు జగంబు సుభిక్షమెట్లగు
న్నరపతిలేఁడె యిక్కడ ననాథలపెన్గొలు యాలకింపఁగన్. 272

వ. అని తల విరియఁబోసికొని రక్తసిక్తంబగుమొగంబు విధుంతుదదంతకుంతనిర్భిన్నచంద్రబింబంబువిడంబింప గుంపులుగొనిచూచు జనులకుఁ దునిసినముక్కుఁజూపి వెక్కివెక్కి యేడ్చుచు నెట్లా రోయింగంటిరే యనుచు నద్దంట మగనిమీద నపరాధం బొడప నీ పడుపున మొఱపెట్టుచుండె నప్పుడు. 273

క. ఇటు నటు నన నోరాడక, తటతట నెద యదర నోరఁ దడిలే కొడలా
రటపడఁగనుండె నపుడ, చ్చట మంగలి తొంగలించుసంత్రాసమునన్. 274

క. గిలుకలు వేసినగుదియలు, ఘలుఘల్లననూఁదికొనుచుఁ గతమేమీ యీ
కలకలమునకనుచు వడిం,దలవరు లేతెంచి యవ్విధం బగనిఁ గ్రుతిన్. 275

సీ. మంగలిఁబట్టి కట్టికొని మానవనాథుని ప్రోలఁ బెట్టి చె
ప్పం గనలెత్తి యాత్మపరి పాలితవిశ్వధరిత్రి నింతహం
తం గనుగొంటలేదు కొఱఁతం బడవైవుఁడు వీనినంచు రా
జాంగరమిచ్చి యారెకుల కొప్పనఁజేసె దృఢ ప్రయత్నుఁడై. 276

క. తలవరులు వానిఁ గొనిచని, తలపొలమునఁ గొఱఁతఁ దివ్వఁదమకించుతఱిన్
గలతెఱఁగుఁ జెప్పి భిక్షుకుఁ, డలమంగలి నిరపరాధుఁడని యెఱిఁగించెన్. 277

వ. మేషయుద్ధంబున నక్కయు నాషాఢభూతిచేత సన్న్యాసియుఁ దంతువాయిచేత దూతికయు స్వాపరాధంబున బాధంబొందిరి యేనును నిట్టివాఁడనేకదా యని వెచ్చనూర్చిన దమనకునకుం గరటకుం డిట్లనియె. 278

క. కేసరిన్నృపమైత్రి యనా, యాసక్రియఁ జెఱుపఁజాలు నట్టియుపాయం
బోపుగుణీ చేకూరదో, కోసరసప్రజ్ఞతలఁచుకొమ్మన నతఁడున్. 279

క. సరసోపాయముచేనగు, కరణి పరాక్రమముచేతఁ గా దెట్లన్నన్
గరటముసుతపరిపంథిం, బొరిగొనదే కనకసూత్రమున గృష్ణాహిన్ 280

క. అన రిపుదమనకు దమనకుఁ, గనుఁగొని కరటకుఁడు వలికె ఘనబోధనసా
ధనసాధునూక్తి నిక్కథ, వనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 281

క. మనుజాలు మిట్టాడని యొక,ఘనగహన మహీరుహమునఁ గాకంబులజో
డొనరించుడింభములఁ గీ,లొక్కవనీకమ్మనికిఁ గఱచిలువ దిమదప్పిన్. 282

క. ప్రతిసంవత్సరమును నీ,గతిఁ బిల్లలఁ బాము పాము గడతేర్పంగాఁ
బ్రతికృతికి నేర్పుజాలక, యతిదీనతఁ గాకమిథున మచ్చోనుండున్. 283

అ అంతఁ బ్రసవయోగ్యయగుభార్యఁ జూచి కాలాహిచకితచిత్తముగుచుఁ గాక
మడలుగదలుకొనఁగ వడి తొగఁ దనమైత్రిఁ, గలిగితిరుగు జంబుకంబుకడకు. 284

వ. అట్లరిగిన సుల్లోక శోకం బగు కాకంబునకు జగత్ప్రసిద్ధుండగు నాప్రబుద్ధుం డాతి
ధ్యం బాచరించి స్వాగతం బడిగిన సత్రుమిత్రీతాత్ముండై వాయసాధ్యక్షుం డిట్ల
నియె. 285

చ. ఘనవనమండలంబున నొకానొక భూమిరుహంబునందు నీ
యనుజయు నేను గాలిడుదు మచ్చెలి చూలువహించి కాంచి పెం
ఛినపృథుకవ్రజంబుఁ గతిచిల్వ దినంబ్రతివత్సరంబు దా
ని నుడుపశక్తిలేక యొకనేర్పున నూరక చూచుచుండుదుఙ్. 286

సీ. నూఁగారువొదలు మేనులతోడ నెరకునై కిలుకూత లిడ నాలకింపలేదు
అల్లంతఁ గాంచి యుల్లార్చుపక్షములతో శిరములంకింప నీక్షింపలేదు
యొగుబోదలయి గూఁడుదిగనాడి పెఱవ్రూఁకులెక్క-నారని యుత్సహింపలేదు
చంక్రమక్రమవిలాసముల నంబరవీథిఁ దిరుగఁజిత్తమున మోదింపలేదు
తే. ప్రేమ మెసలారఁ గని యెత్తి పెనుచుమంద, ననుఁగుమనమలఁదిగిచి ముద్దాడలేదు
బహువిపద్దశ లనుభవింపఁగ దినంబు, లరిగెఁ జూచితె వాయసాధ్యక్షుబ్రతుకు.

చ. కడపితి నిట్టు లేను జిరకాలము చాలముదంబొనర్చునే
పడఁతుక కాననయినయడి పన్నగభీతిగరించి యొవ్విధిం
జెడకసుఖింతు నిందులకు జెప్పు ముపాయము నావుడప్పుడ
య్యుడ లడఁగించి జంబుకకులాగ్రణి వాయసభర్త కిట్లనుఙ్. 288

క. యీలీల నుత్తమముల, స్త్రీలం గాపట్యమెసఁగ మెసవికుభీరా
భీలగ్రహణమున సరః, కూలద్రుమవర్తిమసలికొక్కెర దెగదే. 289

క. అనిచెప్పిన గోమాయువుఁ, గనుఁగొని వాయసమువలికెఁ గర్కటకముచేఁ
దనివిసన మీలజాలం, దిని కొక్కెర యెట్లుపొలిసెఁ దెలుపవెయనుడుఙ్. 290

వ. ప్రబుద్ధుండిట్లనియె. 291

మ. క్షుణదాయామవిఘాతి భాస్కరమహస్సంపాతి విశ్వంభరా
ప్రణమత్క్రాంతముసింధువింధ్యకుధరప్రచ్ఛేత్తిదావావలా
రణినానామృగ మస్తకద్రుమ కుఠారం బధ్వనీనార్తికా
రణభైషజ్యముదోఁచె వేసవి మహోగ్రప్రేక్షణోదగ్రమై. 292

చ. అడుగిడరాదు నేల నెరయం దలచూపఁగరాదు నిప్పుక
ల్జడిగొనరాలు నెండవడఁ జల్లెడువీఁడిఁక నేడమిత్రుఁడం
చుడుగక భానుఁజూచి వగనొందుశరీరులఁ దేర్చుగాడ్పు ల
ప్పుడు పరపోషణవ్రతులు వోఘనదానకళాధురంధరుల్, 293

సీ. ఖండితనిష్పాల వసంతములాడు సెందల వసఁజల్లు పడమటివాయువులును
ప్రోవిశుంటులుదక్క గుల్లలుచిక్కంగ నివిరివగొంగరాయిడికి మిడికి
కొరడయుఁగడిసె పాపరముల్గుముచ్చంగి కొంటె ముక్కున లొంపిఁగ్రుచ్చుకొనియె
వాలుపముకుదమ్ము వల్లెగండెరవత్తి గుజ్జుచేడిసటాలికొలుకు మడిస
తే. నూతయలజళ్ళ చెఱువులనుండరాక, శార్ఙ్గసల్లు సెగల్లను గవులువిడిచి
తరలి చెంతల నూతిగుంతల వసించె, *గరలివర్తిలు నమ్మహాగ్రీష్మమునను. 294

ఉ. శంబర శోషణక్రియకుఁ జాలి దురంతతరప్రతాపరే
ఖం పథికాంగకంబులకు గాఁక ఘటించి వారింతు రంగసే
ఖ్యంబు మహాబలోద్ధతము నయినకతాంగము సెక్కి యున్నదా
ఘంబునఁ బద్మినీయువతికాముఁడు కామునిదెల్పఁ బోల్పఁగన్. 295

వ. మఱియు నవ్వేసవి శోషితసింధురాజంబయి ధనంజయుం గృశీకృతదశకంధరంబయి దాశరథిని ఘనాఘనవర్తితశిఖిమండలంబయి కంధరారంభంబును భోగివిరాజమానంబయి బలిసదనంబువనుకరించె మఱియును. 296

చ. అనిమిష మండలీరుచిరమయి కవిరాజవిరాజితోత్పల
ద్వనరి మరున్నికేతనమున న్ననుపట్టిన దాని నొక్కచోఁ
గనియె సరోవరంబు ఝషకంబులఁ బట్టుకొనంగ కత్తిలే
కనిలిచి క్రౌంచమెచ్చిరులు కారియఁ దత్తటి నూరకుండఁగన్. 297

వ. దానినిరీక్షించి యొక్క కుళీరం బిట్లనియె. 298

క. బకమా గృహ దఖిలకదం, బకమా యాహారవిధికిఁ బానీటుల సరో
నికటమున నూరకుండెద, వకటా యిదియేమి యనిన నది యిట్లనియెన్. 299

ఉ. యీదశ యెట్లుగాఁదెలిసి తీవు కుళీరమ నిక్కవంబు మ
త్స్యాదుఁడ వృత్తి నాకిదియగ్గైనను నీయెడనేమి చెప్ప ద
త్తాదృతి నీయవస్థ కరయం గత మున్నది విన్ము జాలరుల్
మేదుర శక్తి నిక్కలనిమీనములం గొనిపోవువారలై. 300

క. పలువురు రానున్నారని, తెలియ న్విని చెప్పవచ్చితి న్మీతోనిం
దులకయి యాహారింపం, దలఁపక వలవంత నొందెదం గర్కటకా. 301

క. జాలములన్ గాలముల, న్మీలెల్లం బోలియకున్నె మృత్యువసమంబీ
జాలిరొటమండివచ్చెం, గాలము దరియింపరాదు గదయెవ్వరికిన్. 302

---

* సూష్మకరమయినయామహాగ్రీష్మమునను. (పాఠాంతరము.)

వ. అని యశ్రుమిశ్రితాంబకం బై బకంబు వగచిన విషంబునం గలఁగుచున్నంబు లన్నియు నెఱుకచేసికొని యక్కొక్కర కిట్లనియె. 303

ఉ. అరయ మీవ భక్షకుఁడవయ్యును గూరిమి పెద్ద మాయెడం
గారుణికాగ్రగణ్య యటుగావున విప్రతిపత్తిలేదు ని
చ్చో నిరయమార మమ్ము నొకచొప్పున దుస్థితి నొందకుండ నీ
డేరుపుమయ్య నేము ఘటింపగదయ్య ప్రసన్నమూర్తివై. 304

వ. అని మీనంబులు దన్నుం బ్రార్థించిన సత్సుకంబయి బకంబు తనలోన. 305

క. ఈయంబుచారములు దన, మాయకులోనయ్యెఁ గంటి మన పని సంతో
షాయతి నంతర్లీనముఁ, జేయుచు మాయాకళాదసికమదిపలికెన్. 306

క. వాదించి జాలరులనొఁ, గాదన నాచేతఁగాదుగద విజ్ఞప్తి
చ్ఛేదమునకు నోరుచుకొన, రాదేకద పరమదుష్కరము కద పూనన్. 307

క. ఐన నిఁక నేమి సేయుద, మేనొకఁ డెఱిఁగింతుఁ జేయుఁ డిష్టంబైనన్
మీనముల నితరసలిల, స్థానములను బెట్టివచ్చెదను మిముఁ గరుణన్.

క. రావలసిన రాకం డని, భావంబున లేనికరుణపరిఢవిలంగా
నావృద్ధబకము పలికిన, జీవనచారములు విశ్వసించినమదితోన్. 308

క. చేపెఱుఁగనికూనలు మీ, లాటోపము మీఱఁ జేరవరిగిన నిశిత
తోటి నొకరుఘుమముఁగొని యొక, చోటికింజని మ్రింగి నగచుచుం గ్రమ్మఱియున్.

వ. ఇట్లు క్రమ్మరి. 310

క. రాకం డిఁక నొకరని రా, జీరియు కానొకరుఘుంబు శితచంచువునన్
గూరిచిచని మును మెసవిన, చో రూపఱ మెసవి తోంటిచొప్పన మఱలన్. 311

క. మగిడివిరివియును లోతున్, దిగియుం గలనీటవిడిచి తీఁగొన్నిటి న
·క్కగములుదన్నెన్ మృత్యువు, మొగము న్నో రుత్తమాంగమును దాఁకాలన్.

క. మీకును మృత్యుత్రాసము, లేకుండం జేయనేర్తు లేలెండని రా
నాకొక్కర యొకమీనముఁ, గైకొని చని తిని సరోముఖమునకువచ్చున్. 313

క. ఎడతాఁకితాఁకి యొండొక, మడువున నిడుకై తివమున మఱియు న్మఱియున్
బడుగుంగొక్కరమీలం, గడుపార న్మెసవి తృప్తిఁ గైకొని యంతన్. 314

వ. సరోవరతీరంబునం గాల్నిలిచి వాంఛితపరనీరస్థానంబు లగుమీనంబులం గదిసి యిట్లనియె. 315

గీ. అరిగి తిరిగి నేఁటి కలనీతి ధరమాన, వసమె మూఁడుకాళ్లమఱిగాని
కండపడియె ఖయసొ గర్భమా పంచాంశ, కక్తి ముదుక కెట్లు సంభవించు. 316

క. బడలికఁ బాసినఁ దిరుగం, బడి ప్రాణసమానులైనబంధుల మిమున
మ్మడుగునఁ జేర్చెదనని యొడఁ, బడఁజెప్పం దనకు నరుగఁ బాతినదనుకన్. 317

క. తనివిసన నిట్లు కతిపయ, దినముల కుదరానలంబుదీఱ న్నాయా
ఖనియాబడుగుంగొక్కెర, యనఘా యాపెంకిమీల నన్నిటి మెసవెన్. 318

వ. ఇట్లు నిరవశేషంబుగా మీనంబులం దిని యొందేనియుం బోవ నుద్యోగించు నజ్జరఠ
బకంబున కెఱుకఁజేసికొని మున్నె తెంగించుకొన్నకుళీరం బిట్లనియె. 319

గీ. భావికైవర్తకత్రాసభగ్నమాన, మానముల మీనముల నొందుమడుగుఁ జేర్చి
సుకృతసామ్రాజ్యవిభవంబు చూఱఁగొంటి, బకపురందర కలఁడె నీవంటిధర్మి. 320

క. నాళీజంఘాదులు నినుఁ, బోలరు పరహితవివాసమునఁ జొట్టములం
బాలించి నన్ను నేలా, పాలింపవు సఖుఁడఁగానె పగవాఁడనొకో. 321

వ. జలస్థలాంతరంబునుం జేర్చి పొగత్తఁగనుమని కైవారంబుసేయు కుళీరంబు నిరీ
క్షించి కర్కటమాంసం బపూర్వం బదియుఁ జవిచూడవలయు నని విచారించి
యక్కొక్కెర దానిం గఱచుకొని వధ్యశిలాతలంబునకుంబోయి భక్షింపఁ దివురు
టయు నయ్యుద్యోగం బెఱింగి యయ్యెండ్రి. 322

చ. బలిమి హుటాహుటిం దఱిమి పట్టుకొన న్వడిలేక మాయపుం
దలఁపున రిత్తజాలరులదాడి గడించి ఝషంబుల న్నిరా
కులగతి మెక్కెని మ్ముసలికొక్కెర యన్యజలాశయంబునం
గలుపుమిషంబునం జనదుగా కపటాత్ములవిశ్వసింపఁగన్. 323

క. మేనివసమయంబున ధృతిఁ, బానినమది కార్యహానిఁ బ్రాణులనిలుగన్
వ్రాసె విధి మృతికి నేలా, గాసిలి పౌరుషము విడువఁగా నేమిటికిన్. 324

క. పరుషకరపత్త్రధారా, స్ఫురణఁ బ్రకాశించు మద్విపులదంష్ట్రికలన్
శిర ముత్తరించి పాథ, శ్చరములకొలఁదీర్తు నీరసంబున ననుచున్. 325

క. అక్కర్కటముండఁగ నల, కొక్కెర దత్తరసమొలిచికొని తినునదియై
ముక్కెత్తిచాఁచు నాలో, నొక్కూఁకునఁ గొండ్లనితెకి యొత్తెన్ గళమున్. 326

క. ఒత్తిన నుమడుండుభుకము, కత్తెరచేఁదునియుమాడ్కిఁ గర్కటదంష్ట్రి
కృత్తగళంబై నెత్తురు, జొత్తిలనలవృద్ధబకము సోలెన్గూలెన్. 327

క. కోయకప్రాణులకపకృతి, సేయుదురాచారుఁ డిట్లు చేట్పడు విను మో
వాయసవల్లభ శిఖరిపు, వాయుభుజాం డీల్గునిట్టివాఁడై యునికిన్. 328

మ. భవదర్భాహితకృష్ణసర్పహరణోపాయంబెఱింగింతు నీ
వవధానంబునఁ జేయు మేమఱిక రాజాగారసంచారివై

ఛవిమత్కాంచన మేఖలాలతిక దృష్టంబైన లాగించి నీ
ఐవిలంబంబునఁ బెట్టుమమ్మనికి రా జాహాముఁ జంపించెదన్. 329

ఉ. నావిని కాక మవ్విధమునం జరియించెదనంచుఁ బోయి రా
జావసథంబుఁజేరి యరయం బ్రతిసాధనఁజేయఁబోవుచుం
బ్రావృతమేఖలాలత, ఖురాళ్యుపకంఠముఁజేర్చి దాని నా
లోవెస నంబ్రులంగమిచి లోకులుసూడఁగ నభ్రగామియై. 330

చ. అరుదుఘుటిల్లమందగతి నంతట నింతట నాసపాటుగా
నరుగుచునుండ రాజపురుషావళి మ్రోయుచు రాజానానతిన్
గెరలుచు వెంటరాఁ దొలుతఁ గృష్ణభుజంగముమున్నవృక్షకో
టరమున మేఖల న్విడిచి దాఁపున నొండొకమ్రాననుండినన్. 331

క. పరశుప్రహారములఁ ద, త్తరుకోటరమగలవైచి తత్రత్యఫణిన్
మెరిగొని మేఖలయున్గొని, పరిజనులుం జనిరి కాకిపగయునుదీఱెన్. 332

వ. పరాక్రమంబునకంటె నుపాయం బెక్కుడ యనిచెప్పి వెండియుం దమనకుండు.

క. ఇల బుద్ధిగలుగువతనికి, బలముంగల దెట్టులనినఁ బటుబుద్ధిసము
జ్జ్వలమొకశశక మొకానొక, పొలమున నున్మత్తకరిరిపుం బొరిగొనదే. 334

క. నావిని కరటకుఁ డది యె, ట్లీవిధ మెఱిఁగింపు మనిన నివసంసత్సం
భావితనయశాస్త్రికళా, కోవిదుఁ డాయనకు దమనకుం డిట్లనియెన్. 335

సీ. దంతిదంతాగ్రనిర్దళితమస్తకగళన్మూత్నముక్తౌఘపాండురాకృతంబు
బహుళతిర్యగ్ధ్రుషత్ప్రతిహతస్యదన దజ్ఝరఘనస్తనిత లాస్యదమయూర
ముచ్ఛభల్లప్రహారాస్థాత్రుమాక్షిక చ్ఛత్రపంకీకృతక్ష్మాతలంబు
బిలసదాహారితుందిలసంకునిర్ముక్తసాంకవసురభితస్థాణుమూల

తే. మాధృతాఖండవాగురికావర్తతి, రజ్జురజ్యద్గరుచ్ఛటాభ్రాంతిదాయి
చమరవాలవిలోకసంచకితమృగము, గల దొకానొకగహన మక్కానలోన. 336

క. కుక్షింభరి యగునొకహ, ర్యక్షము వర్తించు నహరహ మమర్యాదా
దక్షుండై నానామృగ, శిక్షాభిక్షాప్తి నుల్లసిలు నది సెరయన్. 337

క. ఈరీతి మేరమీఱి య, వారణవారణవిరోధివధియింపంగాఁ
బోరా దెరువెఱుఁగక యా, ఘోరాటవిమృగములెల్ల గుములై భీతిన్. 338

వ. వచ్చి యక్కేసరికిం బ్రణామంబులాచరించి. 339

సీ. గిరిదరీముఖ బహుద్వారదళోణితసిక్తగండశైలము కనత్కనకపీఠి
పరితోవిసారి శంబరలులాయవ్యాఘ్ర హారణఘోషములు తూర్యారవములు

మస్తకోపరి పతన్మహీధరాధిత్యకా ఝరవారియభిషేకసలిలధార
సవిధపాదపలతాస్థాయినీడజకులాంచితతతు ల్యాభురాశీరవములు.

తే. గావె మృగరాజవిఖ్యాతిఁ గనిన నీకు, సారగాంభీర్య పారసాహసవిలాస
పార గారవ పౌరుష త్వాతిశయము, చారుతరమూర్తి పంచాస్యచక్రవర్తి. 340

క. హరి సాగా నీరూపము, శిరమునధరియించి కాదె శిక్షించె మరు
త్పరిపంథిఁ గనకకశిపుం గరివైరీ నిన్నుఁ బొగడఁగా మాపశమే. 341

వ. అని యనేకప్రకారంబుల మాతంగధ్వనిం బ్రశంసించి యుల్లాసంబుఁ బుట్టించి మెచ్చు పుచ్చుకొనవచ్చిన కార్య మ్మడుగంబడినయవి యై మృగంబు లమ్మృగపతి కిట్లనియె. 342

క. అగపడినవారినెల్లం, దెగటార్చక మేరచేసితిని మను మటనీ
మృగములజాతికి నొకఁడొకఁ,డుగ నిది మానునవి చెవినిడుము మృగనాథా. 343

క. ఈతగవునడపుమని సం, జాతత్రాసమునఁ దనుఁ బ్రశంసించిన నా
రీతినొనర్చెద నని యది, జాతికి నొకఁడొకఁడుగా మెసవు నదిమొదలున్. 344

క. అంత నొకవారమునఁ దన, వంతగుటయు నిశిత బుద్ధివహనము ధీర
స్వాంత మొకధూర్తశశకము, దంతిప్రతిపక్షికడుపుఁ దనియించుటకున్. 345

క. చావునకుం దెగి త్రోవం, బోవుచుఁ దలపోసి స్వగతమున నిట్లను న
య్యోవననిధిఁ జొచ్చేఱుల, క్రైవడి హరికడుపుఁ జొచ్చెఁ గా వనమృగముల్. 346

క. ఈనెటికేసరిజఠరా, ధీనత దినమొకటిలెక్కఁ దినెఁ గా మృగసం
తానంబు మల్లెపట్టిన, చేనిక్రియం జెప్పనేమి శివపాదయోగ్యన్. 347

క. దీనికిఁ దుదమొద లెయ్యది, పో నెయ్యదితెరువు బుద్ధిపూర్వకముగ నేఁ
జేసెద కేసరిఁ బొరిగో, ల్కొనేడని వనమృగాళికోల వారింతున్. 348

క. బలమునకంటెను ప్రజ్ఞా, బల మెక్కుడుగాదె బుద్ధిబలమునఁ బేర
చ్చెలమునఁగై దువువెలిగాఁ, దలఁద్రుంతుం జెండి రెంటఁ ద్రావుదుదిండిన్. 349

క. ధైర్యముపెట్టనివరణము, ధైర్యము నానాశుభప్రదము నేఁడ్గవయున్
ధైర్యధురాధుర్యునకు న,వార్యము లెక్కడివి వార్ధివలితధరిత్రిన్. 350

వ. కావున ధైర్యాదిగుణంబులుగలిగి యుక్కడంతఁ జాపుకొనియెదనని నిశ్చయించి మందగమనంబునఁ బ్రొద్దుపోయిన తరువాత డాయంబోవుటయు నతిక్షుత్పిపాసాభిభూతంబగు కంఠీరవంబు రోషకషాయితేక్షణంబుల నిరీక్షించి శశకంబున కిట్లనియె. 351

శా. ఓరీ యేఁకటఁ గ్రుస్సితి న్వరగ రాకుండెట్లు త్రాసంబుచే
దో రామాదులఁ బొని రా మనకు రాదో వచ్చుమార్గంబున
దేరడ్డంబుగఁ బొంచెనో బలిమి యొండేనియు చేకూడెనో
యేరా రా జాగొనరించితీవనిన బ్రజ్ఞాయత్తచిత్తంబునన్. 352

ఉ. కేసరివంకఁ జూచి పలికెన్ శశ మే నపరాధిఁ గాఁ జుమీ
యాసరసీరుహాప్తుఁ డుదయంబగునప్పుడె లేచి యేఁకటం
గానిలె వల్లభుండని తగం బఱతేరఁగ ద్రోవ నున్మిష
త్కేసరపఙ్క్తి దూల నొకకేసరి నాఘ్నుఁ డహో యవారణన్. 353

చ. పెలపులవెంట భూరిమద సింధురమజ్జము గాఱఁగా విశృం
ఖలగతివచ్చె వచ్చి యరికట్టియదల్చె సమీపవర్తియై
పలికె మృగాధమా బలముఁ బాపెద మత్పదదృశ్యవిపాహితుం
బాలమునఁ గానవే కదిసి పోరొనరింపఁగ నింపుపుట్టెడిన్. 354

క. వనుఁబోల సింగములులే, వని కేసరి పోతరమున నాడినమాట
ల్వినివిని వారితభీతిన్, ఘనరీతి గజాభియాతిఁ గని యిట్లంటిన్. 355

క. సంగరసంరంభపుటా, సంగరము పొంగె నేని క్షణమాత్రము ని
ల్వంగలవేని గ తెచ్చెద, ముంగలికరిమథనచంగము న్సింగంబున్. 356

క. అది నికోరికఁ దీర్తుం, గదలకు మిచ్చోటననుచు గాఢప్రజ్ఞా
భ్యుదయమునఁ జేసిచానక, బ్రదికె యహో నీకు విన్నపము సేయుటకున్. 357

క. ఏతెంచితిఁ దపయుటకిది, హేతువు పంచాస్యమూర్తి వీవగుటఁ జుమీ
యోతీవ్రశౌర్యయారా, జాతతవిఖ్యాతనిరతుఁడై యొప్పెసఁగెన్. 358

క. చేరి నినుఁ గొలువవలెనో, వారక యానారినె కొలువవలెనో మాకె
వ్వారింక రాజులనఁ గం, ఠీరవ మిట్లనియె నెవ్వడి న్మశమునకున్. 359

శా. ఏమేమీ నిను నడ్డగించుకొనెనా యిట్లాడెనా నిక్కమా
నా మేలే పనుకేచ్చయంతబలుపౌనా పాదమా చూపలే
నా ము న్నెక్కడఁ గంటి వప్పరముగర్వగ్రంథి మచ్ఛాతదం
ష్ట్రామోఘాభిహతి వ్యథింతుఁ దగ నాహారింతుఁ దన్మాంసమున్. 360

క. నావిని శశకము నామా, యావాగురఁ జిక్కెసింహమని యుబ్బుచునో
దేవా విచ్చేయుము సం, ధావిభవంబెసఁగఁ జూపెదం బ్రతిపక్షిన్. 361

చ. నిలువకవత్తుగాకని వని న్గొనిపోయి చలింప కారసా
తలజలపూర్ణకూప ముచితస్థితిఁ జూపి శశంబువల్కె లో

పఱఁగనుపట్టుచూడు ప్రతిపక్షివనం బరికించి తజ్జల
స్థలిఁ బెఱసింగముం బలె నిజప్రతిబింబము గోచరింపఁగన్. 362

క. కడుఁగెరలియొగసిహూతం, బడినుయికి మునింగి తేలెఁ బానీయంబు
గ్గడుపారఁద్రావె నసువు, ల్విడిచెం గరివైరి తీవ్రవేదనఁగృశమై. 363

వ. బుద్ధిగలవానికి బలంబునుంగలదనుట కిది నిదర్శనంబనుటయుఁ గరటకుండు దమ
నకు నలరుమొగంబునం జూచి బుద్ధిమంతుండవగుదు నీకు శుభంబయ్యెడు మిత్రభేదం
బున కుద్యోగింపుము పోయిరమ్మనిన నతండు కరటకువీడ్కొని సంజీవకుండు లేని
వేళఁ బింగళకుసమీపంబున కరిగి ప్రణామంబాచరించి నిలిచిన మృగరాజమ్మంత్రి
తనయున కిట్లనియె. 364

క. నీవలనఁ బ్రాజ్యరాజ్యముఁ; గావించెదఁగాక దమనకా యేకార్యం
బీ వూఁది తెలుపవచ్చితి, వావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 365

సీ. చిరకాలసంశ్రయస్థితి నమ్మికెఱిగిన తనవారిదెస ననాదరము సేసి
సిరిఁగోరి నడుమవచ్చినవారి మన్నింతు రభినవప్రియులు భూవిభులు గారె
పురుషగుణాగుణంబులు విచారింపక నీతియేపతికి మన్నింపఁ జెల్లుఁ
బరులనందఱఁ దమువలెనిరీక్షింతు రక్కటులు చనుత్రోవ లెఱుఁగలేరు

తే. నమ్మఁగలవారు గాకదుర్ణయము పేర్చి, యెవ్వ రెట్టుసేయుదురో యెట్టు లెఱుఁగవచ్చుఁ
గర్కటిక గాదుకద ముంటిగంటిఁ దెలియఁ, గాఁబరస్వాంతమని వింగళకుఁ డతని.

చ. కనుగొనిపల్కె నోదమనకా మతిశంకితమయ్యె నిప్పు డి
ట్లనుటకు హేతువెద్ది తెలియన్వలె సర్వముఁ జెప్పుమన్న నా
తనియను విన్నవింపవలెనా మృగనాయక నీతిఁ జెప్పఁగా
వినువినకుండు నాకుఁ దగవే కలకార్యముఁ గప్పిపుచ్చఁగన్. 367

ఉ. తోఁచిన శుద్ధసాధుచరితుండని చిత్తమునందలంచి సం
జీవకుఁ దెచ్చి నీసఖునిఁ జేసితి నీవును వానికూర్జిత
శ్రీవిభవంబొసంగి సవరించితి వందఱు మూలభృత్యులం
జీవితతుల్యులం జవుకఁజేసి కడంబడవయిచి తీవిటన్. 368

సీ. సదృశభోగము సమాసనముఁ దుల్యవిభూతి యును భృత్యునకు నీఁగి చనదు పతికి
నిన్నియు నతనికి నిచ్చితి సామ్రాజ్యమేమి పాపముఁ జేసె నిత్తుగాక
సంజీవకునితోడి సఖ్యంబు పైవచ్చె హెచ్చించి యాపదఁ దెచ్చుకొంటి
యొంటిపాటున నాతఁ డొకనాఁడు నాతోడ నోడక నీసుద్దు లుగ్గడించి

తే. రహితశక్తిత్రయుఁడు మందరశ్మి మూఢుఁ, డితని కెక్కడి సామ్రాజ్య మేడ బ్రదుకు
చెడిరొఁ దెకతేర యనుచుఁ గేరడములాడె, ననిన విని విన్ననయియుండె హరివరుండు.

గీ. మృగవిభుండిట్లువిన్నని మొగముతోడ, మఱఁగుచుండఁగ మతియుతమంత్రిసుతుఁడు
మంత్రియొకఁడైన నతఁడు సన్మాన్యుఁడైనఁ, బుడమి నేఁడెల్ల చేటులఁ జెడునిజంబు.

చ. శ్రవణయుగాంతరావరణచక్రము లగ్గలపట్టు తోరపుం
జెవుడు కనీని కావసుధసీమకు నుమ్మలికాడు దృష్టిపా
టవము దురుక్తి వాలుకకు డానినమట్టము పారుపత్యము
స్త్రైపులు నవైద్య సాధ్య మెడ త్రెవ్వక నెవ్వని నాశ్రయించినన్. 371

క. కరణ మధికారియయినం, ధర లెక్కలు వ్రాయువాఁ డతనివారైనన్
బొరపిడిపుట్టును ధరణీ, శ్వరునకుఁ దదితరుల నిలుపవలెఁ బనిమీఁదన్. 372

క. పరిశుద్ధులకరణిఁ బర, స్పరబంధువులయ్యు సర్వభక్షకులయ్యుం
వరవల్లభు దగ్గరమా, ర్తురభంగి న్రిత్తఁబోరుదురు పనివారల్. 373

చ. తనఘనరాజ్యమంతయు బ్రధానునిపై నిడియున్న మత్తుఁగాఁ
జెనిచి నరేశ్వరుండు నడిపించినవాఁ డతియూథమూథుఁడై
కనుకని వల్లభు న్సరకుగాఁగొనఁ డాసచివావనీశులం
దనయము నెవ్వఁ డాఢ్యతిముఁడయి మనువానిన చేరు లక్ష్మియున్. 374

క. ధారుణి నపకారికి నుప, కారముఁగావించువారిఁ గానము తద్దు
శ్చారిత్రులయెడ విశ్వా, సా రంభిణ మనుచితము క్రియానిపుణులకున్. 375

క. ఊఁగడుపల్లును విసమునఁ, దోఁగినవంటకముఁ గుత్సితుండగుమంత్రిన్
లోఁగక యున్మూలించిన, బోఁగలుగు నఖండమయినసుఖ మెవ్వరికిన్. 376

క. నీవెఱుఁగవు నేనెఱుఁగుదు, పైవచ్చెం జెలిమికోలఁది పడఁదెచ్చెన్నం
జీవకుఁ డతనికిరాజ్యం, బీవిచ్చెదో బలిమి నాతఁడే కయికొనునో. 377

క. సంజీవకసాచివ్యము, నం జేటగునీకు నీమనకు చెప్పఁగల
ట్లుం జెప్పితి మానుట నా, కుంజూడ శుభంబు మెలొకో చెడుతెరువుల్. 378

వ. అని బోధించుదమనకునకుం బింగళకుం డిట్లనియె. 379

ఉ. నివచనంబు లుత్తమము నిక్కవము ల్వీను మట్టులైన సం
జీవకుఁడైన విశ్వసనచిత్తముపుట్ట దళీకవృత్తియోఁ
గావుత దోషదుష్టములుగావె శరీరము లేరికిం గళా
కోవిద వాని వీడ్కొనుటకు న్మతిపుట్టునె నాకుఁ జెప్పుమా. 380

క. నావిని దమనకుఁ డతిరో, షావిలచేతస్కుఁ డగుచు నను నట్లయినన్
సేవకులతోడఁగూడం, బోవిడునీకేమిటికిఁ బ్రభుత్వశ్లాఘల్. 381

క. తనువు భరంబని వీడ్కొని, తనలోఁ దలపోయుమూఢతరుచందమునన్

కేవటిపతి చోదకోర్వక, చని రాజ్యము మంత్రికైవసముఁ గావించున్. 382

క. సిరిఁబరిహరించునరు లె, వ్వరు చెపుమా విచ్చుకుంటువాడుంబలె హో
దరుఁడాదిగ నృపసంశ్రయ, గరిమ న్సంపదలఁ బొదలఁ గాంక్షింతు రిలన్. 383

వ. సత్పురుషుల మతి నతిక్రమించి యసత్పురుషుల బుద్ధిం బ్రవర్తించు రాజు వినుమప
థ్యానురాగియగు రోగియుంబోలెఁ బ్రాణభరణసమర్థుండు గాఁడు స్వబుద్ధి రాజులకు
విశేషించి వలయు బుద్ధిరాహిత్యంబునగు మంత్రివశుండై తిరిగెనేని యారాజు
విరోధినిరోధితుం డగునట్లగుట హితతంత్రి యగు మంత్రివాక్యంబులు రాజునకు నవ
శ్యకర్తవ్యంబులు వినునప్పుడప్రియంబులు పరిణామంబునం బ్రియంబులునగు
వానినుపదేశించు మంత్రియు నవ్వాక్యంబు లాదరించు రాజునుం గలుగఁడు కలిగె
నేని యద్దిక్కునఁ దెక్కువచెడక సిరులు పెరుగుచుండు. 384

క. ఘనుఁ డాప్తుఁడునగుసచివుఁడు, వినిపించినరాజనీతి వేయేటికి రు
గ్ణునకుఁ జికిత్సాక్రియవలె,మునువెగటుం బిదపహృద్యమును నైయుండున్. 385

క. నరపతి మూలబలంబుల, తెరువొల్లక నడుమ నరుగుదెంచినవారిం
బరిపాలించుటకంటెను, గరివైరీ యొండుచేటు గలదే పుడమిన్. 386

క. మూలబలంబులుగల భూ, పాలునకు నరాతిజాతిభయపడు లక్ష్మి
భూలావణ్యవతుల్ హరిఁ, బోలె స్వేచ్ఛఁ బాయ రవ్విభుని ననుదినమున్. 387

క. తానెంతశూరుఁ డయినను, భూనాథుఁడు మూలబలము పొందొల్లక ని
ర్మానపరిపంథినరవర, సేనాపారంపరీవిజేత యగునొకో. 388

ఉ. జీవితమిచ్చి యాదరముఁజేసి జలౌదనసంవిభాగసం
భావనకల్మి నేధరణిపాలుఁడు భృత్యులఁ బ్రోచు నద్ధరి
త్రీవిభు ప్రస్తుతంబున శరీర మలత్యముఁగా దలంచుచున్
జీవితమిచ్చు గాయములచేఁ బడునొండె భటుం డుదగ్రతన్. 389

క. పరిజనగౌరవము ధరా, వరునకు నత్యంతగౌరవము వెండియు న
ప్పరిజనలాఘవము ధరా, వరునకు నత్యంతలాఘవము సుమ్మెందున్. 390

వ. నీవు మూలబలంబులం దిరస్కరించి యభినవాగతులం బురస్కరించుకొన్నాఁడవు.

క. సేవకుఁ డని చూడకు సం, జీవకుని న్నతఁడు సరకుసేయఁడు రాజ్యం
బేవేళ నతనిపాలయి, పోవునొ తుది యెంతకొంతవుట్టునొ నీకున్. 392

క. నావిని పింగళకుఁడ నయ, కోవిదు దమనకునిఁ బలికెఁ గూరిమి నభయం
బీవిప్పింపఁగ నిచ్చితి, నావిధ మతఁడేలమఱచు నది యెట్టులగున్. 393

వ. అనిన దమనకుండు. 394

క. కొనియాడినఁ గొలిచిన దు,ర్జనుఁ డాత్మప్రకృతివిడిచి చరియింపఁడు ది
ద్దిన చమురుఁబెట్టితోమినఁ, దనకుటిలతఁ గుక్కతోఁక దా విడుచునొకో. 395

క. కొలిచిన నవధీరితుఁగాఁ, దలఁచిన కేయూను బరోపతాపము ఖలుఁడా
దలనిడుకొన్నం ద్రొక్కిన, బలితంపుంబాము బడలుపడఁగఱచుఁగదా. 396

క. సారఘనసారమృగమదం, స్కారంబుల లశున మశుభగంధముఁబోలెం
గ్రూరుఁడు ప్రతివాసరరచి, తారాధన విధుల విడువఁ డాత్మప్రకృతిన్. 397

క. హితకార్యము నన్నడుగఁడు, పతినాకేమిటికిఁ బృచ్ఛపరిభాషణమం
చతిమానముద్ర నుండుట, మతమనరు సునీతివిదులు మంత్రుల కెందున్. 398

క. సంజీవకుదుర్భాషా, పుంజము వీనులవహించి పోల్పుంబములి
చ్చుం జింతింపవు దుర్ణయు, గంజాశరణంబుసారవుగదే మృగరాజా 399

చ. అవనివిభుం డనీతివశుఁడయి మద మెత్తినదంతివోలె ని
చ్చవలసినట్లు గ్రుమ్మఱుచు సైరణ భృత్యజనాపరాధముల్
చనవునఁగప్పిపుచ్చుచు నజస్రము దుర్వినయత్వ సత్వభై
రవవిపదంబురాశిఁబడి క్రాఁగు దురంత విషాదవేదనన్. 400

క. ఏజాడవాఁడు రాజగు, నాజాడనె ప్రజయుఁ దిరుగు ననుదినము 'యథా
రాజాత థాప్రజా' యను, నీజనవాదంబు వింతయే యిపు డనుడున్. 401

క. చిరబోధబాధచే నే, నరి కేసరివలికె నంతచపలాత్ముఁడే కో
పరమసఖా సంజీవకుఁ, డరుదేరం దెలిసిచూత మాయమ్మేటిన్ 402

క. పిలిపింపుమనిన దమనకుఁ, డులుకున నను నేటికార్య మూహించితిపిం
గళకా నీవెవ్వనిఁగాఁ, దలఁచితి వానిర్భరప్రతాపప్రబలున్. 403

క. మదలింపవచ్చు నెటు ది, గ్విదితప్రభు నతనివాని వీనిన్వలె ని
ట్టిదియైన మంత్రమేక్రియఁ, దుదిముట్టుం జెప్పుమా యతులనీతినిధీ. 404

క. పరిపక్వమంత్రబీజము, నిరతిశయారంభిపాలనీయము దానిం
బరిభిన్నముఁజేసిన నం, కురదర్శన మగునె నీతికోవిద చెపుమా. 405

వ. ఇందులకుఁ బ్రథమోదాహరణం బగు నొక్కయితిహాసంబుగలదు దాని నాకర్ణిం
పుము. 406

క. కల దుత్తరమున నతిని, స్తులవస్తువిశేషమహిమధుర మధురధరా
వలయపుర మధురతేజో, బలసారసబంధుఁ డది సుబంధుం డేలున్. 407

క. అలఘుకళావిలసితుఁ డగు, నలరాజుసుబంధుఁడయ్యు నసుబంధుండై
జలధిపరీతాఖిలభూ, తలవిహారజ్జనుల సంతతము పాలించున్. 408

క. జనలోకపారిజాతుం, డనఘనదీ యపారిజాతుఁ డగునమ్మహీభృ
త్తనయుని నిజాస్తరణంబున, ననఘా యొకయూక మహరహము వర్తించున్. 409

క. అది మది వేగిర మెఱుఁగక, యధసాలసీసురతఖిన్నుఁడై రా జెంతే
నిదురింపఁ గఱచి త్రావుం, దదుదయశోణితముఁ గడుపు దనివిసనంగన్. 410

క. మఱియుఁ బ్రమాదాదులఁ జే, టెఱుఁగక పైపాటుమరేక నెక్కటికయ్యం
గఱచుకొని తనకు నేయ, క్కఱపాటునులేక కొంతకాలముఁ గడపెన్. 411

క. మారుతవశమున నపు డా, భూరమణశయనంబుపానుపునఁ జండతరా
కారము దుండుభుకం బను, దారుణమత్కుణ ముపస్థితంబై నిలిచెన్. 412

క. నిలిచిన మందవిసర్పిణి, యల మత్కుణముం బ్రకల్పితాతిథ్యముచె
న్నలరించి చాలు నిఁక నీ, వెలవునఁ గాలూఁదవలదు నీ వేగుమనన్. 413

క. నిరవధితృష్ణావిరచిత, వరదంశనగుణము మత్కుణము దీనంబై
శరణని మందవిసర్పిణి, చరణంబులప్రాలి దీనసంబునఁబలికెన్. 414

క. దైవాధీనంబున నిట, కే నచ్చితి నొండుకడకునరుగ న్దిరుగన్
నావసమె యిందునెలకొని, త్రావెదరాజన్యశోణితము నీకరుణన్. 4'5

క. నావిని మందవిసర్పిణి, దావంతంగుంది తీక్ష్ణదంష్ట్రుండవు దూ
రావసథుండవు దుండుభు, కావారక కడుపుచి చ్చొగపినపుడెల్లన్. 416

క. ఒడలు బడల్పడఁగఱచినఁ, గడునెవ్వడి నదరి లేచి కంకటిపడి న
ల్గడలువెదకించి కానం, బడ నరపతి నిన్నునన్నుఁ బరిమార్పించున్. 417

క. తులువా నీకతనమునఁ జెడ, పలెనటుజాగుడిగి యిచ్చవచ్చినదెసకున్
వెలువడుమిపు డనఁ జరణం, బులమీఁదవ్రాలి దుండుభుక మిట్లనియెన్. 418

క. నీవెందునికిపితచోఁ, దావై కాలూఁదియుండెదం బొట్టకు నీ
వేవేళఁ దయదలంచితి, వావేళనె రాజరక్త మాహరింతున్. 419

క. విడనాడకుమని దైన్యం, బడర న్మత్కుణము ప్రార్థనాలాపములన్
గడుఁగరఁగించిన నాదృతి, గడలుకొన న్యూక మట్లుగా కని పలికెన్. 420

సీ. ఒండుదిక్కునకుఁ బోనోపలేనని కదా యర్థిఁ బ్రార్థించి దట్లయిన నుండు
పతిరతిశ్రాంతిఁ దల్పమున నిద్రితుడైనతఱిఁ జేరి నెత్తురుద్రావి బ్రదుకు
మిదినీకుసమయమంచదియూరకుండిన నాఁ డప్రదోషంబున న్వినీచ
గుణము మత్కుణ మతిక్షుత్పీడకయ్యాపవేళుఁడౌ నమ్మర్త్యవిభునిఁ గఱచెఁ

తే. గఱప వరపరుఁ డదరి మేల్కాంచి పనుల, జనుల సజ్జనిరూపింపఁ బనుప వారు
దివియ లవ్వేళఁ గొనుచు నేతేరనరిగి, వికటతరభ్రాంతరము దుండుభుకము సొచ్చె.

క. కాలవడిలేమిఁ గాష్పడి, ఫోలేవన్నాడసెయుండఁ బొడగనఁబ్రేల్లన్
గీలిచి మందవిసర్పిణి, వాళోనం బులిమిమైచి కసువులువెడలన్. 422

వ. డుండుభుకమ్ముంజేర్చుకొని భిన్నమంత్రంబై యూకచచ్చి మంత్రంబు వెలిఁబుచ్చ రాదని దమనకుం డాడినఁ బింగళకుం డవ్వాక్యంబులు చిత్తంబునకెక్కి నిక్కం బుగా వగచి యమ్మంత్రికుమారునకిట్లనియె. 423

క. వాపై సంజీవకుఁ డతి, కోపంబునరాక కెద్దిగుఱుతు సునీతి
వ్యాపారశీల చెప్పుమా, గోపనగతి ననిన దమనకుం డిట్లనియెన్. 424

క. వానతఱినోరబాగై, యూనవముచురంగఁ గొమ్ములవమ్రంబుల్
గానిటకువచ్చు నతఁ డది, గో నిన్నుఁ వధింపవచ్చుగుఱు తెప్పటికిన్. 425

వ. అని యభిజ్ఞానంబుఁ జెప్పి యప్పంచాస్యంబున కుపాస్యంబై యాస్యం బలర నవ్వం చకంబచ్చోటువాసి మందగమనంబున సంజీవకు డాయంబోయి వెడవెడఁ దల యూఁచి నిట్టూర్పు నిగిడించుటయు నతండు దమనకుం బరికించి సఖా సుఖంబునం బొదలుదే భద్రమే యనిన నమ్మంత్రితనయుండు. 426

ఉ. చిత్తము నిర్వృతంబు దృఢసేవఘటించిన విత్తము ల్పరా
యత్తము లాశజీవితములం దొకయప్పుడులేదు వృత్తులా
పత్తివిధాయినుల్ చ్యవనపాటవ మెక్కడి భద్రమేవ మే
ల్గొత్తల రాజసంశ్రితులకుం బలుమాటలు వేయునేటికిన్. 427

చ. కనలువహించి యాపదల గానిలఁ డెవ్వఁడు బోంట్లచేత నే
ఘనునిమనంబు ఖండితము గా దిల నెవ్వఁడు సేర్చు కాలము
న్గనుఁగొన సేవనీపకుఁడు గౌరవమొందె ఖలాప్తిసౌఖ్యమే
జనుఁడువహించె రాజులకు సత్ప్రియుఁ డెవ్వఁడు నాకుఁ జెప్పుమా. 428

చ. నలఁకువఁజూచి యీఁడడిగినం గసరుం గృశియించి యున్నచో
నలరుఁ బ్రపూర్ణుఁ డైన నెరయం బరికింపఁగఁ లేదు నాకు నీ
కొలువికజాలునన్నఁ గుసిగుంపులఁ బెట్టు వధింపఁజూఁచు నే
వలవరకంబుగా కొలుచువారికి దుష్ప్రభుసంశ్రయం బిసీ. 429

ఆ. తనువుఁ బొదలనీఁడు తాపంబు బుట్టించుఁ, బస్తుఁబెట్టు మూలఁ బాఱవైచుఁ
గొలుచు సజ్జనులకుఁ గుత్సితపసుమతీ, వల్లభుండు వేఁకిపంటివాఁడు. 430

చ. నగవులకుం బ్రసాదవచనం బొక టాడఁడు ప్రోలనిల్చినన్
మొగమటుపెట్టు గేల్మోగిచి మ్రొక్కినఁ జేమెదలింపఁ డాజిలోఁ
బగఱవడంచి కొల్పడినపాటువు గెల్చినగెల్పు నెంతయుం
గగనకుసుంబొనర్చు నొసఁగం బదునో యని దుష్ప్రభుం డిలన్. 431

ఉ. కాననవాసియైనను సుఖంబు విశిష్టగృహాన్నభిక్షుకుం
డైనవరంబు లూఖలకణాశనుఁడైన శుభంబు కర్షకుం
డైనను మేలు నీటజఠరానలమార్చుట లెస్సచూడవె స
న్మానకరుండుగాని నరనాథు భజించుటకన్న నేరికిన్. 432

చ. మడఁగిపడుండఁ ద్రొ నులకమంచపుఁగుక్కకి నిల్వ నెల్లపు
ల్గుడిసెకు నొండు రెండెనుపగొడ్లకు నోరికిఁ బోఁక ప్రక్కనున్
గుడువఁగఁగూటికి న్మాలకుఁగోకకు నీదిర మెంతరోఁత యే
పడువున దుష్ప్రభుం గొలువవచ్చు నిసీ యను జీవికోటికిన్. 433

చ. పలికినమాటనిల్వఁ డెడపందడపం జెడనాడు వచ్చు మె
చ్చులదిగమ్రింగుఁ దొల్దొలుతఁజూచినచూపులఁ జూడఁ డేర్పడం
జులుకదనంబొనర్చు నెరసుల్ఘటియించు లదల్చివైచుఁ గే
వలనృపసంశ్రయంబు పగవారలకు న్వల దిన్వసుంధరన్. 434

మ. హతదాక్షిణ్యు లనర్థకారు లభిమానాధ్యాత్ము లవ్యంజన
ప్రతిపత్తు ల్గుజనప్రియంవదులు సంపత్సన్నిపాతస్మృతి
క్షతికు ల్సత్యపరాఙ్ముఖు ల్ధనపిశాచగ్రస్తు లాద్యావన
చ్యుతు లశాంతు లనాంతరంగికులు రాజుల్గారె యూహింపఁగాన్. 435

క. చుట్టము లెవ్వరు దేశం, బెట్టిది యాయవ్రజంబు లెట్టివి కాలం
బెట్టిది యేనెట్టిడబల, మెట్టిది నాకని తలంపుమీ నీ వనిశన్. 436

వ. దమనకు నాలోకించి సంజీవకుం డను ననుజీవులకు దుష్ప్రభు సంశ్రయంబు గాదని
యును దేశకాలంబులు విచారింపవలయుననియును వన్యాపదేశవర్ణ నాసందర్భం
బుగా నంటి విమ్మాటలకు నిమిత్త మేమియొకో యని యూరకుండిన వెండియు
దమనకుం డిట్లనియె. 437

ఉ. నావచనం బమోఘమని నమ్మి దురూహలత్రోవఁబోక సం
జీవక యేగుదెంచితివి సింహముఖంబున కెట్లు భద్రసం
భావనసేయుదుం గద విపద్దశలొత్తినచోటనోర్వనా
హా విభుఁ డీరసించెనుగదయ్య నిమిత్తము లేమి నీపయిన్. 438

క. సరసవినీతరసానీ, తరసము విరసతవగల్చి తనసుభటపరం
పరకిత్తుననియెబలితియొ, వ్వరుదిక్కిఁక నీతులున్న వా రాజులకున్. 439

క. పరివారముదూర ఖసుం, ధరనిడిపడిఁ దెల్పె నేకతంబున నన్నున్
ద్వరదారిచిరి చిత్తం, బెరియంగాఁ బిడుగువంటి యీదుర్వార్తన్. 440

వ. ప్రాణసమానుఁడవగు నీకుఁ గప్పిపుచ్చరామిం జెప్పితి నిది నీమనమ్మున నెయ్యంపవిమ్ము
వానిని సంజీవకుండు విషాదవిహ్వలుండై. 441

క. ధరనిరవధిచింతాసం, భరమున వలె శిరము వంచి పరికించుచుఁ దా
కరు సంజీవకుఁ గనుఁగొని, గురుమాయాశాలి దమనకుం డిట్లనియెన్. 442

క. చింతానలమునఁ జేసి, కాంతారము గుమిలెఁ బ్రాప్తకాలము సారా
థింతువుగా కన నతఁ డ,త్యంతధృతిస్ఫురితచిత్తుడై తనలోనన్. 443

చ. కరిగమన ల్దురాత్మకులఁ గాని రమింపరు హీనజాతికా
పురుషులఁ గాని భూభుజులు ప్రోవరు కానలఁ గాని మేఘము
ల్గురియవు సత్యశౌచములకుం బెడఁ బోసినవానిఁ గాని యిం
దిరవరియింప దుర్వ్యయనీతులఁ గాని ధరింప దెంతయున్. 444

క. పలుగూఁత లఱచువానిన్, గలుద్రావెడువానిఁ జెవులుగఱిచెడు వానిన్
బొలఁతులఁ దెచ్చెడువానిన్, దొలగింపక సంతరింపుదురు రాజన్యుల్. 445

క. ఏకగ్రీవముగా నా, లోకన మొనరించి నిచ్చలుం గొలిచి తుదిం
గా కెడసేతఁ గద కలవే,మో కటకట సత్యశౌచములు రాజులకున్. 446

చ. నలినములందు రేలు కొలనం గలహంసకులంబు రిక్కనీ
డలఁ గబళించి కాంక్ష మగుడం గడకేగి మనోజ్ఞగంధము
ల్బిలికెడుతమ్ములం బగలు చేరని చాడ్పున మోసపోయి చం
చలులగువారి కెక్కుడివి సత్యపదార్థములందు నమ్మికల్. 447

ఉ. దోషగుణంబుఁ గూర్చి కుపితుండగు నాతఁడు ప్రార్థనావిధిం
దూషితుఁడై యభీష్టఫలదుండగు దోషములేక కారణ
ద్వేషముఁ బూనియున్న కుపతిం బ్రకృతిస్థునిఁ జేయఁ బ్రార్థనా
.భాషలఁ గాదు సంశ్రయణాభంగులఁ గాదు ఘటింప దీఁగులన్. 448

చ. ఫలితచికిత్సరోగములఁ బాపశుభక్రియల న్మహాఘము
ల్పొలుపఱఁ జేయ నీతిఘనముల్బహుభంగులఁ గూడఁ బెట్టఁ
గేవల పరతంత్రులై మెఱయు వైద్యవిపశ్చిదమాత్యులుం ధరా
తలపతిఁ బాసిపోవుదు రతండు కృతజ్ఞుఁడు గాక యుండినన్. 449

చ. లవణపయోనిధానసలిలంబు ఘనాఘనదేశసంగతం
బవుచు మనోజ్ఞతం బొరయు నమ్మధురాంబువు వార్ధిఁ జేరి యు
ప్పువుగతిఁ గుత్సితం బగుఁ బమా విమలం బతికుత్సితం బవుం
దవిలి మహోత్తమాశ్రయమున న్మఱితుచ్ఛసమాశ్రయంబునన్. 450

చ. లలితపటీరపాదపములం జెలువల్గు మలోజ్జ్వలజ్జల
స్థలములఁగ్రాహము ల్గుణులచక్కిఁ బరప్రతికూలదుర్జనుల్
పొలుచు నిధానజాతముల భూతములుం గమనీయమౌక్తికా
వళి సరఘుల్సుఖంబులకు వారనివిఘ్నము లేర్పడుంగదా. 451

క. కేతకి నురుకంటకసం, ఘాతులు జంబాలజములు గంజాతంబుల్
నాఁతులు కుటి స్వాంతలు, ఖ్యాతుండిలమణులు దోషపటలావృతముల్. 452

క. అను సంజీవకుపలుకులు, విని దమనకుఁ డనియె నిట్లు విశ్వసనీయుం
డనవచ్చు మానసంబునఁ, గనులు న్వాలిఁ గనికరంబుగల నీరాజున్. 453

మ. పురతః ప్రాంజలిసాశ్రునృజ్జలజుఁ డుత్ఫుల్లాస్యుఁ డాశ్లేషణా
చరణారంభణకేళి సత్ప్రియకథాసంప్రశ్నదత్తాధికా
దరుఁ డున్నాయి బహిర్ముఖోమధురుఁ డంత ర్గాఢహాలాహలుం
డరుదే దుర్జనుఁ డెంత శిక్షితుఁ డపూర్వాఖర్వనాట్యోచితిన్. 454

క. ఇతరోత్కర్షణమాన, వ్రతుఁడు నిజశ్లాఘనప్రసక్తుఁడు సాధు
ప్రతిపక్షుఁడుష్టరక్షా, రతుఁడు సుమీ నుజనుఁ డైనరా జాహింపన్. 455

సీ. కరుణావిలాస మేగతిఁ గప్పిపుచ్చునో కోపంబు కన్నులఁ గురియుచుండు
సత్యభాషణము లెచ్చటఁ గట్టిపెట్టునో బోయబొంకులె నోరఁ బొదలుచుండు
నుపకారకరణ మెట్లుపసంహరించునో పరిపీడనహృదయంబుఁ బట్టుకుండు
నౌదార్య మెట్లదృశ్యముగా నొనర్చునో పరమలోభము బుద్ధిఁ బాయకుండు
తే. నీతి యేమూలఁ ద్రోయునో వెఱచు బుద్ధి, ముష్కరత్వంబు సేఁతలమోసు లెత్తు
మేలు డిగఁద్రావి కీడుద్గమింపఁజేయు పాపకర్ముండు రాజైన బ్రదుకుగలదే. 456

చ. అననిపుఁ డిట్లు భాషితములాడు నరాధిపుఁ డిట్లు దృష్టిపా
టవమునహింసు రా జెటులొడంబడు కోరి విషవ్యధూరతో
త్సవవిముఖుండు శంభువరదాననియుక్తుఁడు నోరఁ గన్నులం
జెవులను బంచమేధుఁ డెడసేయక శిశ్నము బూఁదియుండుటన్. 457

చ. తిమిరనివారణక్రియకు దీపము వారిధిని స్తరింపఁబో
తము చలిఁ బాపవహ్ని రవితాపనరం బడఁగింప నాతప
త్రము కలుషంబులం జెఱుప ధర్మము పొల్పడియుండుఁ గాని య
క్కమలజుఁడు న్సుఖోద్యముఁడు గాఁడు దురాత్ముని జక్కఁ జేయఁగన్. 458

వ. దమనకునకు సంజీవకుం డిట్లనియె. 459

ఉ. సాధుమధుస్పృహం దివసపాతిగమంబురుహాంతరాళసం
రోధము చంచరీకనికురుంబ మెఱుంగక పోవునట్లు త్వ

ష్టాధృతినామకోన్నమనుజప్రసరం బనుజీవితేచ్ఛవచ్చా
ధముడైన భూవిభుని నంటుఁ దదాగతిబాధఁ గానమిన్. 460

చ. సరసులతోడి నెయ్యములు జాఱ మదాళికఠోరదుర్గమ
ద్విరదశిరస్సుఖరత్కటకదేశముల న్వసియించి తచ్ఛల
త్పరుషతరస్రవోనిహతిభగ్న నిజాంగకమై పొరింబొరిం
ధరఁబడి తేటి నెమ్మనమునం దలఁచు న్బిసినీవిహారముల్. 461

వ. సాకథ యట్టిద. 462

క. కదుఁగఠినుం డగుభూపతి, కడఁజేరిన నిలువనీడగలదా చెడదా
పుడమి నొకళశమువేసవి, యెడ దాపనిరాతి నాశ్రయించిన కతనన్. 463

క. నావిని దమనకుఁ డలసుం, జీవకు నీక్షించి నీతిశీలాయేలా
గీవిధముఁ దేటపడఁజెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 464

చ. మదువుల నున్ననీ రివుర మందవిహారము మానె వాయువు
ల్పడమరసాగఁ బర్వతములందవము ల్దలలెత్తె నెండలం
బడుకలు ప్రస్సెఁ గూలె మృగపంక్తికిఁ బాంథులకు న్ధరిత్రిపై
నడుగిడఁ బ్రాణసంకటము నైన యొకానొకమండు వేసవిన్. 465

క. వనయవసవిరహితంబగు, వనసంచారంబు బారి వారనిజాలిం
దనువెరియం దీవ్రచరుం, డనుశశరా జొక్కనాఁ డుదాత్తత్వరతోన్. 466

చ. నిలువక వచ్చివచ్చి ధరణిం జిఱుపెంచికలు న్వసుంధరం
గలపినగోడలుం జివికి గంపలఁ గాచిన వెత్తిసొత్తితీ
వలు చిగిరంత గంటగమివాతులు గప్పినపూడుపాఁతఱ
ల్గలయొకయూరిపాడు పాడకట్టినఁ జేరఁగఁ బోయి యక్కడన్. 467

క. నేలంగలసిన యొకదే, వాలయనికటమున నారయం బొడవై హిం
తాలము గతి మెఱయుశిల, నొప్పలఁగ నలశశకులాధిపుఁడు గని వేడ్కన్. 468

వ. చేరువంబోవ దూరంబుగాఁ బరపంజూకొని యున్నతచ్ఛాయం గాల్కనంగోరి తదగ్రంబున నిల్చియుండెఁ బ్రొద్దునుం బెరుగుచుండ నీడయుం దఱుగుచువచ్చె నట్లు మధ్యాహ్నంబునకు ఛాయానుసారియై మూలంబునకు వచ్చి. 469

చ. అనలమువంటి యెండ నొడలారట మందఁగ నాత్మలోన ని
ట్లని తలఁచె న్శశం బతులితాకృతిసంపదఁ జూచి దీనిడాఁ
పున వసియించి యిట్లయితిఁ బ్రొద్దొకచాయ వసించె బంచెఁజే
రిన దురవస్థలం బొరయరే జనులం చదివోయె నెవ్వగన్. 470

ఉ. మత్సరరాజమంత్రితుండ నగుట సేనాశకంబునకుం దోడువోయినవాఁడ మృత్యు
ముఖప్రవిష్టులకు బ్రతుకులేదు. 471

క. పలువురుక్షుద్రులు మాయా,వులు పామరపసుమతీధవునికడనున్నం
బొలియింతు రుత్తములఁ గే,వల ముష్ట్రముఁ జంపి మెసవవా కాకాదుల్. 472

క. నావిని దమనకుఁ డలసం, జీవకు నీక్షించి నీతిశీలా యేలా
గీవిధము తేటపడఁ జెప్పు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 473

ఉ. విటపసమృద్ధిఁ బత్త్రముల వ్రేఁగునఁ బందిలిగొన్న కానుగుం
దుటుములు గట్టి యొండ పొడమూఱక ఘోరకఠోరజంతుప
ర్యటనగురాప మొక్కభయదాటవి రాజిలు నచ్చట న్మదో
త్కట మనుసింహ మప్రతిమగర్వధురంధర మొప్పుదానికిన్. 474

క. పులియును నక్కయుఁ గాకియు, నలయక పరిచర్య సేయునవి యొకనాఁ డ
ప్పొలమునఁ దిరుగుచు నొకచో, ములుగంపలు మెసవునుష్ట్రము గని తమలోన్.

క. ఎక్కడిమొగ మెక్కడిపాద, మెక్కడిమూ పేదగమన మెక్కడికంఠం
బెక్కడవినము కనుంగొన, మిక్కొంకరమెకము ననుచు సేర్తెఱ దానిన్. 476

క. బలిభుక్ఫేరువ్యాఘ్రం, బులు డాయంబోయి పలికె మున్నెన్నఁడు నీ
పొలమున మెలఁగవు చెప్పుమా, తెలియఁగ నెందుండివచ్చితివి మృగముఖ్యా. 477

క. కాననసత్వంబులలోఁ, గానము నీవంటిరూపు కడువెఱఁగయ్యెన్
మానిబిడాద్భుత మఱఁ జెప్పు, మా నీవిధ మనిన నది యమర నిట్లనియెన్. 478

చ. వను వినుచోళమండలమున న్వసుమంతుఁడు నాఁ బ్రసిద్ధిఁ గాం
చినయొకసెట్టియుండు నలసెట్టైన మారువిలాఁతి కేగుచుం
దనధనరాశి పైనిడినఁ దాల్చి హుటాహుటి నేను భానుమం
తుని కిరణాంకురంబులను దూఱనియొండొక కానఁ బోవఁగన్. 479

మ. సుషిరాస్యస్థలజాతఝాంకరణకత్సుణ్ణాళమభ్రోచ్చల
ద్ద్రుమదానస్ఫోటనపాతిభంబుకరజోతిగ్రస్తకూలంకషా
విష మున్మూలితరూఢమూల వివిధోర్వీజంబు బాహ్యాకిర
జ్ఝషకస్థానజలంబువీచె నొకజంఝామారుతం బుద్ధతిన్. 480

క. పినపిన మెఱుపులు పొటిపొటి, చినుకులు మసమసక లెసఁగు చీఁకట్లుం దోఁ
చిన నొకరినొకరు గానక, చని రాలోఁ బసియుఁ గన్నచాయలఁ బఱచెన్. 481

క. ఆనిశిఁ బసియును నొండొక, మానిసియుం బడఁడు దృష్టిమార్గంబున క

క్లేశము గాడ్పాటునఁ జనఁ,గా నొకచో సుపరిభరముకంపలఁ దవిలెన్. 482

క. తూరుపు తెలతెలనై రా,గా రుప్పున విసరుసీఁదగాడ్పులు నయ్యా
సారమును ముట్టుకొనె నేమైరో నేనెఱుఁగ నిచట నాఁగితిఁ బదముల్. 483

వ. నాపే రుష్ట్రింబు. 484

క. అని తనకథ నెఱిఁగించిన,విని వాయసముఖులు గారవించి సుహృత్త్వం
బనఘా పాయక మాతో, నొనరింపుము నెమ్మిఁ గలసియుండుద మనుచున్. 485

వ. ప్రత్యయపూర్వకంబుగా నతని నాదరించి కథనకుండనునామం బిడి తెచ్చి మహో
త్కటంబుం గానుపించి యభయదానంబుఁ జెంపుసేయించినఁ గాకవ్యాఘ్రగో
మాయువులం గలసి కొంతకాలంబు ప్రవర్తించె. 486

చ. అటఁ జటులప్రతాపభయదాశువిశంకట మమ్మహామదో
త్కటము విదాహమోహకటకక్రమశోకపురోగరోగసం
కటమున డస్సి వేఁట లరుగం దిరుగ న్వరగంధసింధుర
చ్ఛటనము నొంప వంప వడి చాలక నేలకు వ్రాలియుండఁగన్. 487

క. చరణములవ్రాలెఁ బులి య,క్కఱ డగ్గరి మ్రొక్కి వంచకము ప్రణమిల్లెన్
గరటము భద్రమె శుభమే, పరిణామమె యనుచు వినయపాటవ మమరన్. 488

క. నతిఁజేసి నిలిచి దంతి, ప్రతిపక్షీకుక్షిదావపావకుఁ డేర్చెన్
గతిచెపుమా యాహారస్థితి కీవని అంతుసేయ సింహం బనియెన్. 489

చ. శితనఖరాంకుశాగ్రములచేఁ బ్రతివాసరము న్మదావళ
క్షితిపులవ్రచ్చి మజ్జము భుజింతు మదంచితభుక్తశేష మా
శ్రితులకుఁ బెట్టుదుం దగభుజింతురు మీరు శరీరపాటవం
బతిశయితంబుకాదు గమనాగమనంబుల కేమిసేయుదున్. 490

క. వ్యవహారయోగ్యములు గా,నవయవములు గలుగునట్టు లాహారము మీ
రవహితమతులయి కతిపయ, దివసంబులు ప్రోచికొనుఁడు దేహత్రయమున్. 491

క. తనువునకు నుసురువచ్చిన, దనుకం దనకామిషం బుదాత్తప్రీతిం
గొనితెండు పొందు మీరన, ఘనతృష్ణం గాకజంబుకవ్యాఘ్రంబుల్. 492

ఉ. తీరక పోయిపోయి బలుదెంపలఁ గంపల నేళ్ళ బీళ్ళఁ బ్రాఁ
బూరుల దారులం గడిదిపుట్టలఁ దిట్టల బోళ్ళ రాళ్ళ నీ
వారకరీతము ల్లలుగుత్రుంతలఁ గ్రంతలఁ జెట్ల గట్ల నా
హారమతిం జరించి జతరావల మాఱకవచ్చి క్రమ్మఱన్. 493

క. తమలోనఁ బొదరుకొని యుష్ట్రము వాకిట నిల్వఁబనిచి రహి నమ్మూఁడుర్
సమ్ముఖమున కరిగె నందుద,రమ్ముఁ జూపి యిభారితోఁ గరట మిట్లనియెన్. 494

క. తిరుగఁగలదిక్కు లన్నియుఁ, దిరిగితి మిఁక నేమి యలసితిమి మాపల్కు
త్తరు వాహారయాహారము, దొరకదు నిష్పస్తులుండుదుమె నీమ్రోలన్. 495

ఉ. లావరి రొప్పు డంగవికలత్వము వాటిలి ప్రస్సి యిమ్మహో
గ్రావగుహానివేశమునఁ గాల్కొని దేవరయుండ నెవ్విధిం
జీవితముండు భోజనముసేయకయే మును నిస్తరించు నె
ట్లావిధ మానతిమ్ము సుగుణార్ణవ యూరకయుండుటొప్పునే. 496

ఉ. ఊరకయున్న నెట్లగు నిజోదరపూరణ మేటిజోలి యా
హారము లేదు మావలన నక్కట యే నొకమాటఁ జెప్పెదం
గోరికమీఱ నక్క ధనకుం బొరివుచ్చి తదంగమాంసము
జ్జారణసేవ దేవజఠరానల మార్పుము తేర్పు మాకృతిన్. 497

వ. అనిచెప్పిన నప్పనికొప్పనియదిర్పై మదోత్కటంబు కరటంబున కిట్లనియె. 498

ఉ. ఇట్టిదిగాదె నీకుఁ దుదినేటికిఁ జెప్పెదు ధర్మతత్త్వముల్
చెట్టులఁగట్టి నమ్మమని చేతడియాఱదు చంపుటెట్లు దా
నెట్లు సహించు దైవ మిల నెవ్విధిమోయు ధరిత్రి యక్కటా
పొట్టకుగాఁగ నిచ్చెనఁటిపోకలఁ బోవ మదిం దలంచినన్. 499

క. ఉడుగుమిఁకను నట్లయినం, జెడితిమి నీసత్యమింతచేసె నయం బె
క్కడబోధించినదానిం, గడచెవులం గూర్పవనుచుఁ గరటము మఱియున్. 500

క. నిలుపోపరానియాఁకటఁ, బులిపిల్లల భుజగమండముల భక్షించున్
గలుషమునకు రోయునె నీ, తులు దలపోయునె బుభుక్షితుఁడు చిత్తమునన్.

ఉ. ఏవిధి నీతిపద్ధతికి నేగుదయాపరతంత్రచిత్తుఁడై
కైవడినా మహాదురితకర్తుఁడుగా కెటులుండుధర్మసం
భావితుఁ డెట్లగు న్వినయపాటవ మేక్రియ నేర్చు గౌరవం
బేవలన న్భజించుసుఖ మేగతిఁ గాంచు బుభుక్షితుం డిలన్. 502

క. కుక్షిదరికొన్నపట్టున, వీక్షించునె దేహిరుచులు వేళలు మునిహ
ర్యక్షము విశ్వామిత్రుఁడు, భక్షింపఁడె సారమేయపలలముఁ దొలుతన్. 503

గీ. కలశజాఁడు చూడ నొకరాజు కానలోన, దండియాఁకటఁ దనమేను దానె తినఁడె
బలుపుతఱిఁ బుణ్యధనులు గీర్వాణమునులు, చేరి పీనుఁగుఁ గఱచి భక్షింపరొట్టు.

గీ. కఱవునకుఁ గాక మున్నొక్క కాఁపుకొడుకు, దారపుత్త్రాదులవధించి తానె తినఁడె
యాపదలచోట నియమకార్యము హాలికి, శాస్త్రిమతమిది వలదు దుస్సంశయంబు.

క. పోషించి చంప నోహో, దోషంబని బుద్ధిదలఁచెదో సస్యములం
బోషించి కాదె కోయుదు, రీసత్కల్మషము గలిగెనే యచ్చోటన్. 506

చ. అమితవిరోధి వీవు నిమిషార్థము నీకు శరీరపాటనం
బమరక యున్నరాజ్య మభియాతులపాలగునట్లు గాన నా
శమునకు మూలమిచ్చెదు విచారము దూరముఁ జేసి చంపుము
ష్ట్రిము జఠరాగ్ని నార్పు తరసంబిడు మాకు దయామయుండవై. 507

చ. మొఱయిడు 'స్వాశ్రితావనసమానహీధర్మ' మటంచు వేదముల్
పరిజనరక్షమేని కనపాయిని దానిఁ ద్యజించి సూనృతా
చరణముఁ బూనియుండెదవు చాఁగుర జీవితవిత్తమానభూ
సురహరణాదికార్యములఁ బో గణియింప రసత్యదోషముల్. 508

క. బలసంపద వలెనో కే, వలనూనృతభాషణంబు వలెనో నీలోఁ
గలతలఁపుఁ జెప్పుమని గా, సిలియేడ్చినఁ గాకిఁ జూచి సింగంబనియెన్. 509

క. మతిమీఱ మీరు నాచే, నితనికి నిర్భీతి దాన మిప్పించితి రుం
చితి రానోల్లనె నేఁ డు, ద్ధతులై వధియింపు మనియెదరు కథనకునిన్. 510

క. మఱిఁ జూచునె శరణాగతు, హతుఁ గా నెటువంటికుటిలుఁడైనను బుణ్య
శ్రుతులు పనిగొనుమదీయ, శ్రుతు లాకర్ణింప నేరుచునె మీకాఱుల్. 511

క. శరణాగతరక్షణమునఁ, దురగక్రతుఫలము దొరకు దొరకుయశోలం
కరణభృతి గలుగుఁ దొలఁగు, న్దురితంబులు చేర వొందు దుఃఖౌఘంబుల్. 512

ఉ. చేరదు కీర్తి గౌరవము చిక్కదు రాదు శుభంబు పుణ్యముల్
నీఱగుఁ బాప మంటుఁ బ్రజ నిల్వదు కొల్వదు కష్టకట్టు వీ
రారులు లెక్కఁ గాఁగొన రహర్దివసంబు విపత్పరంపరా
భారము కొండలై పెరుగు బాపురె సత్యములేనిపట్టునన్. 513

క. కృపఁ గట్టిపెట్టి మీపా, పపుబుద్ధులఁ బట్టిపట్టి పగవుట్టి విని
ష్కపటుఁ గథనకునిఁ బొరిగొని, నెపపడి పడియుండువాఁడనే నే నకటా. 514

వ. అని ముగియంబలికిన హృదయనిర్భిన్నకాలాయసంబవ్వాయసంబు మృగపతి కిట్లనియె. 515

చ. చెవిఁ జొర వేసవిన్నపము జేసినమాట లొకించుకేనియున్
శివశివ యెంతవేడ్క యనుజీవులఁ బావులఁ జూడ నిన్ను రే

పలుకుల గొల్చి టీయిడుమపాటునకా యిటులో పెఱుంగ నె
ట్టవునికఁ సత్యమా నెచటికైనను బోయెద నేను వీరలుణ్. 516

క. అనఁజనదు తగులుతగులని, తనువుం బ్రాణంబుకంటెఁ దగులెద్దియొకో
చనుతనువు విడిచిప్రాణము, చనఁబోలనివారు గలరె సమయంబైనన్. 517

క. పాటించి విడువ ముడువ, న్నీటబ్బకయున్నఁ బోవ నీకయ్యమునన్
బోటరిమగలకు కాటికి, గూటికి నీదిరమె రాచకొలువేమిటికిన్. 518

క. సుడువులన బంగాలుపందిలి, యిడి హస్తము బలుసుముంటికనరై దినముల్
గడపుచుఁ బొమ్మను నయ్యా, గడపున్నృపుంబాయుఁ జేగగలసైన్యంబుల్. 519

క తనకోటరుఁ గఱకురిపులం, గని యని ముదలించి పొలియుఁ గన నశ్రద్ధం
గనుఁగొనక మనుజపతికిం, దనమేనిం బోలెఁ బ్రోవఁదగు భటపఙ్క్తిన్. 520

క. నీ కెన్నరు నేఁటికిఁ గట్టా కడపట నుష్ట్రమొక్కఁడసహాయముగా
భీకరపరిపంథిజయో, త్సేకివి గష్టని విషాదశిఖిలోమండన్. 521

వ కాక వ్యాఘ్రగోమాయువులు స్థలాంతరంబున కరుగ నుద్యోగించిన. 522

క. బఁహానికిఁ జిత్తమునం, గలఁగంబడి మాటపట్టు గలరాజయ్యుం
దలవంచియుండెఁ గేసరి, ఖలుల కసాధ్యములు లేవుగద లోకమునన్. 523

వ అటులద్భావకాశంబై కాకవ్యాఘ్రగోమాయువులతో నేకాంతంబుచేసి కథనకుం బిలుచుకొని లోపలి కరిగి నిలువంబడియె నందు వ్యాఘ్రంబు మ్రొక్కి నిలువం బడి కేసరి కిట్లనియె. 524

మ. సటులంకించుట యొప్పు దత్యవనతాస్యంబెత్తి నానాహరి
త్కటకంబు ల్పరికించుటెప్పుడు దృఢస్కంధంబునం బొందుగా
దిట మావాసముఁ జేయుటెప్పు డకటా దేహంబు సామర్థ్య నాఁ
కటి కడ్డంబుగ నారగింపు మివె కాకవ్యాఘ్రగోమాయువుల్. 525

క. ఏవెంటఁ గడమపటుపక, దేవా మము సంతరించితివి నీపాలం
జావగుట దమకుఁ దగునటు, గావున భక్షింపు మనరఁగా నేమిటికిన్. 526

క. అనిపలికి తొలఁగె బెబ్బులి, చనవున పంచకము వాయసము దొడ్డొన
ట్లనపలికె నపుడు కథనకుఁ, డనఘుం డప్పదరు లారయక తా ననియెన్. 527

క. మృగవల్లభ యాఁకటిచే, సగమైతివి నీకుఁ గైవసముగా నన్నుం
దగ దె కనంగొన నీపా, లగుఁ గథనకుఁ డారగింపుమా చేసేఁతన్. 528

క. అనువచనము లోవెలిగాఁ, బెనురొదతోఁ గటిచి వ్రచ్చె బెబ్బులి పింహా

బున కొసఁగెఁ గథనకామిష, మునఁ దృప్తింబొంది కాకముఖులకు నొసఁగన్.

వ. ఇట్టి మాయావు లున్నచోట సత్యంబు మూఁగవడి కల్ల వెల్లివిరియుఁ దింగళకుం
డును మదోత్కటంబునడువునఁ సుమంత్రి మంత్రయంత్రంబునం దగులువాఁడు
గాఁడె యనవిని దమనకుండు క్షుద్రపరివారుం డగుట భూరమణున కొప్పఁజే
యుదోకో చెప్పుమన సంజీవకుం డతని కిట్లనియె. 530

చ. అమరుమరాళసంవలితమై సితగృధ్రము హంసమట్ల హం
సము పరుషశ్మశానఖగసంవృతమై కనుపట్టు గృధ్రము
ట్లమలమతు ల్దురాత్ము విమలాత్మునిఁ జేయుదు రల్పు లుత్తముం
దమవలె నుండఁజేయుదురు తద్ద్వయి నెయ్యది మేలు చెప్పుమా. 531

క. కీడెఱుఁగరు మేలెఱుఁగరు, చాడీల జెవిఁ జేర్తు రుఱక జనలోకవిభుల్
పాడియుఁ బంతము గలదో, ఛేడ దొరకుఁ గొలువ నిలువ నెవ్వారలకున్. 532

క. న్యాయం బన్యాయంబని, కూయిడి చెవి నిల్లుగట్టుకొని చెప్పంగా
నేయోజ నీవనకుండున్, మాయావులమాట లెట్టిమహిపతికైనన్. 533

క. ఏకరణి వికలితాత్ముఁడు, గాకుండుం బతి పరోపఘాతనకరణా
స్తోకన్యాయామార్గరీతి, జీకృతముఖదుర్జనావినీతులచేతన్. 534

వ. అవశ్యంబు రాజులు చెవి పేదలని పలికి వెండియు సంజీవకుండు. 535

క. కులిశమును రాజతేజముఁ, దలపోయ మహోదురాసదములచలములం
గులిశము వసు నృపుతేజము, పలుకులు వేయేల తునియఁబడు నెల్లెడలన్. 536

ఉ. కావున రాజు నా దెస నకారణవైరముఁ బూని ద్రోహచిం
తావశుఁ డయ్యెఁ జాలు నిఁకఁ దద్భుజనంబు మహాపరాక్రమ
శ్రీ విలసిల్ల గయ్యమొనరించెద గెల్చెద గెల్పు దక్కినం
జా వమరు ద్దిగంతపరిషత్ప్రథ చేకుఱు శంక యేటికిన్. 537

చ. సవనము లాచరించి కనుశక్రనికేతము భూరిదానధ
ర్మవిధు లొనర్చి కాంచుసురమందిర ముగ్రతపస్సమాధులం
దవులు మరుత్పథం బతులితత్వరఁ సూరుఁడు గాంచుఁ బ్రాణముల్
తవతప లేక నిల్చి జగడంబున నెత్తుఱు నూడ్చి పుచ్చినన్. 538

క. గెలిచిన సిరి దొరకును నిం, బొలిసిన వరంభాదియువతిభోగము దొరకున్
దలగడ యదగద మృత్యువు, కలనికిఁ జావునకు వేలకళవళమందన్. 539

చ. బలము యశంబుఁ బ్రాభవముఁ బ్రాణము రాజ్యము మూలవిత్తమున్
గలవ నరక్షణీయములుగావె మహామహులైనవారికిన్

గలదొకచిత్ర మాజియందుఁ గన్మృతి నిక్కువ మాహవార్థిస్థై
మలసినచోట మృత్యు వనుమానము మాటలు వేయు నేటికిన్. 540

క. పింగళకునితో మాఱ్కొని, సంగర మొనరింతు నొంతుఁ జంపుదుఁ జత్తున్
భంగమున కోర్వననువం, తం గటకట యిడికిపలికె దమనకుఁ డతనిన్ 541

క. విమతునిబల మరయక వై, రముఁ గొనుజనుఁ డేర్పడం బరాభవమందున్
సమధికబల మగుటిట్టిభ, కముతోఁ బగఁబూని చెడినకంధియువోలెన్. 542

క. నావిని దమనకుసకుసం, జీవకుఁ డిట్లనియె నీతికెలా యేలా
గీవిధముఁ దేటపడఁ జెపు,మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 543

చ. త్రిభువనకీర్తితాంబునిధితీరమున న్మనుఁగల్గియుండుఁ డి
ట్టిభమిథునంబు దైవగతిఁ డిట్టిభిదోహ్యదలాలసాంగియై
శుభమతి ప్రాణవల్లభునిఁ జూచి ప్రసూతికి వేళయయ్యె ధీ
విభవ యెఱుంగఁ జెప్పఁగదవే స్థలమెయ్యది నాకు నావుడున్. 544

క. టిట్టిభ మిట్లను నీకుం, గట్టనినీడములు గావె కంధితటంబుల్
పట్టయినచోట గ్రుడ్లం,బెట్టుము నీవనినఁ డిట్టిభిక కనలెసఁగన్. 545

క. మగనిఁ గని పలికె నేలా, తగుఁ దగదన కిట్లుపలికెదవు వనధితటీ
జగతిని గట్టనిగూఁడె, ట్లగు నీకిది యంతకొంచెమా కనుఁగొనగన్. 546

ఉ. పిట్టవు నీవు వారినిధిపెద్దలకల్లను బెద్దవెల్లిగాఁ
దొట్టునొ కానొకప్పు డతిదూరము తుంగతరంగసంఘముల్
బెట్టడఁచున్ హరించునతిభీమభుజంగములీల నెట్టుగాఁ
బెట్టుదు నూతికట్టఁ బసిబిడ్డలు గావె మదంపపిండముల్. 547

క. కానకకాంచిన యీసం, తానము మనవలయు వార్ధిదరియేటికి నె
వ్వానైన నిపుడ యొండొక, తానక మెఱఁగింపు పెట్టెదం గ్రుడ్లచటన్. 548

క. నావిని యెఱచెలువు కనుం, గ్రేవలఁ గేవలము తేరఁ గెరలి కఠోరా
రావమునఁ దనయనుంగుం, బావని నీక్షించి టిట్టిభం బిట్లనియెన్. 549

ఉ. ఎక్కినవానికిం గుఱుచయేనుఁగు నీకసదైనవైతిఁగా
కక్కువగానె నన్నెఱుఁగు నీసరిదీశుఁడు నాకు వార్థికిన్
దిక్కరి మత్తికాంతరము దెల్పఁగ నేటికి గ్రుడ్లఁబెట్టు మే
దిక్కునసైన వానిదెసఁ దేఱికనుంగొనఁ డీఱదేరికిన్. 550

వ. అనువచనంబు లాకర్ణింపంగూడక ప్రాణేశ్వరి ప్రాణేశ్వరున కిట్లనియె. 551

క. ఇష్టజనోక్తులు వినక వి,నష్టదశం బొందుదుర్వినయుఁడు మరాళో
త్కృష్టోక్తిఁ జనకకాష్ఠ, భ్రష్టంబై తెగినకచ్ఛపముచందమునన్. 552

క. అనుమాటలు విని టిట్టిభిఁ, గనుఁగొని టిట్టిభమువల్కెఁ గల్యాణీ యే
మినిమిత్తము హంసోక్తుల, వినవొల్లక కమఠ మీల్గె వివరింపఁగదే. 553

క. నినుఁ గతలకాఁచియునిపే, ర్కొను నావచనంబు నిజముగు న్మగువా నా
కనురాగంబున నీకథ, వినియెదఁ జెపు మనిన నయ్యువిద యిట్లనియెన్. 554

ఉ. కుంజకుటీవిహారములకుం జనఁ జెంచులు నిర్ఝరంబులం
గుంజరము ల్నటింప బలుగూడెపుబోయలు చాలు వేఁటసాఁ
గం జెలరేఁగి సాళువపుగ్రద్దలుగూండ్లకుఁ బుల్లుమోవనిం
కం జెఱువు ల్భయంకరముగా నొకవేసవి దోఁచె తోఁచినన్. 555

క. కలెత్తి యిసుముఁ జల్లిన, రాలనియొక కానలో మరాళీవికస
న్నాళీకమధూళీమ, త్తాళీనాళీఖురాళియుగకోలనొప్పున్. 556

వ. అది సమగ్రశరంబును సమదసారంగభాసురంబును స్వర్ణపత్రరుచిరంబును నై సంగ్రామంబును ననిమిషకులాధారంబును నమృతరసపూరసంభారంబును ననవద్యతరువిస్ఫారంబును నై సురగ్రామంబును నిర్వియుక్తరథాంగంబును నిత్యకమలానుషంగంబును నిసర్గమధురగణచందంబును నై వైకుంఠధామంబును బరివేష్టితద్విజాతంబును బావనశిఖిసమేతంబును బరమనిగమపూతంబును నై హోమంబునుం బురుడించు. 557

క. అకొలను నాఁడునాఁటికి, వెక్కసమై క్రాఁచువెట్ట వేసవుల నసల్
చిక్కజలమి విరిపోయినఁ, గొక్కెరలకు జతము మీలకు న్భయమయ్యెన్. 558

క. ఆవిపినసరసిఁ గంబు, గ్రీవుం డనుకచ్ఛపము చరించు నతని క
ల్చో వికటసంకటము లనఁ,గా వరహంసములు రెండుగల వనుఁగుఁజెలుల్. 559

ఉ. జాలిఁ దలంకి యవ్వికటసంకటకంబు లపారదూరయా
త్రాలసదీనతోవతనిజాస్య వయస్యగుఁ డెంచి యిట్లనున్
రాలును నాఁచు జిక్కనిపురంబడియెం గొలనెట్టు నిల్వఁగాఁ
జాలుదు మెందుకేనియును జాలుదుమే నినుబాసి కచ్ఛపా. 560

క. ఈయిరవున నఖమాంస, న్యాయంబున నున్నమనల నయ్యో చెడుగొ
ట్టయి యాఱడి విధికుటిలో, పాయంబునఁ జేసెఁ గంటె పాయం ద్రోవన్. 561

క. కావున నన్యసరోవర, సేవారతిఁ బోదుమా రసికవర్యా యిం
దీవుండు మనినఁ గంబు, గ్రీవుం డిట్లనియె వారికిం బ్రియమెసఁగన్. 562

క. లావును గలిగినవారలు, గావున మీతలఁపు లోప్పాఁగద నేనన్
న్నీవంటివాఁడఁ గాఁగద, యేవిధమున నిలుచువాఁడ నెక్కటినిచటన్. 563

క. అతివిమలపుణ్యమానస, యుతు లమలాకృతులు సుగతియోగ్యులు మఱియా
శ్రితపక్షపాతు లకటా, హతమోహులభంగి వరుగనగునే మీకున్. 564

వ. నాకెద్ది త్రోవ యని విన్నంబోయి యున్న గదుపునఁ జేయిడి కలంచిన ట్లగుటయు
మరాళంబులు గంబుగ్రీవు నూఱడించి. 565

క. జడియకు మనఘా నీకుం, గడవారమె నిన్నుఁ బాయఁగా మాచిత్తం
బొడఁబడునె యెుండుమాటలు, తడయక మాపనుపుఁ జేసెదవె యట్లయినన్. 566

క. తరలక యేతత్కాష్ఠాం, తర మిఱియంబట్టు నిశితదంష్ట్రల నదిమే
మిరుగడలఁ గఱచుకొని సత్వర నాకాశమునఁ బఱచెదము నేఁ డొప్పన్. 567

చ. అనఘసరోవరాంతరమునం దిడునంతకు మానముద్రఁ గై
కొనవలయుం జుమీ యని సఖుం గమఠాగ్రణి నవ్విధంబునం
గొని యలవానజాలిపులుఁగు ల్గగనంబునఁ బోవ త్రోవలో
చనమహమాచరించె విదిశానగరంబు సమగ్రసంపదన్. 568

క. పరిఘలు గోటలు మేడలు, కరులు శతాంగములు హరులు కాల్బలములు భూ
సురులు భుజభవులు వైశ్యులు, చరణజులుం గలిగి యొప్పసఁగు నవ్వీటన్. 569

క. కరిబృంహితంబు లూఘ, త్వరపాదశికాశ్వహేషితంబులు రథ్యా
చరదఖిలజనరవంబులు, శరనిధి ఘోషించినట్లొసఁగ విని మింటన్. 570

వ. కంబుగ్రీవుండు వికటసంకటంబులం జూచి. 571

క. ఇల విననయ్యెడు నేత్రత్కులకల మెఱఁగింపుఁ డనినఁ గఱచినదంష్ట్రల్
వెలువడినకాష్ఠకాండో, ద్గళితంబై నేలఁ గూలి కమఠము పొలిసెన్. 572

క. నీవును గంబుగ్రీవుని, కైవడి సుహృదుక్తియందు గాఢాదరముం
గావింపక చెడుద్రోవం, బోవుదు వని పలికి వల్లభున కది మఱియున్. 573

క. పలికె నొకమడుఁగులోనం, గలరు ఝషత్రితయమందు ఘననీతికళా
కలితములు రెండు తక్కిన, జలచర మతిమూఢతావశంగత మరయన్. 574

క. నావిని టిట్టిభకము దన, దేవి నిరీక్షించి గుణవతీమణి చెపుమా
యావిధమంతయు వివరము, గావేడుక ననిన నది మగని కిట్లనియెన్. 575

క. మున్నొకమడుఁగునఁ బ్రత్యు, త్పన్నప్రజ్ఞుం డనాగతవిధాతయు న
న్యస్మృతి యద్భవిష్యుఁ డ, నన్నెగడు న్మూఁడు మీలవఘుఘనతరముల్. 576

సీ. ఘనశిలాయుతమరుత్కపిలవిద్యుల్లేఖచండదావహుతాశసామిధేని
సమజము స్తకనగస్వరుపాతమహిమరుగ్జలజరాగమహోదళాణచక్ర

మత్స్యన్యచరణలగ్నాందుబహుసింధుపాథోరసగ్రాహిహాటకబంబు
ప్రేంఖదాతపశిఖిన్యాంఖంబుదశదిశావృతమృగతృష్ణాతివ్యాప్తిఘనము
తే. చించికాఫలహ్యాప్తఘృష్టిప్రచండ, ఖురచతుష్కక్షురతీక్ష్ణపరిణతాజ్య
పాకసురభితగిరిదృషత్ప్రసవకంబు, కటికివేసవి దోఁచె నక్కాలమునను. 577

క. వలిఁబోరలు నీటఁ గొండొని, నలఁగినయాఁతీగమడుఁగునకు నొండొకవాఁ
డలసేతరగతివలగొని, వలఁగొని యొకవేటకాఁడు వచ్చెం జొచ్చెన్. 578

క. చొచ్చి యగాధజలంబగు, టిచ్చం దలపోసి వేఁట కిది సమయముగా
దచ్చపుటెండలలోఁ బడి, వచ్చినతరువాతఁ దిరిగి వచ్చెద ననుచున్. 579

క. అన్నిచుఁ డరుగుటయు నను,ద్యన్నితిధనుం డనాగతవిధాత సము
త్పన్నమతి యద్భవిష్యల, సన్నిధికింబోయి ధీమసంబున పలికెన్. 580

క. తెలతెలవారఁగఁ దోరపు, వలఁగొని యొకవేఁటకాఁడు వచ్చెం జొచ్చెం
జల మివిరినఁ జట్టలతో, నలయుకమరి మరలివత్తు ననియె న్ననియెన్. 581

క. జలమివిరిన జాలరు లీ, తలమునకద నరసివచ్చెదరు వారిచర
ప్రళయమగు నిలువవల దీ, సెలవున నొండెడకుఁబోయి నిలుతమి బుద్ధిన్. 582

వ. అనువాక్యంబు లాకర్ణించి ప్రత్యుత్పన్నమతి యనాగతవిధాత కిట్లను సఖా దూరంబున నేమికార్యం బుత్పన్నం బైనప్పటికిఁ బోలినతెఱంగుఁ జూచికొందము.

క. నెట్టన నొండొకకార్యము, వుట్టిన నెన్నటికి నిశితబుద్ధిగలుగు నా
దిట్టం డాకార్యముఁ గొను, గుట్టున జారద్వయమున గొల్లెతవోలెన్. 584

క. నావిని యతిధీరతమే, ఘావననిధి యల యనాగతవిధాత యనున్
బావనమానస యిదిచెప్పు,మా వినియెద ననిన వతని కతఁ డిట్లనియెన్. 585

చ. గొతియలమంద యాఁబకులగుంపు కృషిక్రియదుక్కెటెడ్లదొ
డ్డితికిటిపెళ్ళుకంప బలియుంచిన లోఁగిలిముల్లుపెండెముల్
తఱుపులగాడికోడి యల దామెనగాడెలఁ గొల్చుగల్గి యే
కొఱఁతయు లేకయుండు నొకగొల్లత యొండొకపట్టణంబునన్. 586

చ. వన్నెలఁ బెట్టుఁగట్టుఁజలువ ల్చలువ ల్వేదచల్లుచన్నులన్
గన్నులకల్కి పూయునిరిగందము మందమరుత్కిశోరముల్
జున్నులు రేఁప మెచ్చుముడుచు న్గమఁజొక్కపుఁ గ్రొవ్విరు ల్సరుల్
పన్నశిరోధిశిథిఁ గనుపట్టు నయారె యొయారమేర్పడన్. 587

ఉ. పాయనిఖండమండి యడపాదడపా చనుదెంచుబోయనిన్
బోయినఁ జీరజిక్కఁదఁట పుణ్యముశేదని మానసంబునం

ద్రోహియ కహోపరస్థలముఁ ద్రొక్కియుఁ జూచినయేని నాలుగే
గాయలు గాయ వచ్చెలువగర్భమునం దెటువంటిపాపమో. 588

క. కని పెంచని గోడాలిది, గననోడలు ద్రోవలు నడలు కటి సెన్నడుముక్
జనుదోయి మెఱుఁగుజిగిబిగి, యనయంబుం ద్రచ్చివేసిన ట్లొప్పెసఁగన్. 589

ఉ. వేవిన నిద్రమేలుకని వేఁబోక బానకు సేర్పుతోడఁ బై
మీఁవడఁ బుచ్చి కవ్వమిడి మిట్టచనుంగవ రాయడింప మేఁ
దీవ నటింప సెన్నడుము దీలుపడం గటిగుల్కఁ గాచముల్
జోవలఁ బాడజల్లఁదరుచు న్వడిఁ దర్శిణిరజ్జుపాణియై. 590

చ. వెడవెడ వేడివెన్నొరయు వేవలి మస్తకసీమఁ దక్రపుం
గడవ యొకింత పయ్యెదకుఁ గాకరదోఁచును రోజమాఱ్యపుం
బిడుతపి కాంగనోక్తి వలపించు నెలుం గమరంగ వీటన
ప్పడఁతుక చల్లవిల్చుఁ గనుపండుపు జారుల కావరింపుచున్. 591

క. అది దండపాలకుం డను, మొదలితలారి న్రహస్యమునఁ బిలుచున్నాఁ
డెద నెఱుఁగకుండ నొండొక, కొదవయు రాకుండ వానికొడుకు న్బిలుచున్ 592

క. ఈలీలఁ దిరుగఁ నొండొక, కాల మరిగె నరుగుటయు నొకానొకనాఁ డ
చ్చాల్యలరి గొల్లెతెపట్టణ, పాలతనూభవునిఁ గూడి బహురతిగతులన్. 593

క. చొక్కి నెవ దండపాలకు, డక్కడి కతెంచె నప్పు డాతనిఁ గని తా
స్రుక్కక తర్షణి తత్సుతు, నొక్కకుసూలమున దాఁచె నుచితం బెసఁగన్. 594

గీ. దాఁచి యెదురువోయి దక్కినగతి నవ్వు, నివ్వటిల్ల వదననీరజమునఁ
గూర్చి చెట్టఁబట్టుకొనితెచ్చె లోపలి,కవద గారినారి యత్తలారి. 595

క. తెచ్చి కుసూలములోపలఁ, జొచ్చినబోఁజఁగెగసి యెగసి చూడఁగ నపుడా
దిచ్చరి హెచ్చరికఁ బ్రియుం, గుచ్చిరతిక్రియాలసొంపు గులుకుచు నుండెన్ 596

వ. ఆసమయంబున. 597

సీ. అట్టలెత్తినప్రాఁతమెట్టులు కడుగుటంబటిచాటికలతోడి వరువకాళ్ళ
నడిప్రాఁత ముతకగోణము మించుగులకించు ములుగత్తి యలిమిడి మూలికలును
కొడిదిపూసల నంటుకొలిపిన మొలత్రాడు తెలదుడ్డుచిరుఁగంబులపాదసుఖను
నాడిసెలపాలకావడి నుచ్చుప్రాతలగుది మూఁపుపై వ్రేలఁగోర్పడంబు
తే. తూఁతకొమ్ము చంకదోఁపినయెడమెట్టి తోర్లు గోవిధూళిధూసరితము
లైనకురులు నమర నాకస్మికంబుగా, మందనుండి యింటిమగఁడు వచ్చె. 598

క. వచ్చిన జడియక కౌఁగిటఁ, గ్రుచ్చిన యలదండపాలకున కనునపు డా

దిచ్చరికంబే కావడిఁ, దెచ్చెను బతిచేయు మొక్కలెల్లఁ గతిఁగింతున్. 599

క. కసరెత్తి ముక్కడుస్సిన, పసరమువలె రేఁగి పరుషభాషల నన్నున్
విసువక పగఁజాటుచుఁ బ్రాహ్మసమున నన దండపాలుఁ డట్లానరించెన్. 600

క. ఆరెకుఁ డట్లరుగుటయుఁ జకోరేక్షణఁ జూచి గోపకుం డనుమహిళా
కారణ మేమీ తెలవరి, కీరూపున వన్నెమెఱసి యిం దరుదేరన్. 601

క. వచ్చుటయుఁ గాక నోరికి, వచ్చిన యట్లెప్పురేఁగి పదరుచుఁ జూడ్కిన్
గ్రచ్చెగయుఁ బోవుచున్నాఁ, డచ్చెరువిది తెలియఁజెప్పుమా నాకనుడున్. 602

వ. తద్దణి మగని కిట్లనియె. 603

క. వెడవెడ నార్చుచుఁ బెతికిన, పిడియము వలకేలఁ గ్రాలఁ బిఱబిఱవెంటం
బడి యాపోయెడువుగ్గుం, గొడుకుం దెగఁజూచె నిందుకో నేనెఱుఁగన్. 604

క. తఱుముడువడి మేన్వడకం, బతిపతి యగుతాల్మిఁ జావు పఱువెత్తి యహో
వెఱపున నిలుసొచ్చినఁ గడు, పతిమతిఁ జేపెట్టి కలఁచినట్లయ్యెఁ బతీ. 605

వ. అట్లు భయాతురుండై యిలుసొచ్చివచ్చిన వచ్చిఱుతవాని నతిస్థూలం బగు కుసూలంబునం దాఁచితి. 606

క. అప్పుడు కన్నులనిప్పులు కుప్పతిలఁగఁ గరలిపండ్లుగొఱుకుచు వాఁడా
చొప్పునవచ్చి నన్నిటఁ, దప్పక వీక్షించి ప్రల్లదంబునఁ బలికెన్. 607

క ఎచ్చరిక నిలిఁగి వెంటన, వచ్చితి నీయిల్లుసొచ్చె వాఁడులుకున నేఁ
డిచ్చట లేఁ డెందరిగెన్, దిచ్చట నిక్కము జెప్పితే మేల్గాదే. 608

క. అనియదరవైచి నన్నడిగినవానిం జూచి మొత్తిగిలఁ బడకంటిన్
నిను నెవ్వఁ డెఱుఁగు నెటుసో, యినవాఁడో నీకుమారు నెవ్వం డెఱుఁగున్. 609

క. తెలవరివిగావె యూరం, గలకొంపలఁ జొచ్చి చూచి కనుగొనుము నీ
కుల ముద్ధరించుకొడుకుం, దలయెవ్వరిమీఁద నొత్తిగెదవు నీవనినన్. 610

వ. ఇప్పు డప్పురుషభాషణంబులుం బలుకుచుం బోవుచున్నాఁ డనిగాదె వెలువరించిన.

క. నిరవధికరాహుముఖగ, హ్వరనిర్గతశీతభాను, డనఁ గట్టైదురన్
బురరక్షకసుతుఁడుండన్, హరిణేక్షణ నెంతిదానవని పతిపొగడెన్. 612

వ. కార్యం బుత్పన్నంబైనఁ దర్షణివలెఁ బోలినతెఱంగుఁ జూచికొందమని ప్రత్యుత్పన్నమతి పలికిన యద్భవిష్యుం డమ్మాట లాదరింపక యూరకుండె. అనాగతవిధాతయుం దండు నిల్వ వెఱచి యల్పసలిలసరణంబున నొండొకసరసిజశరణంబునకుం బోయె నాయెడ 613

సీ. కాలు మొసళ్ళవాకట్టుమంగులు చరణాంగుళంబులఁ దాఁకుటుంగరములు
కడలేనిదగట్టి పడినపిక్కలు చుట్టి చెక్కినమొలత్రాళ్ళు చిక్కములను

జొంగులల్లాడుగోఁచులు తెండుగోలల వెట్టుకొల్పినమీలపుట్టికలును
బ్రతిదినాందోళికాభృతినల్పులై పెంద్రుకలు నిండి కాయలు గలభుజములు
గీ. చెవులవెలుములుకులుబ్రాత చెవులనాగు, పడిగపోగులు మెలిగొన్నపచ్చడములు
నమరగుమిగూడి జాలరు లరుగుదెంచి, కలరుమొగములతోఁ ద్రాటివలలు గొనుచు.

ఉత్సాహ. వచ్చి తజ్జలస్థలం బవారణం గలంగి రాఁ
జొచ్చి జాలముల్విదుర్చుచోట యద్భవిష్యుఁడు
ల్కచ్చలోనఁ గందళింపఁ గెందుఁ జొత్తువంచుమేన్
జిచ్చపాటునొంద నత్తఱిం జరించె నల్గడన్. 615

క. తున్నాడి యొడలు డాఁపక, యన్నిటను జచ్చి తేలినటువలెఁ బ్రత్యు
త్పన్నమతినీతిరతియుం, డెన్నిరుపమధీరతాపటిష్ఠుం డగుటన్. 616

క. జాలరులు దానిఁ జచ్చిన, వాలుపగా నిశ్చయించి వలెవనక సరి
త్కూలమునకుఁ ద్రోచి సము, ద్వేలగతిం దిక్కులంబు ప్రేలఁగేలిపన్. 617

క. దుముకులు వైచుచు నాఁయా, సమయంబుల జలములెత్తి చల్లుచు వలల
త్రిమలీలవైవ నయగుణ, విముఖుఁడు దొలుదొలుత యద్భవిష్యుఁడు చిక్కెన్.

క. చిక్కిన లగుడంబునఁ దల, ప్రక్కలుగా మోఁది చంపి వైచిరి మఱియుం
బెక్కుఝషంబులఁ బట్టిరి, యక్కలసము మాని తనిసిరది సందగుటన్. 619

సీ. కైవర్తకశ్రేణి కనుభ్రాంతి యొకదొడ్డమనికి ప్రత్యుత్పన్నమతి వసించె
మతిబలంబున ననాగవిధాతయు నొండుకడకు బోవుటఁ జేటుఁ గానఁడయ్యె
విమతి గావున యద్భవిష్యుఁ డేమియు లేక పొలిసి జాలరులకు భుక్తియయ్యె
నతిమూర్ఖునకు నపాయము రాదె యిట్లని వరునకుఁ జెప్పి తొవలము లేమి
గీ. నంబునిధితీరమునఁ గులాయం బమర్చి, కొని కలంగుచుఁ డిట్టిభి గ్రుడ్లఁ బెట్టి
పొదిగ నేమఱుపాటు లేకదనఁబదన, కలుచపడకుండ నొండొంటిఁ గలపికొనుచు.

క. టిట్టిభకాహంకృతికిం, గట్టల్క జనించి కడలికడ నొండొకచోఁ
బెట్టినగ్రుడ్ల హరించెం, బిట్టతి వీక్షించి టిట్టిభిక గాఢార్తిన్. 621

చ. కనుఁగవ బాష్పవారి దొరుగ న్వరుఁ గన్గొని దూరి యప్పు డి
ట్లనియెఁ బయోధితోఁ గలహ మావిహగంబున కెంతలేదు పా
ప్మునక చెవంటినై భవదహంకృతినమ్మి ప్రసూతినైతి ని
వ్వననిధితీరభూమినిదె వాఁడె హరించె మదండపిండముల్. 622

క. జలనిధి యుత్కృష్టంబని, తెలిసియు నీ వలఁతి వగుటఁ దెలిసియు బ్రజ్ఞా
బలముఁ దుదఁ జిదిమి యకటా, వలవంతంగంటి గౌరవము వీడ్కొంటిన్. 623

క. నీకతనఁ దనకు వాటిలె, నీకాతియ యనుచుఁ జిత్త మెరియంగా శో
కాకులమతిఁ బతిదూఱిన, వాకంతక్రోధవివశమై ఖగమనియెన్. 624

ఉ. ఇంతదురంతచింతదగునే నను నెవ్వనిఁగాఁ దలంచితో
యింతి మదీయశక్తి యసుదేవసుదేవదురాసదంబు నేఁ
డింతకుఁ జొచ్చి వారినిధి యేపున మ్రుచ్చిలికొన్నగ్రుడ్లఁ గ్ర
క్కింతు భవద్ఘనార్తిఁ దొలఁగింతు ధరింతు యశఃపరిష్క్రియన్. 625

చ. అని నిజదార నూఱడిలునట్లుగఁ బల్కి పయోపయోమణు
ల్దనుఁ గనుఁగల్గి కొల్వఁ జని తత్పతగాగ్రణి గాంచె ముందఱన్
ఘనబలఘాతిహేతిభయకంపసమాగతమేనకాసుతా
వనకరణప్రహృష్టహిమవన్నగముద్రుఁ బయస్సముద్రునిన్. 626

వ. కని తత్పారావారతీరంబున. 627

సీ. తనతల్లి కగ్గొనర్చినపాప రామాత కడుపునఁ గడిఁది చిచ్చిడినవాని
గజకచ్ఛపాహ్వాతిగ్రాసచర్వణతృప్తి వెలుఁగొందు జాఠరానలమువాని
ముఖసరిద్విటమధ్యమున నసాధు నిషాదఘోరవాహిని నుంచుకొన్నవాని
లావు పెంపునఁ గులగ్రావపక్షచ్ఛేదనిశితాసి వేఁడి మానిచినవాని

గీ. నెల్లజగములు దనలోన నిముడుకొనిన, నిశిచరారంభసంరోధినిజశిరోధి
దివ్యమణిబోలెఁ దాల్చి వర్తించువానిఁ, బరమకారుణపూర్ణు సుపర్ణుఁ గనియె 628

క. కని మ్రొక్కి నిలువ వినతా, వనితాసమ్మదవిధాయి వచ్చినకార్యం
బనుచరముఖ్యా నాతో, ననురాగం బొప్పఁ జెప్పుమా నా కనుడున్. 629

మ. పలికెం డిట్టిభ మో విహంగకులదీపా కోప మేపార న
జ్జలధిగ్రాహుణి నీకటుండనని నిచ్చల్కే బ్రశంసింపఁగా
సిలుగు ల్సేసి గణింప కేడ్తెఱ హరించె న్మత్ప్రియాండంబు ల
గ్గలమే దేవర కన్నసాగర మెఱుంగం జెప్పఁ డాలావునన్. 630

క. కావున్న నింతగర్వం, బాకడలికి నెట్లుకలుగు నని టిట్టిభము
త్సేకత వినిపించిన రో, షాకలితస్వాంతుఁడై ఖగాధిపుఁ డనియెన్. 631

క. ఏమేమీ నాసుభట, గ్రామణివని నీవు పల్కఁగాఁ డిట్టిభకం
కామగ్నుఁడు గా కబ్ధి, స్వామి మహాహమిక నిట్టివాఁ డయ్యెగదా. 632

ఉ. ధీరగరుత్సమీరణహతి న్సలిలంబులఁ జల్లి దృష్టదు
ష్టోరగకోటిజీవితము లూడ్చి తిమింగిలతద్గిలాదివా
శ్చారములం ఘనజ్ఞఠరజజ్వలనార్చులఁ బ్రోల్చి వార్ధిని
స్సారముఁ జేసి గ్రమ్మఱ నొసంగుదుఁ ద్వద్వనితాండపిండముల్. 633

క. కులిశాయుధభీషణమై, వెలసిన నాలావుఁ గనవొ వినవో నన్నుం
గొలిచినవాఁడని నిన్నుం, దెలియఁడొ సాగరుఁడు చూచితే తలక్రొవ్వెన్. 634

క. అనియలుక మొలకలెత్తి, న్వనరాశి న్గాసిసేయువాఁడై వినతా
తనుతాపహర్త చనఁగాఁ, గనుసన్న న్మాన్చి దైత్యఘస్మరుఁ డనియెన్. 635

క. మామహిళాజనకుఁ డు మా, మమ దుల్లసితకేళిమందిర మాప్త
గ్రామణిమణి నీరాకరుఁ, డామేటిం జెఱుప నుచితమా నీకరయఁగన్. 636

క. పలుకులనె చక్కఁ జేయుం, గలఁగఁజవాం బేలకడలి కడవాఁ డా గో
డ్డలిగోరఁ బోవుదానికి, వలె నా కిన లుడుమకునిన వడి నమ్రుండై. 637

క. ఉరగాంతకుఁ డనియె మహా, పురుషా నను గౌరవమునఁ బొందింపం దే
వరకుఁ దలఁపున్న మత్కం, ధర నెక్క పయోధి కరుగుటకు వేమిటికిన్. 638

చ. కడుపునకా మహామహులఁ గాచుట గొల్చుట గౌరవంబునం
గడుఁబొడవై సుఖించుటకుఁ గాక సముద్రునిచే లఘుత్వముం
బడసితి వ్యర్థమయ్యెఁ దలఁప న్దనజన్మము దేవ యొట్టియె
క్కుడు తన మేడలావు దనకు న్దలనంచుకొనంగ నోఁచితిన్. 639

మ. అడరంగాదు సముద్రుఁ డిందిరకులాయాసంబంచు వారించి తు
క్కుడఁగం దేవర కనుగానె తగులాయం బస్మదీయేప్సితం
బడుగం జెప్పితి సంఘటింపుము మదీయస్కంధసంవాసివై
వడి విచ్చేయుము ఖర్వనిర్వహణగర్వగ్రంథికి న్గంధికిన్. 640

క. అని విన్నవించి వినతా, తనయుఁడు నికటమున నిలువ దనుజారి కన
త్కనకగిరిహేళిపోలెన్, ఘనతం దత్కంఠమెక్కె ఖచరులు మ్రొక్కన్. 641

వ. ఇట్లు గరుడారూఢుండై గగనంబున కుద్గమించి నిలింపులు గుంపులై కొలువ సుర
స్సద్మంబునం బద్మయొప్ప నప్పరంధాముం డేతెంచి. 642

మహాస్రగ్ధర. కలితాతిప్రీతిరీతిం గనియె బహుజలగ్రాహనిర్గాహధాటీ
చలపాతోత్పాతమీనాచరితసితమహాశ్చామరగ్రామపూజా
ఫలరేఖాపట్టభద్రుం బలరిపునగరప్రాంతవిశ్రాంతగంగా
లలనాసంశ్లేషభంగాలఘుకరనికరోల్లాససముద్రు న్సముద్రున్ 643

క. కని కదియఁబోవుటయు న, వ్వనరాశి మహాపతంగవల్లభకంతా
సనవర్తి నాదిమూర్తిన్, ఘనకీర్తి హృతాశ్రితార్తిఁ గని ముద మొదవన్. 644

క. అకలంకరత్నములుగా, నకలుగ జగదేకమోహినులు వాహినులు
త్సుకలీల వెంటరాఁగా, మకరాలిం జేరి సంభ్రమంబున మ్రొక్కెన్. 645

వ. మ్రొక్కి నిలువంబడి కరంబులు మోడ్చి యిట్లని స్తుతియించె. 646

దండకము. శ్రీపారిజాతాలయానర్తకీపూర్వరంగస్థలత్వప్రస్ఫుటద్యోతముక్తామణీదామ
కస్తూరికాసౌరభోదార పాటీరచర్చోల్లసద్వక్ష, దేవాంబుజోన్మూలనాఖిల నిర్గ్లాన
దానవజ్వలద్దానవానేకపధ్వంసనావార్యహార్యక్ష, ధాత్ర్యంబరార్క స్ఫురద్రథ్యత్వవై
శ్వానరార్క క్షపాణ్ణోనిలాత్మేశ మౌళిస్ఫురత్పాదుకాధ్యాసి నిష్పృష్టసంసార
గంధప్రబోధ ప్రకాశార్యచేతస్సరోనిత్య సత్యాధినాథాపచిత్యుజ్జ్వల స్వర్ణదీవా
ర్మరందప్రభాభాసుర స్వర్ణమంజీర హంసస్వనత్పాదకంజాత, ధాత్రీధరారాధ
నాహం క్రియామర్షి దేవర్షభ స్పష్టనిర్దిష్ట దుష్టోపలాసార సంరోధిగోవర్ధన చ్ఛత్ర
నిర్భీక గోగోపసంజాత, గోపాంగనాపాంగకాంతిచ్ఛటాచంద్రికా ధౌతసద్విభ్ర
మభ్రూలతా కల్పకల్హారనీకాశ నేత్రస్ఫురచ్చుంబకోల్లాసనా సారుణోష్ఠాలకాలం
కృత ప్రస్తుతకస్తూరికా బిందుసౌరస్య విభ్రాజిరాజాస్య, శౌపత్రయారాతి షడ్వ
ర్గపంచేంద్రియాశా మృషాదోషసంసార దూరాదిమోపాస్య, వాచాలకేయూర
పారంపరీరమ్యసవ్యగ్రమాపాణి సంస్థాపనంబుల్ మహాయోగయుజ్జ్ఞాన సాంతస్స్థలీ
ఖేలనంబుల్ సదానర్థిత ప్రాణిసంమోదము ల్ఖేదవిచ్ఛేదము ల్భక్తిముక్తిద్వికశ్రీ
దము ల్గల్మషత్రాసనిర్భేదము ల్నీమహాపాదము ల్మౌళిం గీలింతు-భార్యాసుతభ్రాతృ
మిత్రప్రియప్రేష్య దృగ్భీషణగ్రాహసందోహదుర్గాహ సంసారనీరాకరభ్రంశితా
లంబ సంతారక ల్దుఃఖనిస్తారక ల్డంబరారిస్ఫురత్కాండహాస్యాకారక ల్భూభరుద్భవ
స్వస్త్రియాధారక ల్రక్షితప్రాణిసంఘు ల్భవజ్జంఘ లర్చింతు, సౌందర్యలక్ష్మీవిహారా
లయద్వార్బహిర్లగ్నరంభాకరాజాతముల్ దానవధ్వంసనారంభకేళీకళాన్వీతముల్
గాంచనాచ్ఛాదనాచ్ఛాదితంబుల్ శుభాపాదితంబుల్ మనోజ్ఞప్రభాచారువుల్
దావకీనోరువు ల్గొల్తు, సంవర్తవేళావినిక్షిప్తవిశ్వప్రపంచస్థితి న్భాసురస్వాకృతి
చ్ఛిన్నమారాభిచార జ్వలత్కుండకాండాయతి న్నాభిశోభాసనాభిం ద్వదీయం
బ్రశంసింతు, నస్మత్సుతాక్రీడనాగారము న్గౌస్తుభశ్రీపరిస్ఫారసందీప్తరాజన్మణీ
నీలభూభృత్తటీ తుల్యవిస్తారము న్సారకస్తూరికాసౌరభోదారము న్హేమవస్త్రో
త్తరీయ ద్యుతిస్మేరము న్నాయకశ్రీమహావక్షము న్భామినీశా పరీరంభసంభావనాద
క్షము న్సంస్తుతింతు-న్సరోజాతచక్రాసి కౌమోదకీధుర్యము ల్దుష్టశిక్షావిశిష్టావనస్థై
ర్యము ల్రాధికోరోజ మాద్యద్రథాంగద్వయీనీడము ల్రత్నకేయూరకంపీడము
ల్దీనవినిర్భీతిదానక్రియాశస్తము ల్దేవ చ్చతుర్హస్తము ల్ప్రస్తుతింతు, సుధాంశూద్గ
తజ్యోత్స్నికా విభ్రమభ్రాంతికృన్మందహాసద్యుతిశ్రీకముం గుందబృందప్రతి
స్పర్ధిదంతాంకురోత్సేకముం జంపకాకారనాసామణీకుండలాలంకృత శ్రోత్రకం
దర్పసందర్పణభ్రాజిగండస్థలాన్వీతము న్నిర్ణిరుద్ధానుకంపామృతస్నిగ్ధచక్షుస్సరో

జాతము న్నీతిరోచిస్సఖంబు న్ముఖంబుం ద్వదీయంబు పర్జింతు, నభ్రంకష ప్రాంశువ
గ్రావ శృంగాగ్ర జాగ్రన్నవోగ్రాంశు ధిక్కృన్మహారత్న కోటీరముం దుండిలేందిం
దిరాఖర్వగర్వాతిపర్వాపణవ్యగ్రమందారగుచ్ఛప్రగామోది కేశాళివిస్ఫారము న్రత్న
రత్నాపరగ్రస్తము న్దావకశ్రీమహామస్తముం బ్రస్తుతింతు, న్జగన్నాథ యాలోలక
ల్లోలమై తోలుమూలాయుతశ్వభ్రమార్గంబునం బల్మి జిమ్మించి యొక్కుమ్మడిం గెల్వ
వేళోరుమద్వారపూరంబు వారంఝుపాకార తన్వేదహృద్రాత్తను న్రోయ నీవాయ
తాక్షేప మేపారగా దంష్ట్రికావైఖరిం జాపరీతి న్మహాసీరభాతిం బ్రకాశించునార్ల
ఖభావిత్తమాధార రామత్రయప్రక్రియం దెల్పగా, హవ్యభుక్క్రవ్యభుక్కూట
రత్ను ల్మదీయాజ్ఞనస్మన్మణు ల్మిగ్గుగాఁజేయువాతాశరజ్జుభ్రమ న్మందరగ్రావశాణం
బువన్నం దదాధారభూతాక్ష్మరూపంబునం గచ్ఛపచ్ఛద్మత న్మున్ను నాలో బ్రవ
ర్తింపవే, దేవ చక్షుశ్చయోత్పాది తేజోహిరణ్యాత్ష సాక్షాత్కృతిప్రౌఢ నిర్ఘోష
రోషానలోద్దామ రోమాగ్రటంకంబులం దారకావ్యక్త ముక్తాఫలంబు ల్దొలు
లొప్ప ధావత్తురంతర్గతగ్రావము ల్గజలోదారలీల న్రొదాలింప ఘోణాగ్రసంకల్పిత
శ్వభ్రమేకీభవన్మజ్జనం బొక్కటంగ్రుక్కఁగాఁబట్ట నాయామదంష్ట్రాసురంగంబు
న్సర్వదిక్కుడ్యము ల్వ్రిమ్మ్యదీపించు నయ్యాదిఘోణిం బ్రశంసింతు యుష్మద్విష
ద్దైత్యధారాధరప్రస్తని స్తంద్రవిస్రాస్రవార్వృష్టికి న్మర్త్యకంఠీరవాభై రవారావము
నోరిపరాగాయితప్రోక్షణాత్తీణదీప్త ల్ఛవద్ఘోరనాసాపుటీనిర్గతశ్వాసముల్గర్జలు న్మిం
చులు న్గాడ్పులుంగా, సపత్నాస్థలిన్ విశ్వదాస్థానిలీలన్ బలీంద్రేంద్రజాలైకదా
నాంబుధారాప్లుతిం ద్వత్కృశాతేజ మూవామనాకారబీజం బహో దివ్యధాత్రీజతం
బొంది యత్యద్భుతస్థూలపాదత్రయి న్విష్టపత్రీకముం గప్పవే, చండవేదండఖుం
డాపముద్దండ దోర్దండఖండేంద్ర విస్ఫారపారశ్వధక్రూరధారాహతా శేషరాజన్యగా
త్రప్రవద్రక్తరోదస్వినిం ద్వత్పదాంభోజసంభూతకున్మద్గృహస్వీతకు న్శంభుజూ
టాటవీసంగతుం గంగకు న్నిత్యసాపత్న్యవాదంబు గల్పింపవే జామదగ్న్యుండవై,
మైథిలీశుల్కరూపాత్త బాణాసనద్రోహిగాధేయసంకల్పసంపాదనోత్సాహిని న్వా
హిని న్సొంపు దెంపారఁగా నొంపనూహించుశంభున్మహారోషసంరంభుజ్యాకృష్ట
నిర్భిన్నతత్కార్ముకోద్భూతకల్పాంతగర్జా సముజ్జృంభితధ్వానసంత్రాసయుక్తాగజా
శ్లేషసంపత్తిచేఁ దేర్పవే రామ రాజాన్యసుత్రామ శేషాయుతే పామిళల్లాంగలత్రోటి
కోటీసముత్పాట నత్రాసితంజేసి దుర్దాంతకాంతారనీపద్రుమధ్యత్తమాధావదుష్టాంశు
జాతన్మణీబంధవైదూర్యవాళిస్ఫుర ద్వారిజాతం గలంగింపవే సీరివై, కంజనాతి
ప్రసాదప్రభావంబునం గావరం బెత్తి ముల్లోకము ల్వాల్లకల్లోలము న్సేయు పూర్వా

నవప్రాతము న్నిగ్ధయానీతము న్మ్భరిమాయాకళానీ్వతమున్ శౌర్యసంభితముం జంప
నానామరశ్రేణి శాలింపనై లింప విద్విట్పురస్థాంగనామానభంగంబు గావించి తట్ల
యిన సర్వజ్ఞతాభూతియు న్నారజిత్త్వంబు నిన్ధర్మరాజత్వముం బొందునే, ఘోర
రుడ్బీకరభూరికుటీమాత్ర దూరీభవల్లోకము న్గర్వదుర్లోకమున్ శార్వరానీకమున్ శా
తధారాకఠోరక్షురప్రప్రతీకాశపాదాగ్రసంక్షుణ్ణముంజేసి గంధర్వవిఖ్యాతి దీపిం
పవే, విశ్వరూపా జగద్దీప నీమస్తకం బంతరిక్షంబు నీనేత్రము ల్సోమసూర్యాంశు
వుల్ దావకశ్రోత్రము ల్దిక్కు లుర్వీసురక్షత్రవిట్శూద్రజన్మస్థలంబు ల్భవదీ
యాస్యబాహూరుపాదాబ్జము ల్నీవు విష్ణుండ వంభోజగర్భుండవు న్నీవ నీవేకదా
శూలి వింద్రాదిగీర్వాణులు న్నీవ సర్గస్థితిచ్ఛేదనాదిక్రియ ల్నీవ నీకుక్షిలో నుండు
విశ్వంబు నీవిత్తు విస్తారము ల్నీ న్బ్రశంసింపనే నాగమంబు ల్త్రిలోకైకరక్షా
కరస్ఫారజాత్యా కృపాసాంద్రవీక్షా హృతస్వర్గనృత్యా పరబ్రహ్మమూర్తీ విధూతార్తి
తార్థీ మునిస్వాంతవర్తీ జగత్పూర్ణకీర్తీ విపత్కాలమిత్రా నతాంభోజమిత్రా సము
ద్యచ్చరిత్రా సురస్తోత్రపాత్రా నమస్తే నమస్తే నమస్తే నమః 647

క. అనిపొగడి మగుడమగుడ, న్వనరాశిపలాశిశాసివరచరణముల
న్దనశిరము మోపి వినయం,బున నిలిచి కరాంబుజముఁ మోడ్చి సభక్తిన్. 648

క విన్నవించె వేదవిద్యోయతాపకా, గమనకార్య మెద్దిగారవమున
నానతీవె యనిన నాపగానల్లభు, డిక్కఁజూచి వాసుదేవుఁ డపుడు. 649

క. నారాకకుఁ బనివిను మో, నీరాకర వైనతేయునికి నీవెఱుఁగం
బోరానిభటుఁడు టిట్టిభుఁ, డీరస మిప్పక్షితోడ నెవ్వరి కమరున్. 650

క. చన దండపిండములఁ దె, మ్మనుడుఁ బ్రణామంబుఁజేసి యబ్ధ్రానివెసం
గొనితెచ్చి యిచ్చెనాలో, వనరాశిం జూసి భక్తవత్సలుఁ డరిగెన్. 651

క. వినతుని లావరయక వై, రముఁ బూనినవాఁడు వారిరాశిక్రియుఁ దై
న్యముఁ గాంచుననుచు శాత్రవ, దమనకుఁ డగుదమనకుం డతని కెఱిఁగించెన్.

వ. ఎఱిఁగించిన నప్పలుకు లాదరింపక సంజీవకుండు దమనకున కిట్లనియె. 653

క. కలనికిఁ బింగళకుం డెటు, వలె నుండఁగఁబోదు ననిన వాఁడురుదంష్ట్రిల్
వెలువడినవదనముం బెడ, తలవాలమునుండ వానతిఱేఁ బొమ్మనియెన్ 654

క. అని గుఱుతుఁ జెప్పి యద్ది, క్కున నిలువక వచ్చి కరటకునిఁ గదిసి యుపా
యనములను మిత్రభేదము, నొనరించితి ననుచు నాతఁ డుబ్బుచుఁ జెప్పెన్ 655

క. అప్పుడు గగనమున మొగం, బ్గప్పి మహిం జఱచి విసరె గాడ్పులు ఱొప్పెం
గప్పలు పడిగం డ్లురిలెం, గుప్పలుగొన సోనవాన గురియం దొడఁగెన్. 656

వ. అయ్యవసరంబున. 657

ఉ. జేవుఱుసోఁ బకన్గొనలఁ జిప్పిల నూర్పులవెంట నుజ్జ్వల
త్స్ఫుటకీలలోలిఁ గనుపట్టఁగఁ గొమ్ములు వంచి కానన
గ్రావములం బ్రతిధ్వనులు గ్రాల ఖణిల్లన అంకవైచి సం
జీవకుఁ డాగ్రహం బడర సింహము పైఁబడియె న్మహోద్ధతిన్. 658

క. సంజీవకపింగళకుల, ఖంజపరాక్రమము లడరఁగాఁ గయ్యము సే
యంజొచ్చి రపుడు మహీభృ, త్కుంజరఫణిఘోణికూర్మకులపతు లదరన్. 659

క. తొలఁగకఁ కలఁగక వృషభం, గళకము లప్పాటఁ బోరఁగాఁ జిత్తమునం
గలఁగి వెలవెలని మొగమునఁ, దలఁ గదలిచి కరటకుండు దమనకుఁ బలికెన్. 660

క. అతిహీనమానసా నీ, కతమునఁ జేటయ్యె నేలికకు ని వ్వేగు
గ్గతి కేగదవో యెఱుఁగ, న్మతిమంతుం డంద్రు నిన్ను మతు లేవియొకో. 661

సీ. సాంత్వనం బుచితంబు సాంత్వనత్యాగికిఁ బరమగుహ్యపరాభవముగలుగు
వరుసఁ దక్కటివి నెన్నిరిగాని సామంబు ముఖ్యంబు దక్కినమూఁడు బుద్ధిఁ
దలఁప సంఖ్యామాత్రఫలములు సూవె దీపమున నాతపమునఁ బ్రచురరత్న
దీప్తిఁ జీఁకటివోలెఁ దీవ్రారితిమిరంబు సిద్ధసామజ్యోతిచేత విరియు

తే. నల్లుగావున నగ్రాహ్యమైనదండ, మధిపతికి గ్రాహ్యముగఁ జేసి యనియొనర్చి
తకట నీబుద్ధిగాల నీయభినయంబు, గూల నిచేర్పు నీతీర్పు నేలఁగలియ. 662

చ. శ్రవణయుగాంతరావరణచక్రము లగ్గలఁ బట్టుఁ దోరపుం
జెవుడు కనీనికానసు సీమకు నుమ్మలి కాడు దృష్టిపా
టవము దురుక్తి నాలుకకు డాసినచుట్టము పారుషత్యపుం
దెవులున వైద్యసాధ్య మెడద్రవ్యక యివ్వని నాశ్రయించినన్. 663

చ. తలుచూకయించుకేని పరిభావమిషం బతిలాభకార్యముల్
చెలుచ నరాతిజాతి కెడసేయక వాకొనుమర్మకర్మముల్
గుఱుచలఁ బట్టఁజూచు విభు కూర్చినచోటన కీడు సేయు మే
ల్మఱమినయూరె రాజుఁ జెడు మంత్రి విపజ్జలరాశి ముంపఁడే. 664

చ. కలహము నిత్యకృత్య మపకారము పెట్టనిసొమ్ము సత్యపుం
బలుకు జపం బకార్యవిధి ప్రజ్ఞ యనాదరణంబు సద్వ్రతం
బలుక కులాగతక్రియ యహంకృతి కీర్తి సుహృత్తిరస్క్రియా
బలము బలంబు నీతి కెడఁబాసి నినుం బురుడించు మంత్రికిన్. 665

చ. పడిచెడి యూఁగుపల్వటికి పైచినఁ గూర్చిరవిప్లుతాన్నముం
గడుపునఁ జేరనీక మహిఁ గ్రక్కినగాడిన ముల్లువుచ్చినం

గడుసుఖ మిచ్చినట్లు కొలఁగానియమాత్యునియోగిపెన్గవ
ల్విడిచి సుఖించుభంగిఁ బృథివీపతి వీడ్కొని మేల్గొనందగున్. 666

వ. ఆత్మభూత్యర్థంబు రాజు వివిక్తుంగాఁజేసి యొక్కరుండవయుండం బ్రారంభించి నాఁడవు రాజు లాకీర్ణవిరాజులగు బెఱుంగవే సహాయసంపత్తి వేసియూలని వభి యాతిజాతి విభీతిరీతిం జెప్పఁబడుచుఁగాదే యని కినిసి పలికి మఱియుఁ గరట కుండు. 667

క. తనబ్రదుకుకొలకుఁగా దుర్జనుఁడు నృపాలున కనీతిచాటు శతంబుల్
పనిఁబూని కఱపుఁ బిమ్మటఁ, దనకీడెఱుకపడఁ బతికిఁ దాఁ బగతుఁడగున్ 668

గీ. పతికి నభివృద్ధి దనకు శోధనము నైన, బుద్ధి బోధించునాతఁడు వో సుమంత్రి
పతికిఁ జెట్టయు దనకు నాపదయుఁ జేయు, బుద్ధి బోధించునాతఁడు వో కుమంత్రి.

క. అతిరోషుండయి శాంత, స్థితికి మతిం గపటమూఁది చెలిమికి సుఖసం
గతుఁడై విద్యకుఁ బరుష, ప్రతుఁడయి యంగనకు నాసపడఁ జనదెందున్. 670

క. కడుఁదేజ మొసఁగి దయతో. నొడయఁడు దనఁ బెంపుఁజేయ నుబ్బున భీతిం
నడచుట శోభనకారణ, మడఁకువ భూషణము గాదె యనుజీవులకున్. 671

వ. నీయనుష్ఠానంబున నీతండ్రియు నిట్టివాఁడని యూహింపంబడుచున్నాఁడు. 672

క. జనకాచార మవశ్యము, తనయుం బ్రాపించునను టతథ్యము ధరలో
ఘనకైతకకంటకములు, దనరం దత్ఫలకులంబు దాల్చెటలేదో. 673

క. ఇంగిత మెఱుఁగని సేవకు న, యాంగము బోధింపఁ ద్రాస మయ్యెడు మును గు
ప్సంగతి నూచి ముఖాఖ్యప, తంగము కపిచేతఁ బోవదాదురోష్టున్. 674

క. నావిని దమనకుఁ డినసం, భావితుఁ గరటకునిఁ జూచి పలికెం జెపుమా
యీవృత్తాంతం బన వయ, కోవిదుఁ డాయనకుఁ గరటకుం డిట్లనియెన్. 675

ఉ. అంతనితాంతశైత్యకరమై కరమొప్పువహించి మించు హే
మంతము సేవమానలసమానబలౌఘవళీక్షితాఖిలా
శాంత ముపాంతకాంతమిహికార్తజగజ్జనవర్ధితస్వధా
కాంతము కృష్ణసారమదగంధనృపాలనిశాంత మెంతయున్. 676

సీ. స్వపసువిశ్రాణనస్వపితవాసరముల కాయామమదవీయమై చనుటకో
హిరానుషక్తిఁ జెన్నారుతమ్ముల కతిశ్రాంతిగాఁ గలదని చింతిలుటనో
తనరాక మనులోకమునకుఁ బాటిలినశీతార్తి యనుత్క్షణం బణఁచుటకునో
సకలసస్యాభివృద్ధికి గభస్తిస్సాత్పజీవనం బవనిపైఁ జినుకుటకునో
తే. పగలురుచివాసి యొకమూలఁబడి సమస్త, నక్షత్రములఁ జేరి యాత్మతేజమున రేలు

వెలుఁగు శిఖియున్నకడ కేఁగవలసెననియు, భానుఁడకాలమునమందభానుఁడయ్యె.

చ. సదవనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియుం బరిపూర్ణకళావిలాససం
పదయును గల్గిరాజు గనుపట్టె ననంతపనప్రవిష్టుఁడై
యధిగతమూర్జితప్రసవమై కొమరొందె ధరిత్రి యెంతయున్. 678

మ. ప్రతిదిగ్దృప్తతమస్సమగ్రరుచిదూర్వాచర్వణాఖర్వముల్
హితగంధామృతముక్తతర్షములు భూయిష్ఠస్వమర్త్యాయన
వ్రతము ల్గాండె నఖండపాండురతుపారక్షీరపూరంబు లు
ద్ధతహేమంతగవాధిపోద్యమముచేత న్రాజగోజాలముల్. 679

క. అతిశీతలవిమలవిధూ, న్నతపాదాక్రాంతతీక్ష్ణ నరలోకారా,
ధితగాక యునికి చిత్రము, ఖతలాగతయతితుపారగంగ దగంగన్. 680

చ ఒకతృటికాలమేనిఁ బనికొగ్గక మీఁగులు చూచుదుక్కిఁ బం
ట్రకు మడిఁ జేనఁగల్వల కొడంబడి ఘాసము లూడ్చుకూలికాం
డ్రకు నెడసేద్యపుంబనుల డస్సిపడుండఁదలంచు పెద్దయి
డ్లకుఁ గలిగించె దైర్ఘ్యవికలస్థితి వాసరపంక్తు లాఱటన్. 681

సీ అహరాస్యజటిలనీహారధారాసారశైత్యాపనోదనోత్సాహమునకొ
మలయశైలాగతానిలఖాద్యమాద్యదర్వాఖర్వగతిరేఖ నరయుటకునొ
బహుధర్మయూతసుతప్రణిపాతపూజనస్వీకారసంభ్రమోత్సేకమునకొ
మందేహదేహసంబంధశోణత్రాణరాక్షసత్రాసదారంభమునకొ

తే. మారుతప్రియుఁడాసి పటీరవనము, దాని శమనుసముల్లాసిఁ జేసి పలవి
కాని పుణ్యవతీడాని రోసి వాసిఁ, దిమిరనులశాని వర్తించె దినకరుండు. 682

ఉ. తోషణకారణైకవసతు ల్సతు లత్తతి భగ్నసైంధవ
ద్వేషివిషాణగర్భరుచివిస్ఫురితాగురుదారుఖండసం
ప్రేక్షితనూతనైణమదమిశ్రఘనస్తనదత్తనిర్భరా
శ్లేషణలీలఁ దేలుదురు శీతభయార్తులఁ బ్రాణభర్తలన్. 683

ఉ. భోగులు వుచ్ఛిరద్దినముల్ పృథువహ్నిహసంతికాదిదృ
ష్టాగతులం గురంగమదసమ్మిళితప్రతినవ్యదివ్యకా
లాగురుచందనంబుల మహోయమళీభవదంశుకంబులన్
రాగరసైకవీటికల రాజముఖీపరిరంభణంబులన్. 684

సీ. నిర్నిద్రదోషఘూర్ణితమనస్కులభంగి దృఢరవంబుగనొండ్లు దీడితీడి
ధృతిబలోద్ధతవిరోధిత్రాసితులలీల వారక వడవడ వణఁకివణఁకి

యవనిభృన్నికటవర్త్యనుజీవులో యనఁ జేతు లంసములపైఁ జేర్చిచేర్చి
యాభీరవల్లభు లన దలవాకిళ్ల నొకట యావులగుంపు లొత్తియొత్తి
తే. సాఁగుబడినాటికమ్మరజాతివోలెఁ, గటికినిప్పులకుప్పలఁ గదిసి కదిసి
పొలిచి రప్పందు వోలినచలికతమున, నాకులత నొంది రిలలోనిలోకులెల్ల. 685

క. శాకపుసరకులఁ బోకలు, నాకులు గొంగళ్లు దుడుపుటంబరములు కుం
కీశాలాగురువు ల్గొనఁ, గైకొనఁ బ్రియమయ్యె శీతకాలమునందున్. 686

ఉ. ఆరికకూడు పుచ్చవరు గావులవెన్నయు దోసగింజ సం
బారపుటాంబురంబు తనిమజ్జిగ మాకొనకంపుతోడఁ దం
డారగఁ బట్టి రడ్డిమడియాల్పులుగోలలఁ బూని యొడ్లకో
పేరులు వైచి దున్నులకు నేగిరి కోంద్రకు సాలివచ్చినన్. 687

సీ. చవులవేడబములు చాలించి తలసార దఱలక చప్పిళ్లు ద్రావువారు
కాయసంధుల మహోగ్రగ్రంథు లొదవినఁ బెట్టిదంబుగ నూలఁ బెట్టువారు
రసధూమ మఖిలగాత్రచ్ఛిద్రములఁ బ్రాఁక నుబ్బలఁ బడి మూల్గుచుండువారు
ఛీసిగ్గు గాదొకో చేరమా కాటది యున్నఁ జెల్లెలి వావి యనెడువారు
తే. కోరి వాలుమత్తైలంబుఁ గ్రోలువారు, కుములుసంపటిశాకముల్ గోరువారు
నైరి యొకకొంద ఱచ్చలినలసవాఘ, వానిధాటివిహారంబుఁ బూనుటయును. 688

వ. ఇట్లాభీలంబైన చలికాలంబున. 589

క. ఒకగహనంబున నొకచో, నొకశీతార్తప్లవంగయూథము ఖద్యో
తకముల శిఖియని కానఁగఁ, బకపకసూచీముఖాఖ్యపతగము నగుచున్. 690

క. ప్రతికీశశ్రుతిపుటసం, గతమై యటసహజహిమ్ముగా దిది శీత
చ్యుతిదీన నగునె యని వి,శ్రుతవాచారభటిఁ జెప్పుచుఁ న్వలదిరుగున్. 691

క. ఈరీతి పులుఁగు పిలుని, పేరఁట మేతెంచి చెవులు బీఱువడ న్వే
సారక చెప్పఁగ నందొక, కూర్మిరప్లవగంబు పండ్లుగొఱుకుచుఁ గినుకన్. 692

క. పడి నొడిసిపట్టికొని కూ, యిడ నప్పర మెత్తియెత్తి విరియఁగ శిలతో
నడిచిన నెపుడో ప్రాణము, విడిచె వృథాబోధకుండు వీఁడిఁడిగాఁడే. 693

వ. ఇట్టికథ యయ్యెడునని నినుబోధింప వెఱచెద నైనవినుము. 694

క. అలఘుతరప్రజ్ఞానన, బలముల నెవ్వాఁడు గోత్రభరము వహించుం
బలుకులు వేయేలనిజం, బలయుత్తము నోఁచి కాంచినది తల్లిగదా. 695

గీ. దేశకాలాంతరంబులఁ దీలుపడని, బుద్ధిసౌందర్య మొక్కఁడె యద్భుతము గాక
గాత్రసౌందర్య మేరికిఁ గలుగదనిన, దానివిని విన్నవై యుండె దమనకుండు.

ఉ. వేసటతోడిపల్కు తను వేపనభావము సోష్ణదీర్ఘని
శ్వాసము గద్గదస్వరము శంకితదృష్టికపోలహస్తవి
న్యాసము వాడుదేఱుపదనంబు స్వయంకృతఘోరకల్మష
త్రాసితతత్క్షణంబునని తత్త్వవిధిజ్ఞులు సెప్పిరేర్పడన్. 697

క. ఈరీతి నుండనేల మ, హీరమణున కిట్లొనర్పనేల విచారం
బారముఁ దుదఁ జిదిమితివని, రారాపున వాని నక్కరటకుఁడు మఱియున్. 698

క. అనయపరుం డగుమనుజుఁడు, తనవారిం జెఱచి పిదపఁ దానుం జెడుఁబో
మును దుష్టబుద్ధిమాటలు, విని తజ్జనకుండు ధూమవేదనఁ దెగఁడే. 669

క. అని పలికిన నీతికరా, ధనుఁ గరటునిఁ జూచి పలికె దమనకుఁ డో స
ద్వినయాఢ్య నయ్యొట్టికథ, వినవిష్టం బయ్యెఁ దెలుపవే నాకనుడున్. 700

క. కరటకుఁ డిట్లను నొండొక, పురమున వర్తించు ధర్మబుద్ధియనంగాఁ
బరఁగు నొకసెట్టివానికి, సరిచుట్టము దుష్టబుద్ధి సఖుఁడై తిరుగున్. 701

క. వానికి వానికి బ్రాఁకస, మానమహామైత్రి పెరుగ మఱి యందు మహీ
మానిధికి ధర్మబుద్ధికి, దీనారసహస్ర మొక్కదెసఁ గనవయ్యెన్. 702

క. కానంగనైన సొంపు ని, ధానమున మొలకలొత్త నవాప్త సుహృ
న్మానసమున డాఁపనేరక, పూని సఖుండనుచు దుష్టబుద్ధికిఁ జెప్పెన్. 703

ఉ. చెప్పిన నద్దురాత్ముఁడు శంకఁడు బూరఁడునై సుహృత్త్వముం
దప్పక చూచి పూర్వసుకృతంబున గాంచినసొమ్ము నెమ్మిమై
నిప్పురిమేర కేసరమహీరుహమూలమునందు డాఁచిపో
నొప్పునొరుల్ గనుంగొనరె యూరికయో కొనిపోవఁ జూచినన్. 704

గీ. ఇతరు లెఱుఁగనేల యింటికిఁ గొనిపోవ, నేల నేల యరసి యెఱుఁగకుండఁ
గుండఁ బాఁతి యింతకుండనె చనుటొప్పుఁ, దగ నొనర్ప మనకు ధర్మబుద్ధి. 705

ఉ. వంచనసొమ్ముఁ బుచ్చుకొనువాఁడయి వీఁడిటులాడుచున్నవాఁ
డంచు మనంబునం దెలియ కాతని నిక్కము సెయ్యఁగా విచా
రించి యొకొన్ని పుచ్చుకొని వృక్షసముజ్జ్వలమూలమందు న
క్కాంచినసొమ్ముఁ బాఁతి చెలికాఁడును దానును బోయి రిండ్లకున్. 706

ఉ. పోయి నిశీథమైనఁ జెడుపోకలకోమటి దుష్టబుద్ధి యా
రేయి గృహంబుఁ బాసి నగరీజనులం గనుబ్రామి యొంటి నా
చాయకు నేగి కూడుబలిఁ బల్లి పెకల్చి ధనంబుఁ గొంచుఁ జే
రాయుపుసొంపునం జనియె నచ్ఛతరత్వర నొంటి నింటికిన్. 707

గీ. అతఁడు గొన్నిప్రొద్దు లరిగిన నింటికిఁ, బోయి తాను ధర్మబుద్ధి కనియె
దియ్యఁ జూడవలదె దీనారభాండంబు, మరిగనేమి దిగులుసొచ్చె నాకు. 708

క. అని వెరవుఁజూపి పిలిచిన, ననుమానము పుట్టి తాను నాతఁడు జోడై
చని ధర్మబుద్ధి వినిహిత, ధనభాండముఁ గానఁడయ్యెఁ దరుమూలమునన్. 709

ఉ. కానక మానసంబు కలఁగంబడ నిట్లను ధర్మబుద్ధి య
య్యో నిను సద్వయస్యుఁడని యొండొకచిత్తములేక నమ్మి యి
చ్చో నిడి చన్న సాధనముఁ జోరనిచాప్పునఁ బుచ్చుకొంటి వి
స్సీ నరభోజనుండయినఁ జెట్టఁదలంచునె విశ్వసించినన్. 710

ఉ. పూని మదీయవిత్త మిటఁ బూడ్చుటెఱిం బరికింప నక్కటా
యేనును నీవకాని యొరులెవ్వరెఱుంగరు నీవుదక్క న్యో
ప్పా నిజమాఁ బరుల్బొరయ రర్థముఁ గ్రమ్మఱఁ దెమ్ము దొంగవే
రానకుఁ బాలుపడ్డ నగరా నగరాలుదురాత్మ నావుడున్. 711

క. విని దుష్టబుద్ధి బుద్ధిం, గవలుచు నద్ధర్మబుద్ధి గనుఁగొని పలికెం
గనినాఁడవొ వినినాఁడవొ, చనునే నామీఁద నిట్టిపడి మోపంగన్. 712

క. నీసఖ్యమునఁ జరించిన, దోసము మోసము న నేఁడె తోడనకలిగెం
బోసరమె నొరిక్రొవ్వో, సెసో యిట్లాడ నెవ్వరికి నీడేరున్. 713

ఉ. మెచ్చుదనంబు నాపయిన మోపక యుండిన సెట్టిబిడ్డవే
నమ్మనె నీకుఁ గూడుఁగుడువం గులకామిని ప్రక్కఁబండెదే
క్రచ్చఱఁ గన్నసొమ్ము తిరుగంబడినం గొనకున్న నెట్టురా
రచ్చకునంచు నీడ్చి పదరంబడి వాఁడు సుహృచ్ఛిఖామణిన్. 714

వ. ఇట్లు ధర్మబుద్ధి నీడ్చుకొని చని నగరంబడి ధర్మంబున కొప్పి పిన్నపెద్దలం గూడ
బెట్టిన ధర్మవేదు లుభయవాదుల నాలోకించి తమకింపక అంతుసేయ కడ్డంబుసా
రక యిరువురు గలసి పలుకక యొకరొకరిపూర్వోత్తరంబులు తెలియునట్లుగా
మీమీసుద్దు లుగ్గడింపుఁడనుటయు నందు ధర్మబుద్ధి కృతాంజలియై సభవారి కిట్ల
నియె. 715

క. ఈతఁడు నాతోఁ జెలికాఁడై తిరుగం బెద్దకాల మరిగ న్వ్యనుఁడీ
భూతలమున దీనారస, మేతనినిష్ఠంబభాండ మేఁ గనుఁగొంటిన్. 716

క. కనుఁగొని నిక్కము చెలికాఁ, డని పెద్దయు విశ్వసించి యీకథయే నీ
తనికి నతిగోపనంబుగ, వినిపించితి నావివిత్తి వీటింబోవన్. 717

క. వినిపించిన నాతఁడు నా, కనుతక్షనిపగిది ననియె వనభూ యేత
ద్ధన మూరియొద్ద నేటికి, నినుబేఁడెద వలయు నిచట నిక్షేపింపన్. 718

క. అని తరుమూలముఁ జూపిన, మనమున నదుష్టబుద్ధిమత మెఱుఁగక చె
ప్పినయట్ల సేసిపోయితి, తనయింటికి నీతఁ డంతఁ దానుం బోయెన్. 719

క. కతిపయదివసము లరుఁగఁగ, నితఁడు నను బిలిచి పలికె నిష్టసఖా నా
మతినతితాపము వొడమెడు, నతుఁ గలిం జూడఁబోత మావిత్తంబున్. 720

క. అనపలికి నన్నుఁ దోడ్కొని, చని తరుమూలమునఁ జూడ సంగుప్తధనం
బునిచినచో లేదయ్యె, న్ననసెరియం జొచ్చె నైన్యమున్నఁడ నైతిన్. 721

క. సొమ్మున్నది నీయొద్దం, దమ్ముని నే నదరవై చితే నీతఁడు న
న్నమ్మాటలాడి త్రిప్పెం, దిమ్ముగ నం జొచ్చి యాడ్చితెచ్చె న్నభిపన్. 722

వ. ఇంతియ కాని ధర్మబుద్ధి యూరకుండె నప్పుడు దుష్టబుద్ధి ధర్మాసనస్థులకుఁ బ్రణామంబు లాచరించి యిట్లనియె. 723

చ. ఎనసినచెల్మి నుండుటయు నెక్కటిపాటఁ దదర్థభాండమున్
గనుటయు వాకుఁ జెప్పుటయుఁ గప్పుటయుం గల దంతనిండ్లకుం
జనియెుక నాలు గేనుదివసంబులు వోవఁగ వచ్చిచూడఁ బాఁ
తినకడ సొమ్ములేదు కనితీసికొన న్మహిజంబుసాక్షి గాన్. 724

క. నావిని ధర్మాధికృతుల్, వాఁ డాదంబేల యేమనారయు లెడ మీ
రేవినవము నాఅనినాఁ, డావిస్మృతబుద్ధిఁ దెలుపుఁ దరుగుఁడు మగుడన్. 725

వ. అనువచనంబులు విని దుష్టబుద్ధి. 726

క. ఆకాశ మేమిటికి వ,ట్టివివాదం బింక నేమిటికి శుద్ధాత్ముం
డవు నితఁడని నన్నందఱు, దగఁ బొగడఁగ సాక్షిఁ దెలిపెదను మీపాలన్. 727

క. నా విని ధర్మమువారలు, నీ వెవ్వరి సాక్షిఁ దెలుప నేర్తువు చెపుమా,
నావాఁడ ముదిగె నవ మా, యావాదనశాలి వారి కతఁ డిట్లనియెన్. 728

క. ఏపాదపమూలంబున, బాఁతి దీనారపూర్ణభాండ మహోని
క్షేపింపఁబడియెఁ దెలియఁగ, నాపాదపుఁడు సాక్షి యగు మీ రడుగన్. 729

క. అనుదుష్టబుద్ధిపలుకులు, విని యచ్చెరుపాటు గదుర విద్వజ్జను లే
దినమున కేమి ప్రొద్దునఁ, జనుదె మ్మరసెదము గాక సకలం బనుచున్. 730

క. చని రంతధర్మబుద్ధియుఁ, జనియె గృహంబునకు వానిజాడనె తోడ్తో
జనియెఁ బ్రతివాది యాలో, దినకరుఁ డపరాబ్ధి వారిఁ దెప్పలఁ దేలెన్. 731

గీ. సంజచివురించెఁ జీకట్లు సందడించెఁ, గలువ సొంపెక్కెఁ జక్రవాకములు స్రుక్కె
జనము లవాడె దిశలఁ దేజంబు వీడె, ఘూకము లెలర్చె విహగమ్ములు గూండ్లు సేరె.

వ. అప్పుడు దుష్టబుద్ధి యేకాంతంబునఁ దనతండ్రి యుడుగులంబడి యిట్లనియె. 733

ఉ. చోరుఁడె దుష్టబుద్ధి యతిశుద్ధుఁడుగా కని భూరుహంబుచేఁ
జారులు గుంపులై విన సభం బలికించెదనంటి విచ్చితిన్
జేరెడుమాటమాత్రమునఁ జేకొను మస్మదభీప్సితంపుదీ
నారసహస్ర మెప్పటికి వందనులాభముతండ్రిఁ బొందదే. 734

క. తరుకోటరమున నీ వొక్కరుఁడవ వసియింపు మొరులు కనుఁగొనకుండం
బరిషజ్జనము భయంబున, వదరెంచినఁ బలుకుసభ్యుఁ డని నిన్నడుగన్. 735

వ. అనినం గొడుకునకుఁ దండ్రి యిట్లనియె. 736

క. చెడుబుద్ధి నీకుఁ బుట్టెం. జెడితివి నన్నుం గృతఘ్నుఁ జెఱిచెద యూఁకో
నొడఁబాటు గాదు చిత్తము, వెడఁగులపని పంపు సేయువీఁడె గలఁడే. 737

క. మొదల నపాయం బెన్నుట, పిదప నుపాయంబు లెక్కఁ బెట్టుట తగునీ
నిద గొదలఁ గాదె మున్నొక, ముదికొక్కెర యనుఁగుసుతుల ముంగిస కిచ్చెన్.

గీ. అనిన దుష్టబుద్ధి జనకు నిరీక్షించి, యిట్టు లనియె నకులమేకతమున
బకపికార్భకముల భక్షించె బకమేమి, సేసె నంతవట్టుఁ జెప్పవలయు 739

వ. అని యడిగినఁ దండ్రి కొడుకున కిట్లనియె. 740

మ. కలదభ్రంకషభూజరాజిశుకపాకగ్రస్తశస్త్వగు
త్ఫలదృగ్వాక్యము కూలముద్రుజఝరీభంగాంగసంఘృష్ణ
విలఘోషప్రతిఘోషితద్విరదవిద్విడ్భీమ ముగ్రద్విపి
స్థలకృత్కీలదరీనికాయ మొకకాంతారంబు దుర్వారమై 741

ఉ. ఆవిపినంబునం దొకమహామహిజంబున నగ్రశాఖపైఁ
దా వసియించి యొక్కబకదంపతి పిల్లలఁ జేయుఁ జేయు నా
ఠీవిష మాసమీపబిలసీమమున న్వసియించియుండి వా
పోవఁగ నన్నిటి న్నెసవిపోవు సమాసమ నిర్విఘ్నంబునన్. 742

క. ప్రతిసంవత్సరమును నీ, గతిఁ బిల్లలఁ బాముపాలుగావించి మనో
గతి బకమిథునము పొగులుం, బ్రతికృతిఁ గానక యలంతఁ బగలు రేలున్. 743

వ. అట్లుండఁ గొండొకకాలంబునకుఁ దననాతికిఁ బ్రసూతిసమయం బగుటయు భుజ
గభయానకం బగుబకంబు తిక మొకండై సంతతిసంభరణంబునకు విరోధిసంహరణం
బునకు నుపాయంబుఁ గానక తానకంబుఁ బాసి ప్రియసఖుండు నాసజ్జయాభి
ముఖుండును నగుకర్తరీపాణినామకుళీరకుం జేరంబోయి కాయం బడచిపడ బుడి
బుడికన్నీరు గ్రుక్కుచుఁ జిక్కుకొన్నకంఠంబునఁ దనకుఁ బాటిలినచేటుపాటు
ప్రసంగించి శోకించి పుత్రత్రాణవిధేయం బగునుపాయంబుఁ జెప్పు మాపత్పారా

వారతీరంబుఁ దెప్పవై చేర్పుము వన్నీ డేర్పుము నీవనికనికరం బొలయఁ బ్రార్థించిన
బకంబునకుఁ గుళీరం బిట్లనియె. 744

క. భువనవిహారిణి నవలా, ఘనమును లావును గొఱంతగా దన్నటికిన్
దివిరిపధియింతు వనిమిష, నివహము నీయంతవాఁడు నెగు లెట్లొందెన్. 745

క. శోకార్తులకు నుపాయము, లేకరిణిం దోఁచు ధైర్య మెవ్విధిఁగలుగున్
రాకడపోకడలకు జవ, మేకొమరున దొరకుఁ గడఁక లెటువలె నొదవున్. 746

క. వినను దీనికిఁ దగుతెఱఁగే నీకెఱిగింతుఁ జేయు మిది భవదీయ
స్థానతరునికటగతకా, దే నబిలంబునకు నకులదృఢబిలమునకున్. 747

క. ఎడత్రెవ్వకుండ మీలం, దడవైవుము వానినెల్ల భక్షింపుచు నె
వ్వడి నేఁగి ముంగిపాముర, బడలుపడం గఱచిచంపుఁ బగ ని కణఁగున్. 748

క. చనుమని యాహారంబిడి, పనిచిన నప్పులుగు చనియెఁ బయనంబైత
ద్వనిత యొకకొన్ని నాళ్ళకు, గొనవై యన్నోటఁ గూఁట గ్రుడ్లం బెట్టెన్. 749

గీ. పెట్టి ముదిగుడ్లు పొదపడఁ గట్టుగాచి, పొదుగుటయు నైతకొని కొన్నిపూఁటలకును
వికిలడింభంబు లాలోన బకవిభుండు, యెండ్రి చెప్పినగతి మీలనిండవైచె. 750

గీ. కవుచుగాలివారఁ గవిఁ బొసి వెలుపడి, పరుసమీల దినుచు వచ్చివచ్చి
పాముజంపి పాదపముఁ బ్రాకి బకశిశు, ప్రకరభుక్తిఁ దనిసె నకుల మరిగి. 751

ఆ. ఒకఁడు సేయఁబోవ నొకఁడగు నీబుద్ధి, గూల నన్నుఁ జెఱుపకుము దురాత్మ
చెడిన నీవ చెడుము చెప్పకు మీమాట, యర్థభాండ మొల్ల నన్య మొల్ల. 752

క. అని ముగిఁయుంబలికిన నా, వనమున దైన్యంబుదేఱ నందనుఁ డాసె
ట్టనకాళ్లమీఁదఁబడి యుఁక, వినునావచనంబటంచు వేఁడుకొనంగన్. 753

తే. మోసపోవనివాఁడయ్యుఁ ముదుకఁడయ్యు, విధివశంబునఁ జెవివ్రేలవేసి సెట్టి
యర్థరాత్రంబునం దేగి యపిగియుండె, గూబచందాన నలవృక్షకోటరమున. 754

వ. అంతఁ గొంతప్రొద్దునకుం బద్మబాంధవుండు పూర్వపర్వతశిఖరసింహాసనం బెక్క-
నప్పుడు పిన్నపెద్ద లుభయవాదుల రావించి వృక్షసమీపంబునకు వచ్చి యర్చించి
యయ్యిరువురిలోన వంచకుం డెవ్వఁడు చెప్పుమని ప్రాంజలులై నిలిచిన. 755

క. ఎలుగొందఁగఁ దరుకోటర, తలమున నగ్గుప్తబుద్ధితండ్రి మహాని
ర్మలధర్మబుద్ధి సుగుణో, జ్జ్వలు వంచకుఁ డనియె నెల్లవారు వినంగన్. 756

క. అందఱు నమ్మాటకు వెఱఁ, గందిరి యలదుష్టబుద్ధి యానందమునం
జెందినటియుంచెఁ బౌరుల, ముందరఁ గరతాళగతులు మొరయ న్నెరయన్ 757

ఆ. ధర్మబుద్ధి పగచి తేఁయూఁచి తనలోన, ననియె నేఁడు సత్యమణఁగె ధర్మ
మునని శిక్షవిరిసె నన్యకంబు చూచితే, నిర్నిమిత్త మిట్టినిందపుట్టె. 758

క. తరువులు సాక్షులు పలుకునె, నరులడిగిన మనుజభాషణంబుల నిదిపో
యరుదు పరామర్శింపం, గరము ప్రయత్నంబు తోడఁ గల దిందనుచున్. 759

క. ఆకుజఘనకోటరమున, నాకలములు వైచి యనలమంటించిన న
స్తోకతరకీలసంయుత, మై కీలలు ప్రబ్బికొనియె నభ్యంతరమున్. 760

క. పొగ నుడ్డుకుడిచి మంట, న్నగమరుగం గాలి యేడ్వసఁగ నన్నగమున్
డిగనుఱికి దుష్టబుద్ధిం, దెగిలిట్టుచు బిడుగుబడుగు దేహము విడిచెన్. 761

వ. అప్పుడు రాజపురుషు లద్దుష్టబుద్ధి నిరీక్షించి. 762

సీ. చెల్లెల్లముల కీక్షింప నిచ్చఁ నసొమ్ము మగుడ నీలేనికోమటి గులాము
చేసేత విశ్వసించినవారివెచ్చసచ్చములఁ గీప్పటుచు వై జాతితొండ
తెగిగంటిలేనిపోటుగ కొడ్లయద్దల గిద్దఁ బొడుచువేగినబిగాది
బూసంబుదరిపి నేర్పున నమ్మికొనుటకుఁ గరవ్వఁగోరడుదోసకారిబుడుగ

తే. యప్పనెపమున నూతాలు లడిగి పుచ్చు, కొని నయంబునఁ దీర్పక కోఁకపోఁక
సరకుసప్పట సరిచెప్పి యరగతాచు, చెడగరపుడొక్కమోరోగిసెట్టినుక్క. 763

వ. అనితిట్టి సొమ్ము ధర్మబుద్ధి కిప్పించి దుష్టబుద్ధిం గొఱఁతబెట్టిరి దుష్టబుద్ధి యగు
వాఁడు తనవారినిం జెఱచి తానుం జెడు నిట్లు రాజునుం జెఱచి తిరువాత నీవునుం
జేటునొందెద వనిపతికి కరటకుండు వెండియు. 764

చ. కడుఁ జెడుకార్యము ల్దమనకా మనకా భితుమరెయ్యి నేఁడు నీ
నడపడిఁ జూచి నమ్మదగునా నినుఁ జిల్వకుఁ బాలుఁబోసి ముం
గడపసియింపఁజేసి చిరకాలమువెంచిన మే లెఱుంగునే
కడెఁగి బడల్పడం గఱుచుఁగాక కృతఘ్నులె దుష్టమానసుల్. 765

క. దెలియనివరుఁ దెలుపఁగనగుఁ, దెలిసినమానవుని వలదు తెలుపఁగ మదిలోఁ
దెలిసియుఁ దెలియనికఱటికిఁ, గలితన మెఱిఁగింపఁ గమలగర్భునివశమే. 766

క. పతి కిట్లొనరించిననీ, కితరు లనం దృణకణంబు లెలుకలచే భ
క్షితమయ్యె సినుపత్రసను, కతవినవే మున్ను దమనకా నీ వనుడున్. 767

క. దమనకుఁ డలకరటకుదిక్కు, మొగంబై యెట్లు నీతికోవిద యిది స
ర్వముఁ జెప్పమనిన నక్కథ, యమలమతిం జెప్పఁదొణఁగె నతఁ డాతనికిన్. 768

చ. ననిచి కి వేరజాతటమున న్మహిసారపురంబునం గృత
ఘ్నునిచెలి మందభాగ్యుఁడను కోమటి వర్తిలు విక్రయింపనుం
గొనఁ దిన లేమిఁ గూటికిని గోఁకకు నీదిరమై కృశింపుచుం
గనుఁగవఁ బ్రాణము ల్నిలిపి కాటయగాఁగ నతండు నిచ్చలున్. 769

ఉత్సాహ శౌరిచెయిక్కఁ గ్రొత్తపెండ్లికూతుఁ గృష్ణఁ జూచి యో
వారిజాయతాక్షి భాగ్యవంతుఁ గాంతుఁ గాని వి
ద్యారణప్రవీణుఁ గాంచ కట్టిమత్సుతుల్వని
చారులైరి చూడుమంచు సాధ్విపంతి పల్కదే. 770

వ. అని తలంచి. 771

క. అతఁ డొకనాఁడు ధనార్జన, మతిఁ జనుచుం గఠినలోహమయతులఁ సుహృదా
యతనమునఁ బెట్టితిరిగెం, గతిఁ గలిగెదు ననుచుఁ దిరుగఁగలచోఁ జెల్లన్. 772

చ. సరకులకేఁగి వేసరెఁ బసారముఁ బెట్టిన సెట్టిఁ గూడి వే
సర నదు గానఁ గావక యజస్రము గూలికియూటమోసి వే
సర మతియూప్వఁ గూరయును సంగుఁగొందుల విల్చివిల్చి వే
సర నొకత్రోవయు న్ఫలమొసంగదు సెట్టిన భాగ్య మెట్టిదో. 773

ఉ. అల్లన మందభాగ్యుఁ డగు నాతఁడు వేవిధులం గృశించియున్
ఇల్లుముపచ్చగాక పనివాడిన మోమునఁ దా నివృత్తుఁడై
తెల్లముగా సుహృత్తుల దెమ్మని వేఁడిన పంచనామతిం
గల్లలఁ బల్కె నాతఁ డెలుక ల్దినెఁ ద్రాసనియాసపెంపునన్. 774

క. ఆమాట కేఁకిరాట, గ్రామణి దలయూఁచి యట్లగాకున్నసఖా
యీమాడ్కి నాకుఁ జెప్పఁగుపే వింగుల నపూర్వమిదిసుమీ యేమాయెన్ 775

క. అని వెగటుదోఁపఁనుండ, న్ననుపటిపలెఁ దన్నివేశమున వర్తిలుచున్
దవలో గోయుమఁ గతిపయ, దినములు గ్రమియించి కలఁకదీఱినపిదపన్. 776

క. బహుగుంగోమటి తుకతుక, నుడుకుచుఁ దులదక్క ననుచు నున్నాఁ డోయిసీ
గుడిఁ ద్రిప్పినకపటాత్ముని, దడయక గుట్టయినఁ ద్రిప్పెదం జేసేతన్. 777

క. అని తలఁచి యాలకృతఘ్నుని, తనయునిచే నొక్కనాఁ డతఁడు నూనియను
న్నను కగునుశిరికపిండియు, జనవునఁ బట్టించుకొని ప్రజల్వెత్తింపన్. 778

క. స్నానవ్యాజంబునఁ జని, వాని నొకానొకసుహృన్నివాసంబున నా
లోనిడి క్రమ్మఱుటయుఁ జం, తౌనతుఁడై వాని కాకృతఘ్నుం డనియెన్. 779

శా. అయ్యా లేవచ్చెఁ గదయ్య నీపిఱుఁద రాఁడాయె న్మహాసాధ్వసం
బయ్యెం జెప్పఁగదయ్య నావుడతఁ డత్యార్తుం బలెం బల్కె నే
నయ్యేట న్సలిలంబులాడఁగఁ దటన్యస్తాంఘ్రి నాసూద్ధతిం
బయ్యా నీసుతుఁ గ్రద్దదన్నుకొనిపోయెన్ భీతివాపోవఁగన్. 780

క. ఏను వితాకుఁడనై నీ, తో నీచెడువార్తఁ జెప్పుదుం గాకనుచు
న్వే నిలువక వచ్చితి నన, నావనము ఱవాడ నాతఁ డాతని కనియెన్. 781

ఆ. చేపఁ జెల్లగాదు చిట్టెల్క యును గాదు, పిట్ట గాదు కోడిపిల్ల గాదు
కొట్టి జొట్టుఁబట్టుకొనిపోవఁ బసిబిడ్డ, లేఁడ నీల గ్రద్దలేఁడ జెప్పుమా. 782

క. విను సంగతి గాదు సుతుం, గొని తెమ్మన నతఁడు గ్రద్ద గొనిపోయిన బా
లునిఁ దేనగు మూషకములు, దినిపోయిన యినుపత్రాసుఁ దేబాగ్గ నన్. 783

క. ఇనుపతుల నెలుకదినఁగాఁ, గొనిపోవఁగరాదె గ్రద్దకు న్సఖ యుష్మ
త్తనయుని నీమాటలకం, బెను వింతలె తెలియ నెప్పటికి నామాటల్. 784

క. అని మాటమాట సరిపు,చ్చిన పంచకుఁ డెజిఁగి యతనిచేతికిఁ దులరి
చ్చె నతండును దాఁచినత, త్తనయుఁ గృతఘ్నునకు సమ్మదమ్మున నిచ్చెన్. 785

క. ఇది నీకు నిదర్శనమగుఁ, గద నినుమది నమ్మరాఁగద యేమని చె
ప్పెద వొప్పగులుక న్నయగుణ, మదిలే దొట్టయిన యత్యమైనన నీకున్. 786

ఉ. ఆదర మొప్ప నుక్తపరుఁడై మనువాఁ డుపదేశికిం దృఢా
హ్లాదము సంఘటించుఁ బరమాదరణ శ్రవణంబు పెంపునన్
హీనశలేమి నస్తదుపదేశ మృదూక్తిశతంబు లక్కటా
సూచులవోలు నీచెవులు సోఁకిన నొచ్చుసహింపకుండుటన్. 787

క. ఘనగుణములఁ దనుగుణముల, జనుఁ డమరు న్సాధ్వసాధుసంపర్కముచే
ననజనపదస్థితం బగు, ననిలుఁడు పోలెన్ శుభాశుభామోదములన్. 788

వ. కార్యాకార్యవిచారంబు చాలని గురునయినఁ బరిహరింపవలయునని పలుకుచు దమనకుం బరిహరించుకొని కరటకుండు రాజనికటంబునకరిగె దమనకుండును దోడన జనియె నంతఁ బింగళకుండు సంజీవకుం జంపి విన్ననైన మొగంబున దమనకు నాలోకించి. 789

చ. ఇలఁగల తాని కేమిగడియింపఁగ రాదు హితత్వసత్యని
శ్చలగుణశాలి యైనభటసత్తము నొక్కనిఁ గూర్పరాదు గా
కలవున నిట్టిబంటు దెగటార్చె న్వృథా మతిలేక నీదురు
క్తులు విని చంపితి న్విగతదోషుని నమ్మహనీయభాషునిన్. 790

వ. అనినఁ బింగళకునకు దమనకుం డిట్లనియె. 791

ఉ. పంచకులం బడల్పఁజెచి నైచుట సత్పురుషవ్రజంబు ర
క్షించుట విత్తమాశ్రితులఁ జేర్చుట భూప్రజపై దయాగుణం
బుంచుట రాజచిహ్నములువో యభిషేకముఁ బట్ట బంధముం
గుంచెయు వంత్రతంత్రబహుగుప్తియు నుంటికి లేకపోయెనే. 792

క. అరిమరణంబున కేలా, పరితాపము నొంద విరసభావముగలవోఁ
బరులేల యాగ్రజున్నో, దరునైనను జంపుదురు మొద లాజన్యుల్. 793

క. వైరముపుట్టినఁ బోరక, శూరులు నిర్జరులు రాక్షసులఁ జంపరె యా
వ్వారికి నిది వింతయె యం, దారకులును వారు నన్నదమ్ములు గారే. 794

క. విరసించినచో రాజులు, దురమున నెవ్వారినైనఁ దునుముదు రలుకన్
గురు నగ్రజు ననుజు న్మో, హరమున వధియింపఁ డోటుహరిసుతుఁ డరయన్ 795

చ. పరుషసముల్లసన్మధురభాషిణిహింసయుఖండసత్కృపా
నిరతవసువ్యయవ్యసన నిత్యధనాగమలోపను ప్రసా
దరవయసత్యసత్యపరితాపదసౌఖ్యదవారకామినీ
స్ఫురణవసత్యదాప్తిఁ బోలును నృపనీతి యనేకరూపమై. 796

వ. అనియిట్లు దమనకుండు బోధించినఁ బశ్చాత్తాపంబు మాని మృగరాజు ప్రాజ్యరాజ్య
సుఖంబు లనుభవింపుచుండె. 797

క. అని వినిపించినగురునిం, గనుఁగొని నృపపుత్త్రు లధిక కమనీయగుణాం
బునికీ రెండవతంత్రం, బనురక్తిం దేటపఱుపుమని యడుగుటయున్. 798

మ. ప్రతిబాధీకృతకామకామనుజభుక్ప్రిధ్వంసనారంభణ
వ్యతిషంగ వ్రతసత్త్వసత్త్వనవవ్యాపారపూర్ణీభవ
న్నతసంకల్పవిశేషశేషరచితామ్నాయోక్తిపద్యస్రుతో
ద్గతరోమాంచవితానతానవగజాధాటీభిదుత్పుంగవా. 799

క. వనజభవతనయమేధా, వినుతవినీతైకదివ్యవృషభజగత్పా
వనపంచతత్త్వమయ వి, ధ్వనలోచన సర్వభూతహితసంచారా 800

మాలిని. అవనలయకరాత్మా హారిముక్తిప్రదాత్మా
వివిధనిగమవేద్యా విశ్వసర్గోపపాద్యా
భవతిమిరపతంగా పర్వచంద్రోపమాంగా
హవిరశనబలిష్ఠా హార్యకల్పాజినిష్ఠా. 801

గద్యము ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధసరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవి
ప్రశంసాభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ పరి
శ్రమణధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతపర్వరాజకుమార నిస్సహాయప్రబంధ
నిర్మాణభోజభూదారసుధామధురభారతీసనాథ వేంకటనాథప్రణీతం బయినపంచ
తంత్రంబున మిత్త్రభేదం బనునది ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# పంచతంత్రము.

## ద్వితీయాశ్వాసము.

---



గౌరీపత్యుత్తను

భాగాభిజ్ఞాననిశ్చపంచపలాసం

భాగభ్రద్వ్యపత్యవ

మాగమసురసింధురూపహరిహరనాథా 1

వ. దేవా సుహృల్లాభాభిధాన ద్వితీయతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రి విష్ణుం డవ్విష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. సాధించెఁ గార్యముల ధన, సాధనములు లేక సారసౌహార్దసమా
రాధనమున మున్నార్జిత, మేధాధృతిఁ గాక కూర్మమృగమూషకముల్. 3

క. నా విని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రదియెట్లు నయ
శ్రీవిభవ తెలుపు మన వి, ద్యావారిధి వారికద్ధరామురుఁ డనియెన్. 4

క. శతమఖవనసఖవిటప, స్థితిమహిళారోప్యనగరిచేరువఁ గలద
ప్రతిమం బౌకబూరుగు లఘు,పతనుఁ డనుకాకి దానిపై వర్తించున్. 5

సీ. వసుధ నెవ్వనిసదన్వయకర్త జేజేలతేనికిఁ గుల ముద్ధరించుకొండుకు
పితృకార్యములు సమర్పింతు రెవ్వానికి నాదిత్యరుద్రవస్వగ్రభుక్తిఁ
బొదలు నెవ్వనిగృహంబున మనోహరభారతీభారవహముఖద్విజకులంబు
పథికసంతతి కేరుపఱుచు నెవ్వనికంఠమిశ్రితారావంబు మేలుగీత్లు

తే. ప్రజ్ఞ పెంపున నెవ్వానిబలమునకును, బ్రహ్మకొడుకైన లెక్కఁ జెప్పంగఁజాలఁ
డతఁడు నగరోపకంఠచైత్రాగ్రవర్తి, పక్షిమాత్రుండె వాయసపరివృఢుండు. 6

క. ఆకాకి నాకపథమున, నేకాకిత మేఁతలాడ నీరము గములం
గీకామండల మగుసర, యూకావనమునకుఁ బోవనున్నెడ వటకున్. 7

చ. వెడవెడఁ జంకఁ జిక్కమున వ్రేలెడుచల్దియు సందిలోహపుం
గడియము క్రూరదృష్టిగలకన్నులు నల్లనిమేను మూఁపునం

బడిశము జొంజాఱుండల తపాతముజేగురుబొట్టు మేఖలం
గొడవలి గల్గివచ్చె నొకక్రూరకిరాతుఁ డమంధరత్వరన్. 8

క. వచ్చిన వాయసపతి దన,యిచ్చ న్వెఱఁబొమ్మవంటియితఁ డెందులకై
యిచ్చటి కేతెంచెనొకో, యచ్చెరు వనుచుండ నద్దురాత్ముం డచటన్. 9

క. పులుఁగుడిసెఁ బన్ని వల నా,డ్వలధరణిం జాఁదుపఱిచి ప్రస్సినకన్నూ
ల్గలపులుఁగుదీము మిడి యు,గ్గలపుఁదమి న్దాచియుండఁగా దైవగతిన్. 10

శా. చిత్రగ్రీవుఁ డనంగ నొక్కవిహగశ్రేష్ఠుండు సత్కృత్యకృ
త్పత్త్రివ్రాతము వెంట గుంపుగొనిరాఁ దైఁబోవుచున్ శాడ్వల
క్షేత్రస్థేమము దీమము న్గని వగః క్రీడాపరిత్యాగియై
ధాత్రి న్వ్రాలె ననాయ మగ్యమునఁ బత్త్రధ్వానము ల్బోరనన్. 11

క. పులుఁగులఁ బినుఁగు కిరాతుఁడు, వలఁదవులఁగఁ దిగిచి తగ్గి వగ్గరపగ్గం
బలఘుతరకీలమున సం,చలనముఁ గావింపుచుండె సలసివభంగిన్. 12

వ. అంతఁ బత్త్రిసుత్రాముం డనుజీవులఁ గేవలయత్నంబునం బిలిచి దుష్కర్మానుకూ
లంబున నిందఱ మిజ్జాలంబునం జిక్కితి మీయుపాయంబున కొండొకయుపా
యం బూహించితి యోగక్షేమ్యాభిమానంబున నిందఱ మిజ్జాలంబుం బత్త్రజాలం
బునం బెట్టుకొని దూరం బరుగుద మప్పటికి నొకగతిలేకపోయెడునోటు నిర్విలం
బంబున లెం డనిచెప్పిన నొప్పుకొని యప్పులుఁగు లొక్కయూఁకున దెప్పరం
బుగా నుప్పరంబున కెగసిన నస్ఖాలితకీలంబై జాలంబు వెంటరాఁగొని యాయుక్కా
లంబున గగనమార్గంబునం బఱచుచుండె. 13

క. ఆవిధి విధియూఁడక పడిఁ, బోవఁగ నిది'యననుభూతపూర్వం బనుచున్
ధావనమున వనమునఁబడుఁ,బో విహగముఁ బనుచు బోయ పోయె న్బిఱుఁదన్. 14

ఉ. ఎప్పుడు నేలవ్రాలు శ్రమ మేర్పడ నెక్కలునొచ్చి పెచ్చుగా
నప్పుడ చిక్కు నిప్పులుఁగు లన్నియు నా కని నిశ్చయించి వాఁ
డెప్పటిభంగి వెన్దగిలి యేఁగుచునుండ విహంగమంబు లా
చొప్పున జాల మెత్తుకొని చూడఁగఁ జూడ నదృశ్యమాటయున్. 15

క. అతిలాఘవమున నల ఽఘు, పతనకుఁడు న్దత్కపోతపతివెంబడిన
ధృతలంబునఁబఱచెం బ,త్కుతిఘుంకృతు లఖిలదిశలఁ గ్రందుకొనంగన్. 16

క. జాలగ్రాహివిహంగమ, జాలముఁ బరికింపలేక జాలనిజాలిం
దూలుచుఁ గ్రూరకిరాతుఁడు, వ్రీలినచరణములతో నివృత్తుండయ్యెన్. 17

క. అపడువున నలచిత్ర,గ్రీవుఁడు దూరంబు నరిగి భృత్యుల నటుగం

భావించి పలికె నోహో, ధావని మతియిచట వ్రాలుట మె యుండదె ముక్. 18

చ. సకలపథీనమూవసుఁడు శాంతిసమగ్రుఁ డజాతశత్రుఁ డం
తకనిభసత్త్వుఁ డిష్టజనతాఘనతాపవిఘాతి సర్వమూ
షకములసార్వభౌముఁడు రసజ్ఞుఁడు ప్రాణముప్రాణ మాహిర
ణ్యకుఁ డిటనుండు నాయనదయామతి *నివ్వలవంతఁ బాడుదుక్. 19

చ. నిలువుఁడు నా విహంగములు నిల్చె బిలస్థలభూమి నంత న
క్కలికల మాలకించి పొడకట్టి యనాయగుణాస్పతాంగుఁ గే
వలసఖు జీవితప్రతిము వారితమత్సరు వీతరాగుని
ర్మలుఁ బతగాగ్రణిం గని హిరణ్యకుఁ డప్రమిత్రితాత్ముఁడై. 20

చ. పలికె సఖా యఖండనయపారగతుండవు దీర్ఘదర్శివే
వలన విపత్తిఁ జెట్టుపడనివాఁడవు నిత్యసుఖానుభూయి వి
య్యలమట నీకు నెట్లొదవెనయ్య విధాతకుఁ బాఁడిలేదుగా
వలయుఁ గదయ్య కర్మమెటువంటిది చూడఁగదయ్య యక్కటా. 21

క. అనిపగ మహిరణ్యకుఁ గనుఁ, గొని చిత్రగ్రీవుఁ డనియె గూర్మిసఖా నా
యనుజీవు లలసి రేను, న్వనటం బెగ్గలితి నలుకు వలఁ గేవలముక్. 22

క. ఏవాసరమున నెద్దెస, నేవయసున నెట్టికర్మ మేమఱఁ డెవ్వాఁ
డావాసరమున నద్దెస, నావయసున నట్టికర్మ మతఁడు భుజించుక్. 23

క. కలకాలము లే దలమట, కలకాలము లేదు సుఖము కాయము మోసం
గలిగినటు గొన్నాళ్ళు, యిల నిటు గొన్నాళ్లు దిరికేలా వగవక్. 24

క. దైవికములైనపనులకు, వావిడుచుఁ డవార్యధైర్యవంతుఁడు నయరే
ఖావిభవయెప్పుడటువలెఁ, గావలెనటు కాకపోదుగా యని తెలివిన్. 25

వ. అనుచిత్రగ్రీవునకు హిరణ్యకుం డిట్లనియె. 26

క. వేసటనొందక లఘువి, న్యాసంబున నూఱుయోజనము లరిగి సుఖ
గ్రాసమునఁ బొదలివత్తు వ,రోసఖ నీకెట్లుమోస మొదవెం జెపుమా. 27

క. అక్కట యాపల్లతలం, జిక్కక నయసరణిఁ ద్రొక్కు చిత్రగ్రీవుం
డెక్కడ యీనిర్బంధన, మెక్కడఁ గాలముఁ దరింప నెవ్వరునుఁ దుల్. 28

క. ఆపత్సంపద లలఁతులఁ, బ్రాపింపవు ఘనులగాని ప్రజ్ఞంబోడవై
చూపట్టుచంద్రుఁ †డారెం, డోపతగాధ్యక్ష కలవె యుడుసంహతికిక్. 29

* నివ్వలవంత=వలవలనిబాధ. † ఆరెండు=ఆపత్సంపదలురెండు.

చ. ఉరివిహంగపంజరంబునకు * నోదము దంతికి ముందు చిల్లకుం
బరుషతమోగ్రహగ్రహణబాధ సుధాంశున కంశుమాలికిం
బరమదరిద్రతాప్తి మతిమంతులకుం గలుగంగఁ జేసె నె
వ్వరు నవ తిందునందు బలవంతుఁడు పో విధి నాకుఁ జూడఁగాన్. 30

ఉ. గగనమునం జరించు పతగంబు లగాధసముద్రవారిలోఁ
దగ విహరించు మీలు వలతంతువులం బడి చచ్చు నవ్విధిన్
దగిచన స్థానశక్తి గలదే యల చేర్పడఁ జింత దీనికై
తెగు నెడ కొంతదవ్వయినఁ దెచ్చుఁ గదా విధి దేహధారులన్. 31

వ. అని † యాఖులేఖపతి సెప్పి, మనమున నస్తోకశోకమగ్నుండై వ
చ్చిన యచ్చెలికానిఁ దను, లోకానినయనాయాంశ మెచ్చి కొలుకుచునుండెన్.

వ. అప్పుడు వాయసధుర్యతుహినగ్రావుండగు చిత్రగ్రీవుండు సుహృల్లోకశరణ్యుండగు హిరణ్యకున కిట్లనియె. 33

క. పరహితచరితా యస్మ, త్పరిస్ఫుతబంధములఁ బోలెఁ బరిచరబంధో
త్కరమేల నణుక విప్పుము, పరివారము లేని భూమిపతి పూజ్యుండే. 34

క. సిరి వోవను కూడినఁ బరు, గురుగం వాఁ డవఁ దిపుచ్చుకొనుఁ బరపీడల్
నరకు నోనరు సిరిదక్కుఁడు, పరివారము లేని రాజు బ్రతుకును పాడై. 35

వ. అనువప్పలుకుల కలరి హిరణ్యకుండు. 36

క. హితభృత్యులతో నేభూ, పతిక లఘుస్నేహసంవిభాగము లమరన్
బ్రతివాసర మరఁదుబలో, ధ్రతుఁడై పాలించుఁ జావ్వె త్రైలోక్యంబున్. 37

క. పరివారము పట్టున నా, దర లేశము లేని భూమి గవుఁ డఖిలర్ద్ధిం
బోరయఁడు సంతతి కెడసిన, పురుషుని వంశంబు నష్టిఁ బొందిన భంగిన్. 38

చ. అదన నుజీవితంబిడమియా రజమాసుట లేని నేరము
ల్వెదకుట నిచ్చలు న్బరిభవించుట కింకరసంకులంబు నె
మ్మదికి నసహ్యమాట దయమానుట ‡ పిమ్మటనాడికోల్మి హి
పదవికిఁ బాసి యొంటిపడుబాటుఁ బొందు నృపాలచిహ్నముల్. 39

ఆ. సైన్యభావ్యబంధుసమ్మగ్ధముల సెవ్వఁ, డోర్చ్వ గలిగి పుడమి నుల్లసిల్లు
నతఁడు నూవె నీశజాధీశ వసుమతీ, హిమమయూఖవదన కింటిమగఁడు. 40

క. అనిపలికి జాలగుణములు, దునిములుగాఁ జేసి ఖగపతుల వెడలించెన్

* ఓదము = ఏన్గులు కూలుటకై మఱుఁగుపుచ్చిన గొయ్యి. † ఆఖులేఖపతి = మూషకేంద్రుఁడు. ‡ పిమ్మటనాడికోలు = నున్నమొగముచాటైన తర్వాత దూషించుట.

జనితాద్భుతి మూషకపతి, ఘను లాప్తులనేగి కోర్వఁగాఁ జేరఁగదా. 41

శా. చిత్రగ్రీవునిఁ గౌఁగిలించుకొని తత్సేవందురంతాద్భుతి
చ్ఛత్రచ్ఛాయఁ బ్రహృష్టుఁ జేసి యభివృద్ధి న్విందుఁ గావించి యో
పత్రిగ్రామణి పోయిరమ్మనిన బాష్పచ్ఛన్ననేత్రంబుతో
వత్రాతం దనుఁ దానవీడుకొని పోయెం బక్షియాలోపలన్. 42

క. జాలమునఁ జిక్కి విహంగమ, జాలము బ్రతికించి కొలఁకుసాముల హేలా
లీలం గలపుటఁ గనుఁగొని, యాలఘుపతనకుఁడు మూషకాగ్రణికనియెన్. 43

సీ. పదగరాధిపభేద కరము నీకరము నీవివరంబు బహుమార్గవిశ్రుతంబు
రాజశేఖరకుమారకమనోహరము నీచర్య నీసన్మానసం బుదాత్త
మవిరళసుగతిహేతువు నీవినీతత్వ మఁరునీగుణము ధర్మానుకూల
మతివృద్ధిమహిమఁ జెన్నారునీయాకార మిష్టకార్యముల నీయోగి వెరుగు
తే. నీకరుణ లక్ష్మివాటిల్లు నీరసజ్ఞ, సత్యభారతి నిలుచు నీసన్నిధాన
మభిమతార్థంబు లొసఁగు ని న్నభినుతింప, శక్యమే నాకు మూషకక్ష్మాకళత్ర. 44

క. ప్రతిలేనికరుణ నీడజ, పతిన్బ్రతికించి బాపి సుగతిఁ బడసితి నీసం
గతిగాదే యీయాప, ల్లతలంటినమ్ముబోటులకుఁ గృతకృత్యా. 45

క. ధిపదీమన్స్నేహము నా, కవికళతేజోవిధాయి యగు నెయ్యుఁడవై
తనతవలేక మనీషిప్రవరా వర్తింపు మన హిరణ్యకుఁడనియెన్. 46

క. కయ్యమునకు నెయ్యమునకు, వియ్యమునకు సమతవలయు వేఱొకఁడైనన్
గయ్యము గెలువదు నిలువదు, నెయ్యము వియ్యంబు పొసఁగ నేరదు మొదలన్.

క. బలహీనుఁడ నేను మహా, బలుఁడవు నీ విధముఁ జెట్లు బలవంతునితోఁ
జెలిమియొనరించు జెపుమా, తలద్రివ్వక మ్రింగఁ జూచెదవు వెలువడినన్. 48

క. అమరదు నీపొత్తు వృథా, భ్రమఁ బెట్టకు భోక్త వీవు భక్ష్యమ నే నం
చు మొగంబోడక పలికినఁ, దనుకింపక మఱియు లఘుపతనకుఁ డనియెన్. 49

క. బలవంతము కాకము నే, బలహీనుఁడ ననుచు విడిచిపలుకకు ప్రజ్ఞా
బలమున నధికుఁడ వదివో, బలము శరీరస్థమైనబలము న్బలమే. 50

క. తలద్రివ్వక మ్రింగెద నని, పలికెద వేనట్టిగ స్వభావుఁడనే నీ
కలిమిపరాపత్తిదన, జ్వలనఘనాఘనము గాన సాధుచరిత్రా. 51

క. నీవంటియుత్తముఁడు సుఖ, జీవితుఁడై యున్న నేను జిరజీవిఁ జామీ
నీవిందుఁ గలుగఁ జిత్రగ్రీవుఁడు విపదంబునిధిఁ దరించెనొ లేదో. 52

చ. పరుషవిశృంఖలాలపనపంక్తుల సాధుమనంబు లీక్రియం
భారయఁగఁ జేయ నెవ్వరికిఁ బోల దహో ఖచరాపగాపహో

ధరపరిరంభసంభ్రమగతత్వరతుంగతరంగహస్తసు
స్తరశరధిం దృణాగ్రశిఖితస్తముగా నొనరింప నేర్చునే. 53

క. అనులఘుపతనకుపలుకులు, విని మూషకరాజు పలికె వెఱ్ఱీ నీతో
ననుబోటి యలంతి నెయ్యం, బొనరించినఁ దగునె తేరొకో బలవంతుల్. 54

క. తనగుణముఁ బూనియున్నాఁ, డనిపగతునినమ్మబోల దనిశము మదిలో
ననలశిఖాతప్తోదక, మనలునిపైఁ జింది చల్లనార్చునొ లేదో. 55

క. పోలినదిపోలు నెవ్వోఁ, బోలని యదిపోలు దంబుపూరంబునఁ బోఁ
జాలునె శకటములీల, న్నేలం బోతములు వేర్చునే యేఁగంగన్. 56

క. మోసంబూరకతఁచుం, జేసిన మేల్మఱచు విశ్వసించినఁ జెఱుచున్
నాసత్యము దుష్పురుషుం, డోసుగుణా వినుము చూడ ముత్తమునొకనిన్. 57

వ. సుజనశబ్దంబు పురాణోక్తంబుగా విచారించెద నిష్టుండయ్యును బహుసుకృతోపలా
లితుండయ్యును దుర్జనుం డంకగతస్వార్ధోరగంబు చందంబున భయంబు సంపాదించు
చుండునని వెండియు. 58

క. పరపురుషచింత యుంతః, కరణంబునఁ గలిగి మగనిఁ గరఁగింపుతలో
దరికరణి హృదయకలుషము, మఱుఁగిడి ఖలుఁడాడు మధురమధురతరోక్తుల్. 59

క. నేరములొనరించిన నుప, కారము సేయుదురు నొవ్వఁగాఁ బల్కినఁ గ్రై
వారము మఱవము మే మను, వారలకున్ ఖలు లకొండవైరుగాగారే. 60

ఉ. కావున నిన్నుఁబంటిబలగర్వసమగ్రులతోడి మైత్రి దుః
ఖావహ మేఁగుసున్నఁ గరటాగ్రణి వహ్నిశిఖానమూషకో
పావిలచిత్తుఁడై పలికె నద్దిర మాటలజోలిఁ బన్నునే లా
విను లక్షణైనవదల న్నినుమూషకలోకవల్లభా. 61

క. చెలిమికి దూరస్థుఁడవై, తొలఁగిచన న్మదిఁదలంచెదో యదినాతోఁ
గొలుపదు త్రివ్వెద ధరణీ, తలవివరముఁ ద్రవ్వినల్లఁ ద్రావెదఁ పిదపన్. 62

క. అనలమునఁ గాఁచిలోహము, నెనయించినకరణి వేఁడి నేనియుఁ బ్రజ్ఞా
ధనులఁ దనుఁగూర్చికొమ్మను, మనువచనము వినవె యదియు మత మెవ్వరికిన్. 63

క. ఖలుఁడు సుఖభేద్యుఁ డతిమృ, త్కలశగతి న్సజ్జనుండు గాఢాగ్నిశిఖా
కులతప్తకనకఘటముం, బలె దుర్భేద్యుండు చక్కఁబడఁడు మృదూక్తిన్. 64

తే. అట్లుగావున నినువంటి యనఘచరితు, వెఱపుపనినైన సఖుఁగాఁ గావించుకొనఁగ
వలయు మేల్గోరు నావంటివాని కనిన, సమ్మదంబంది మూషకస్వామి పలికె. 65

క. అరిపలెనుండుట క్రియలం, బరమాప్తమ్మూర్తిఁ దేటపఱచుట యదివో
యరయ సుహృల్లక్షణమో, కరటా నీయందుఁ దోఁచెఁ గదయీసరణుల్. 66

క. మతిశంకలేక మూషక, పతివివరము వెడలి కరటపరివృఢుతో న
ప్రతిమగుణరత్నఖనితోఁ, గతకల్మషతోడఁ జెలిమికాఁడైయుండెన్. 67

వ. అట్లు కృతసఖ్యుండగు నయ్యుందురుముఖ్యుండు విందుఁబెట్టి వీడ్కొలిపిన దరి
ద్రునకు నిధానంబునుంబోలె సుహృల్లాభంబుఁ గనుట కలరుచు సింహవ్యాఘ్ర
గజగవయ గండభేరుండ ప్రముఖజంతు సహనంబులగు గహనంబుల విక్రమించి
సారంబులగు వన్యాహారంబులఁ దెచ్చియిచ్చుచు నచ్చిక బుచ్చికలడరఁ గొంతకాలం
బుఁగడపి యొక్కనాఁడా వాయసపరివృఢుండు హిరణ్యకు డాయంబోయి
యిట్లనియె. 68

ఉ. పోరొదనిప్పుడన్యవనభూమికిఁ బ్రాణసఖా ప్రమోదసం
ధాయక నన్నుఁబంపు మనిన న్విని ధైర్యము వ్రస్సి వెల్వలం
బోయినమోముతోడ బలిభుక్ప్రవరుం బురుషార్థసంగ్రహో
పాయు సుహృద్విధేయుఁ గని పల్కె హిరణ్యకుఁ డార్తచిత్తుఁడై. 69

చ. ఇట ననుడించి యేమికతమేఁగెదు చెప్పఁగదన్న యెట్టు లె
క్కటినిజరింతువన్న త్రుటికాలము నిన్నెడఁబాసియున్కి దు
ర్ఘటముగదన్న నాకడనుగల్గినయాధృతి యెందుఁబోయె ని
ప్పటికి విచిత్రమన్న విధిభద్రవిరోధిగదన్న యెన్నఁగాన్. 70

చ. అని కనుదోయిచెమ్మగిల నాకృతివిస్మృతినొంద మూర్ఛవో
యినబలిభుగ్విభుండు చలియించి గరుద్వ్యజనానిలంబునన్
దనువిడిఁదేర్చి యోపరమధార్మిక నిన్నెడఁబాసిపోవ నే
ర్తునె సకలార్థసిద్ధఫలదుండని చూతుఁగదయ్య నిన్నిటన్. 71

ఉ. నాపయనంబువిన్ము కరుణాపరుణాలయ వృత్రశాత్రవా
సాపురకాననోర్వి నాకసారసరోవరమొప్పనందు వి
ద్యాపరమేష్ఠి మంథరకుఁ డన్కమఠాగ్రణి మత్సఖుండు సా
ఖ్యాశ్రవహుఁ డుఁడు నస్మదహితార్థిఁ గనంగొని సాదరంబునన్. 72

ఉ. అతఁడు నాకుఁ బ్రీతిపఱుఁడై యొనరించు ననూనమానమాం
సాతిధుజక్రియా వ్రజసమగ్రుఁడనై చనుదెంతుఁ గ్రమ్మఱన్
నీతిధురీణ వన్పనుపు నీ వనఁ గన్నులశోకబాష్పధా
రాతతు లుప్పతిల్లఁగ హిరణ్యకుఁ డాతనిఁజూచి యిట్లనున్. 73

చ. ఉడుగనిసంత వింతరడ వ్రాలుటలేక పరాకుబోలె మే
నడిచిపడంగ నుక్కుగహనాంతరచింత జనించె నంఘ్రిలి
ప్పుఁడవున నూద మైఁ బవు కృపానిధి మందరకాంకు దుండు న
క్కడకరు దెంతు నింపదరఁగా నమఁదోడ్కొ నిపొమ్ము నావుడున్. 74

వ. లఘుపతనకుం డిట్లనియె. 75

ఉ. కాదన నేలవచ్చెదవుగాక సఖా వెఱఁ గావహిల్లె ని
ర్వేదము నీకు నెట్టులొదవె న్వివరింపుము నావు డాత్మ సం
పాదిహిరణ్యకుం డనియె బల్కుల కిందెడలేదు నెవ్వడిం
బోదము పోయి యావ్విపినభూమి సమస్తముఁ దెల్పి చెప్పెదన్. 76

క. నావుడు దత్తప్రతిభాషావర్గం డగుచు వాయసస్వామి నయ
శ్రీవిభవు మూషకాగ్రణి, నే వాతన్గఱుమఁకొని దివిజమార్గమునన్. 77

వ. కలచి యగాధశరంబగు తత్సరోవరంబున కరిగి తీరంబున హిరణ్యకు నునిచి లఘుపతన
కుం డుదారస్వరంబునం బిలుచుటయు సందర్శనకుతూహలంబున మందరకుండచ్చెం
దమ్మికొలఁకు వెలువడి ప్రత్యుత్థానం బాచరించి వారిచరతిరసాహారంబున విముక్త
మార్గశ్రముం గావించి స్వాగతాదికార్యంబులు వేఱువేఱ నడిగిన లఘుపతనకుండు కమఠ
పరివృఢు నాలోకించి. 78

చ. అనుదినదూరితాఖిలశరాకమరా యితఁ డాఖుఁ శేఖరా
జనుఁగుసఖుం డుపాయసఖుఁ డార్తశరణ్యుఁడు పుణ్యుఁ డిట్టియి
మ్మనుపథవర్తి వంత నడుమంబొడమం బొడవేఁది యిల్లువీ
డ్కొనియిటకేగుదెంచె నినుఁ గూర్చి సుఖస్థితిమందు నాతఁడై. 79

క. క్షణభంగురములు కపట, ప్రణయంబులు ప్రాణపతనపర్యంతంబున్
గుణవికలత కళశృంగము, ప్రణుతమతీ యిట్టిసాధుపథగాములకున్. 80

క. నావునకుఁ బాపెఁ జిత్ర, గ్రీవుని నిటువంటిపుణ్యకృత్యము లాహా
యేవేళ నెన్నిసేసెనొ, కో వేడుక నీహిరణ్యకుఁడు మందరకా. 81

వ. అని లఘుపతనకుం డుత్కర్షించిన నాశ్చర్యధుర్యుండై కమఠవర్యుండు హిరణ్యకున
కిట్లనియె. 82

చ. వినులనీచరిత్రములు వింటిఁ గృతార్థుఁడనైతి సత్యభా
షానిధి యోగిమానసముచాడ్పున నిర్మలమైననీమహా
మానస మెట్లు దుఃఖగరిమ న్భజియించె విచిత్ర మివ్విధం
బే నిటవిందుఁ జెప్పఁగదవే యన నాయన కాతఁడిట్లనున్. 83

ఆ. అనఘ సఖ సఖుండవగుటీవు మామక, వ్యథనకథన మఖిలయం బొనర్చి
సరసతావకాశ్వసనభాషితంబుల, గాఢసమ్మదంబుఁ గాంతు నేను. 84

సీ. వినుము మహిళారోప్యమనుపట్టణము సర్వసౌభాగ్యవిలసనాస్పదము గలదు
దానిచెంగట వసుంధర బొక్కఁ జొనరించుకొనియేను గౌరవంబున సుఖింతు
నటకుఁ జూడాకర్ణుఁ డనుతుచ్ఛసన్న్యాసి చనుదెంచి యేనుండుమునికిలోను
గాఁ గట్టినుతము భిక్షు మనుదినము ఘరాత్రిదక్షులవీఁటఁ బెట్టుచుఁ దురుగాన

తే. నెట్టుకొని పెద్దగాలంబు నిలువవాఁసి, స్నాన మొనరింపఁ డోంకారజపముఁ దడవఁ
డాంతముగఁ జూడఁ డంత వేదాంతవిద్య, కడుపుకై లాస మగయ నక్కష్టయతికి. 85

క. కుక్షింభరుఁ డగునలయా, భిక్షుఁడు వేసరక తిరిగి భిక్షించినయా
భిక్షము భక్షింపుదుర, క్షాత్ముండై [illegible]గోలనదలింపంగన్. 86

క. ఆయతిపూరిమిసఖుఁడు క, థాయుతశతపాఁగుఁడు బృహస్ఫికనువాఁ
డాయెడ కేతెంచె నుతా, మ్నాయా యొకనాటిమట్టమధ్యాహ్నమునన్. 87

క. వచ్చిపురాణోక్తకథల్, మెచ్చిలి వినుచునుచు నాతనికి రసభారల్
పచ్చిల వినిపింపఁగ విన, కిచ్చినఁటి [illegible] నటు మొగమయ్యెన్. 88

క. అగుటయుఁ గథకుండాయతి, మొగమూఁసి పలికె మాఱు మొగమైతివయో
తగు నే నీతో రసపుష్టిగ నేరుపు మెఱసి కథఁ జెప్పుచునుండన్. 89

శా. నాకీచందముఁ దెల్పిచెప్పుమని విన్నంబోయినం బల్కెఁ జూ
డాకర్ణుండు సఖా సుఖంబెఱుఁగ కింక్లిం భిక్ష భిక్షించి యం
టాకుంబాత్రికఁ బెట్టి తెచ్చి మఠమధ్యం జేర్చితిం జూడు నేఁ
డీకొండాటపు టెల్క యుల్కెఱుఁగ కిక్లీపార భక్షించెడున్. 90

క. నా కెక్కడిదిపరాక, స్తోకంబగు నలుక నెలుకఁ జూచెద నని చూ
డాకర్ణుఁడు పల్క బృహ, స్స్ఫిక్ కాకర్ణించి యుల్లసిల్లుచుఁ బలికెన్. 91

క. ఇక్కలుఁగున నిమ్మూషక, మెక్కటి మెలఁగుటకు వలయు హేతువుగలంగన్
బొక్కలగములై యుండుట, నిక్కమిట్ట[illegible]ంటినుండు నేయుందురవుల్. 92

క. ఒలువనితిలలకు నొలిచిన, తిలలీ నత్రాడుపసు మతిసురభార్యా
తిలకమునం దొకకార్యము, తిలఘాతిని యూహసేయదే పూర్వమునన్. 93

క. ఆకరిణి జాంగలంబున, నేకాకితఁ దిరుగు నెలుక యొడ నూహింతుం
గాక యొకకార్యమనఁ జూ, డాకర్ణుం డనియె నాదృఢప్రజ్ఞునకున్. 94

క. ఒలువనితిలలకునొలిచిన, తిలలీనత్రాడునసుమతీభార్యా
తిలకమునం దేకార్యముఁ, దిలఘాతినినిశ్చయించె దెలుపవె యనుడున్. 95

వ. బృహస్ఫిక్కిట్లనియె. 96

క. తొలుత నొకానొకభూసుర, నిలయమున కడువసతి ముగుట నివసించితి న
న్నిలయపతిప్రొద్దుపొడుపునఁ, గులభామం బ్రీతిఁ బిలిచికొని యిట్లనియెన్. 97

క. బాలా బుధసంతర్పణ, కాలంబిది యదనుగూడఁ గావింపు శుచి
త్వాలంకృతవై చరుపన, లీలావతి సతికిఁ గొలుచుతే దనిచెప్పెన్. 98

క. చెప్పిన యజమానుఁడు సతిఁ, దప్పక వీక్షించి పలికెఁ దన్వి గృహమం
దెప్పుడుఁ దఱుఁగగు కొలు చి,ట్లొప్పునె లేదని విలాసయుక్తులు నెరపన్. 99

క. సంచయ ముచితంబగు నతి, సంచయ మనుచితము సర్వజనులకు నెందున్
సంచయలోభంబున నొక, జంబుక మూరూర్ధ్వచాపవశమునఁ దెగదే. 100

క. నావిని వా తెరపై నొఱ, స్థై విన్నాణంపునగవు లత్తమిల న
జ్జావతి పతిఁగనుఁగొని తన, కావిధ మెఱిఁగింపు మనిన నతఁడిట్లనియెన్. 101

చ. అవహితబుద్ధి విను మధురాధర యామిషగంధదీక్షణం
బవునొకపక్కణంబున మృగావ్యాతిలిప్సుఁడు కూరపుల్కస
ప్రవరుఁడు గ్రాలు నాతఁడు ప్రభాతమున న్మృగఘోషభీషణా
టవిఁ జొరఁబాఱి చేరి యుచటం గిరిమేషము నేసె నెక్కటిన్. 102

క. వాలికతూపుల నేలం, గూలినయలకొండగొఱియఁ గొని తనియక నా
శాలంపటుఁ డొక్కఁడయా, భీలాటవిలోన నిర్లపితుఁడై తిరుగన్. 103

వ. ముందర నొకశాద్వలంబున. 104

ఉ. క్రమ్మి చతుష్టురిం జమురు కాలువలై ప్రవహింప రోమపుం
గుమ్మిలఁ బార్శ్వభూజములు గూకలు వ్రత్తులుగా ముఖంబునం
దుమ్ములురేఁగ మైమఱచి దున్నుచు ముస్తలఁదెల్చి కుంజముల్
గొమ్ములఁజిమ్ముదాని నొకఘోరవరాహముఁ గాంచియాత్మలోన్. 105

క కలముంబోలినయీ రేయే, కలము మదాహారమునకుఁ గాఁ దైవంబీ
పొలముతలఁజూపెఁ బొమ్మని, యలరుచు వాఁ డప్పుడమ్మహాకిటి నేసెన్. 106

ఉ ఏసిన బద్ధరోషమున నీకల మేడ్తెఱఁ దూఱిపుల్కసా
గ్రేసరు మీఁదనెత్తితలక్రిందుగఁ ద్రెళ్ళఁగవైచి వజ్రధా
రాసునిశాతదంష్ట్రికల వ్రచ్చి యచేతనుఁజేసి నొప్పిచే
గానిలి ప్రాణముల్విడిచెఁ గన్నరమూని ధరిత్రినత్తఱిన్. 107

వ. ఇట్లున్న మృగనరశవంబుల గాలివాలఁ గాలప్రేరితంబై దహ్యకనామధేయం
బొక్క జంబుకంబువచ్చి కొండగొఱియ రెండుదినంబులకు నేకలంబు పదినాళ్ళకు

నరుఁడు నాల్గువారంబులమఱి జాలుఁ గృతసుకృతవిశేషంబుకంగాక యీలాభాలు సంచయం బెవ్వరికినని తలంచి హాలాహలాభంబగు లోభంబునఁ గొంచెపడునని యెంచి యందేమిటిని గంటిపెట్టంజాలక పండ్లయాటలు ద్రావుచుఁ గొండొకతడ వుండి మందుదండియాఁకటిచిచ్చునకుంగాక యబ్బక్కనక్క యొక్కడిన శరాస నంబుఁగడిపి నేఁడీగనుఃప్రతిబంధంబునఁ బ్రొద్దుఁబుచ్చెదంగాకయని నిశ్చయించి.

క. ఆపిసినివక్క చాపము, కోఁపంగిట నితకి నరముఁగొటికివరధసం
బేపార మిడిసి మర్మని, రూపణ మొనరింప నక్కరోజాముఁగూలెన్. 109

క. అతిసంచయుపు మిదిపో, రతిబోటీ పలగు దాఁపురంబన నగుచుం
బతికి సతిపలికె దాఁప, న్గతిమేమీ ధాన్యమొనుఁగు గాలేదింటన్. 110

గీ. టోలఁదిలలుగ్రమ్మిత్తైలంబుఁదివి విధూ, తౌఘవిసరకృసరమాచరింతుఁ
బుడమివేలుపులకు నిడుమన్ననవిప్ర, సింహుఁ డబల నట్లచేయుమనియె. 111

క. నూనియఁదివియుటకై తిల, లానీరజనయన చెచ్చునపు డొకకాల
జ్ఞానిహలికాలయాగ్ర, స్థానంబుననుండి చేట జడియన్రా వ్రలెన్. 112

క. ప్రాలినఁ జెల్లా చెదర్లై, నేలందిలోలిత నంతనివ్వాలఁగున న
స్నాలాలక చూచునెడన్, వాలింపకసతికిఁ బ్రాణవల్లభుఁడనియెన్. 113

క. కలికి యున్నట్టి యీక్రియ, నొలికినతిలలెత్తి దంపు మోర్పన నన న
క్కలకంఠి యట్లచేసె, న్లలి భీతిప్రీతులగ్గలములై పెరుఁగన్. 114

క. ఆమహీసురశరణమునకుఁ, గామందకి యనఁగ నొక్క గానులది సుతుల్
నేమింపఁ బేసగంపం, గోనులగతి నువ్వులమ్ముకొన నేతెంచెన్. 115

క. ఏతెంచినఁబలుకులసరి, నాతీ ముడినువ్వులిత్తె నా కనివిప్ర
స్త్రీతిలకము ముదలించిన నాతిలలది యంటువడియె నని యూహించెన్. 116

వ. అట్లు బుద్ధికౌశలంబున నేను నియ్యుఱియ యొలుకబోట నిక్షేపంబుగలదని నిశ్చ యించితినని చెప్పి ఘాలకుద్దాలంబుల నా మెలంగు కలుఁగుఁద్రవ్వి నాచేతఁ జిరస్థా పితంబగు ధనంబుఁ బుచ్చుకొనియె నదిమొదలు పొదలుటలే కవ్వోటనాహారో పపాదనంబునకుంగాక వితాకుండనై మందు నాకఁటికి మిడికినడఁకి యునికిపొసం గక మఱియుమఱియు భిక్షాపాత్రంబునలగొనుచుండితి నట్టి నన్నుంగనుంగొని చూడాకర్ణుం డుపాలంభ గంభీరభాషితంబుల నిట్లనియె. 117

క. అతిరక్షితార్థమంతయు, నితరులపాలయ్యెఁ జెడుగు బెలుకా నీయు
ద్ధతిమాన వికవిడేమీ, గతవిభవులు సాధుతరులు గారా పుడమిన్. 118

క. ధనముడిగిన నుడుగదుని, తనుజనితంబైనదుర్మదము నేఁడనుచున్

గన లుబికిఁ గనికరంబఱి, తనపదిలినకోలచే నతఁడు నను వ్రేసెన్. 119

క. వ్రేసినవ్రేటు దురంత, త్రాసంబున నోహటించి తప్పించుకొనన్
కోపంబున న న్నాస, వ్యాసి నిరీక్షించి మఱియు నపు డిట్లనియెన్. 120

క. అర్థమునఁ బండితుండగు, నర్థమునం బలసమగ్రుఁడగు నర్థమునన్
బార్థివుఁడగుఁ బుణ్యుండగు, నర్థమునను భువనపూజ్యుఁడగు నరుఁ డెందున్. 121

గీ. అన్వవాయవృద్ధు లాచారవృద్ధులు, శౌర్యవృద్ధు లిద్ధసత్యవృద్ధు
లాగమార్థవృద్ధు లఖిలార్థవృద్ధులు కొలుతురర్థవృద్ధుఁ గోరి నేడు 122

చ. వినఁ డని రోయ రంధుఁడనిపేఁగరు తుందిలుఁడంచు గేలిఁ గాఁ
గొనరు వికర్ణుఁడంచుఁ దగఁగూయరు వామనుఁడంచుఁ బోరు దు
ర్జనుఁడనిపాయ రజ్ఞుఁడనియానరు నిష్ఠురరోగపీడితుం
డనరు కునిష్ఠుడంచుఁ జెడనాడరు భోగిను లర్థవంతునిన్ 123

చ. కనకముఁ గూర్చి యొన్నఁబడుఁ గాదె సమస్తగుణంబు లర్థమె
వ్వనికి వసుంధరం గలదు వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడె సకలార్థవిధిజ్ఞుఁడు వాఁడె వక్త వాఁ
డె నయపరుండు వాఁడె ప్రకటప్రియభాషణుఁడుం బ్రసిద్ధుఁడున్. 124

క. కలవానికిఁ జుట్టంబులు, గలరు హితుల్గలరు భటులు గల రఖిలంబున్
గలదు మఱి లేని చుట్టిది, కలవానికి నీడుజోడు గలదా జగతిన్. 125

క. చిట్టడుగులేనియిల్లును, జుట్టంబులులేనివాని శూన్యము శూన్యం
బెట్టనుదుర్జనహృదయము, కట్టా మదిసర్వశూన్యకము లేమిసుమీ 126

క. ధనహీనుఁ డధముఁ డల్పుఁడు, ధనహీనుఁడె మూర్ఖుఁ డప్రధానుఁడు ధర న
ద్ధనహీనుఁడు తలపెట్టిన, పని గ్రీష్మసరిజ్జలంబు పగిది నడంగున్. 127

వ. అని భిక్షుకుండు నన్నధిక్షేపించిన రోసి నివాసత్యాగంబు చేసినచ్చితి నిన్నుం
డాసితి. 128

క. త్రిదశవిమానారోహణ, మొదవిన నవమానధరణి నుండుట కష్టం
బదియెఱిఁగి నీతివిద్యా, విదుఁ డభిమానస్థలంబె వెదకుం బుద్ధిన్. 129

క. యమయాతన యనమాన, క్షమబాధ యొకండె దానిఁ గడచినవిద్యా
గమసౌఖ్యాగమవిత్తా, గమశూన్యంబైనపోటఁ గాదు వసింపన్. 130

క. పరదేశం బెఱుఁగక తను, గరగరిక న్విడువనుడువఁ గలిగి నడుమఁ జే
దరికము వాటిలి తిరియ, న్దిరిగిన ననుబోఁటి కమరునే యింతైనన్. 131

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగుపట్టెఁ గ్రిందు పడిరి బుధులు

హీనజాతిపురుషు లెచ్చిరి యాచింపఁ, బోవు టెట్లు కోటిభూమిపతుల. 132

శా. ఏల త్రుంచవతాన లేమయినలేవే యంచు బోధించునే
నాలంబెట్టఁగఁ జాల మాధవనృపుఁ డోహో నామహాసాహితీ
శాలంబు ల్సెవులాడసామ్ములు నొచ్చుంజచ్చుఁదత్కల్మషం
బేలా యంజలిచేసి మ్రొక్కెదఁ బదార్థచ్ఛాని శాచారికిన్ 133

క. అనుచితభాషణముఖరా, ననులము విటగాయకులము నటులము గాఢ
స్తనసంభరనమ్రవధూ, జనులము మమ్మేల రాజు సంభావించున్. 134

ఉ. కోరినగద్యపద్యముల గూరిచి యిచ్చెద నంటినేని ని
స్సారము లంచువిత్త మిడఁజాలక కేరడమాడులోభి యా
నేరుపు నేర్పుగాదు తన్నునిందలఁబెట్టు రసజ్ఞుఁడైనయుం
ర్వీరమణుండుగల్గినఁ గవిత్వము సర్వఫలంబు లీదొకో 135

చ. పలుకుపుశబ్దసద్గశతపత్రభవంబులు జాతిపద్ధముల్
బలుకడుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞ లనర్థకము ల్విచారముల్
వలవనిశీవివన్వుఁ బెఱవారి నెఱుంగక తిట్టికూళలే
పొలుపునఁదప్పులొప్పులనఁ బోదురొకో సుకవిప్రబంధముల్. 136

చ. మెఱసి బహుప్రసంగతను మెచ్చుటమెచ్చుట యొచ్చమంటి పా
పటిముటి నెన్ను టెన్నుట నిరక్షరకుక్షు లగోరశిక్షితుల్
కటుటులు భూరుహోక్ష్మపశుకల్పులు మత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁబోవనాడినను గల్గవు నాకుదిమోదఖేదముల్. 137

క. పరిహాసకులకు నటులకుఁ, దరుణులకును లంజెదారితమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం, బొరయింతురు రాజు లీరుపో సరసులకున్. 138

ఉ. ఏపున సంచితార్థము పరేంగితభావ మెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱయన్మఱచు న్నెఱదాత యిట్టిపో
దాపయిత్రుప్రభోధవశతం బొరఘుంచి యనంతరంబు సం
తాపమునొందునాఁ డధమదాత వృధాలపితంబులేటికిన్. 139

ఉ. దాతలుదాత లంద్రదియతథ్యము లోకమునందు లేఁడుపో
దాత యితండుగల్గినను దాతృతదాసకలార్థులంగు నే
లాతులతూఁగకుండు నచలస్థితి నింతయెఱింగి యే నహో
దాతబుణాను బంధముగదా యనిచిత్తమునందలంచెదన్. 110

క. తలపెత్తి మాటవెఱతురు, చిలవెలసై మాఱుపలుకవెఱతురు నెఱయం

జలియించి పఱతు రిస్సీ, కొలప గతులు గారె యాచకులు లోభులకున్. 141

క. చరణములు వడఁకు భీతిం, బరవశమానొడలు రాలుపడు నెలుఁ గాహా
మరణమున నెట్టి చిహ్నము, లరయ న్యాచకుఁడు దాల్చు నచ్చిహ్నములన్. 142

వ. అట్లగుటఁ జింతించి యాచకత్వంబునకుఁ జిత్తం బొడఁబాటుగాదు దారిద్ర్యం బునం బ్రజ్ఞాహైన్యంబు వాటిల్లుఁ బ్రజ్ఞారాహిత్యంబున సత్వక్షీణంబగు సత్వభ్రం శనంబునఁ దిరస్కృతివొడముఁ దిరస్కారణంబున నఖర్వనిర్వేదనం బావహిల్లు నిర్వేదనంబు శోకంబు దెచ్చు శోకంబు బుద్ధిబాధకంబగు బుద్ధినాశకారి కావున నిర్ధ నంబఖిలవిపదాస్పదంబని పలికి మఱియును. 143

చ. సముచితభాషణంబులకుఁ జాతురి సాలక యున్న మాన ను
త్తమము పరాంగనాగమనతత్పరుఁ డయ్యెడు దానికిం దొఁ పం
డమతము మేలు చాడికి నొడంబడియుండెడి కృత్తికన్నఁ జా
వుమిగుల లెస్స యాన్యవసువుల్గొనుకంటెను భిక్షమొప్పగున్. 144

క. దీపమునఁ దమము రోగ, వ్యాపృతిఁ జెలువంబు హరిహరాఖ్యానముచేఁ
బాపము వలె యాచ్ఞావిధి, వేపాయుగురుత్వ మతులవిజ్ఞాననిధీ 145

చ. అలఘులఘుత్వమూలమగు నర్థిత కంజలిఁ జేసి మ్రొక్కి వీ
డ్కొలిపి నృపాలురం గొలిచి కూర్చదభూరితరార్థమంచు నేఁ
దలఁచితి నేని పట్టియులఁ తంబడుటొక్కటి నిర్దయుల్ఖలు
ల్దులువలు హీనమర్త్యఫలదుల్ఫగవల్లభు లీరు వి త్తముల్. 146

క. తానీఁగోఁ ఱమాలినహా, హీననరాధిపుఁడు భాగ్యహీనుఁడను వ్స
న్నానార్హ్లసుఘటులవి, ద్యానిధులన్ హాలహాలాభమగు లోభమునన్. 147

వ. అట్లగుట రాజసంశ్రయంబును గూడదు ప్రేష్య భావంబు మృత్యుద్వారంబు రోగి యుఁ జిరప్రవాసియుఁ బరాన్నభోక్తయుఁ బరగృహశాయియు జీవన్మృతులని చెప్పి హిరణ్యకుండు వెండియు. 148

క. సంతుష్టిపర్ణసంగు, ప్రాంతఃకరణునకు వెఱచు నతిశయతృష్ణా
క్రాంతములు భీతిచింతా, సంతాపక్లేశగుజలసంపాదింపన్. 149

ఉ. వీతఖలీనమై యతులవేగమున న్మనగాలు ద్రొక్కు తృ
ష్ణాతురగంబు నెక్కి యలసస్థితిఁ జేట్పడకుండు వానికిం
జేతెడు నేల మేరుగిరి సింధువు వత్సపదంబు దూరతృ
ష్ణాతిమఁ దైనవానికి నిజాంకగతార్థము దవ్వు పెద్దయున్. 150

క. అశాశృంఖలఁ బడినా, నాశాభూములఁ జరించు నదిపో యసుఖ

శ్రీశోభితుఁడై నిలుచును, ధీశరధీ మనుజుఁడొక్క దివసమునఁదేనిన్. 151

క. పొట్టకుఁగా బట్టకుఁగాఁ, జెట్టాడుం దెలివిలేని జీవి నిజంబా
నొట్టపు శపథంబవుఁ దనుఁ, బుట్టించిన దేవుఁ డిమ్ముఁబో కల్పగతిన్. 152

క. కూరలు నారలు చాలవె, పూరింప న్నల్పమేల పొట్టకు మతి రో
సేరైనఁ గాలకే పన్నీరేటికి నింగిఁ గిలొక్కనిన చిచ్చారుపన్. 153

ఉ. ఊయెలమంచము ల్పసిఁడియుప్పరిగ ల్గపురంపువీడెము
ల్మాయనిపుట్టము ల్రుచిరమండనము ల్గడలేని ప్రోవ్విరు
ల్గాయనగాయనీమధురగానసుఖంబులు గన్నగాని నీ
పాయదె యన్నమాత్రమునఁ బస్తనుజీవికిఁ జక్రవర్తికిన్. 154

చ. ఒకరునికిమ్ము నిచ్చి తిరియు న్మతియొక్క తతిన్మహోగ్రుఁడై
యొకరునిఁ జంపుఁ జంపి పొలియు న్మతియొక్కనిచే బలాఢ్యుఁడై
యొకరునిఁ ద్రోయుఁ ద్రోచి మతియొక్కనిచేఁ బడు నేల నొద్ద నొం
డొకరునిఁ గొల్చు మానవుఁ డొహో సుఖసంపత్తి విపత్తివృత్తులన్. 155

వ. అట్లగుట మేలు గీల్పు దేహధారులకుపభోగ్యంబులు గదా యని తెలిసి మదింబదిలంబు సేసికొని యిచ్చటికి వచ్చితి వని హిరణ్యకుండు చెప్పిన మందరకుండతని నాలోకించి

క. నెలవునఁ బూజ్యంబులు నఖ, ములు దంతంబులు శిరోజములు గాలగతిన్
నెల వెడలియుఁ బూజ్యంబులు, పులిగోళ్లును దంతిదంతములు చామరముల్. 157

క. హరి పెంపుపడయుఁ గరి పెద్దరికముఁ గను సజ్జనుండు తగఁ బూజ్యుండౌ
నిర వెడలియు నిర వెడలినఁ, గరటము దెగుఁ గుజనుఁ డీల్గుఁ గడవను మృగముల్. 158

క. అరివిదళన పరుషుండగు, పురుషుండెచ్చోటనయినఁ బూజ్యుఁడు గాఁడే
ఖరనఖరవిజితకరిహరి, తిరముగ మృగరాజ్యమేలదే పెఱయడవిన్. 159

క. కదలని నీటికి మీనము, లెరుగక నెయ్యంబు దిఁ బాఱు నేటికిఁ బోలెం
బడవి నిరుద్యోగులఁ బొం, దదు సోద్యోగుల నకాని ధార్మికముఖ్యా. 160

క. తనపుణ్యపాపవశమునఁ, దనివిసనన్వచ్చు సంపదలు నాపదలున్
ఘనతకు నుబ్బక హీనత, కనుతాపం బందకుండునది సుజనునకున్. 161

క. శకటగతచక్రభంగి, న్సకరముల్తై తిరుగుచుండు సుఖదుఃఖము లిం
తకు ఖేద మంద నేటికి, నకటా సంతోషయుక్తుఁడగు టొప్పుఁగదా. 162

మ. సతతోత్సాహపరుం గ్రియానిపుణు భాస్వద్దీక్షుఁ బాత్రుం గృత
జ్ఞతము న్సత్యధురంధరు న్మధురభాషావేది సౌహార్దభా
సితు నారంభవిజృంభమాణుఁ గరుణాసింధు న్శుచి న్శాంతు ని

ర్జితకాముం దనుఁడా వరించు సిరి నిర్నిద్రానురాగంబునన్. 163

క. అవివేకి నలసు విగత, వ్యవసాయున్ హీనుఁ గుటిలవర్తను నఘముం
గువిచారుఁ జేర దిందిర, యువతీమణి వృద్ధుఁ గవయ నొల్లనిభంగిన్. 164

క. సరసప్రజ్ఞోత్సాహ, స్ఫురితుఁడ వీ వెచట నున్నఁ బూజ్యుఁడవు గుణా
కర మూషకకులశేఖర, యురగేంద్రుఁడుఁ గాను నిన్ను నుత్కర్షింపన్. 165

చ. అడఁగని లేమిఁ బొట్టువొఁ ఱలయ్యును ధీరుఁ డొకానొకప్పుడున్
విడిచి చరింపఁ డగ్రపదవిం గృపణుం డసమానసంపదం
బొడవయి యుండియుం దపయఁ బోఁ డది యెవ్వరికేది మార్గ మా
నడవడి వా రొకింత విడనాడరు గా గడతేరునంతకున్. 166

క. ధనవంతుఁడనని మదమున్, ధనహీనుఁడ నని విషణ్ణతం బొందవు హ
స్తనిహత హేలాకందుక, మనఁ బాతోత్పాతములు జనావళికగుటన్. 167

సీ. జలధరచ్ఛాయయు ఖలమైత్రియును నవసస్యంబు యువతియు జవ్వనంబు
సంచితార్థంబు నీచతాత్కాలభోగ్యము ల్గావున వలవంత గా దొకింత
తెలు పంచగమికి నెమ్ములకుఁ జిత్రితకీరములకుఁ బచ్చదనంబు గలిగె మొదల
నేవేల్పువలన నద్దేవుఁడు పోషకుఁడు సువ్వె మదినేల కుతిలపడఁగ

తే. జనుఁడు బ్రతుకు నూఱుసంవత్సరములంత, కాల మెవ్వఁడుండు మేలుతోడఁ
గౌతుకమునఁ గొంతకాలము చను మహా, కష్టవిష్టిఁ గొంతకాల మరుగు. 168

వ. దానతుల్య యగు విధియును సంతోషసమం బగు సుఖంబును శీలసదృశం బగు భూ
షణంబును నారోగ్యసదృశం బగు లాభంబును లేదు గదా ! యిమ్మాటలటుండె
మదీయ స్నేహంబునఁ గాలం బపనయింతురుగాక యని మంథరకుండు హిరణ్యకు
నాశ్వాసింపుచుండె నప్పుడు లఘుపతనకుండు. 169

క. శమితశోకమతాని, ర్గమనప్రమదంబు హృదయగతచింతాశ
ల్యముఁ బెఱికివైప నీమై, త్రిమనోజ్ఞవిశల్యకరణి ధృతినూహింపన్. 170

క. ధరలో సత్పురుషులు స,త్పురుషాపద్ధరణ హేతుభూతులు గారే
కరులు బ్బలిలోఁ జిక్కినఁ, గరులెత్తఁగఁ జాలియుండుఁ గాదే పుడమిన్. 171

క. నిధిసాధకుఁడు ఘనాంజన, విధినిక్షేపంబుఁ జూపువిధమున సుజనుం
డధికాపదార్తులకు హిత,మధురోక్తి నఖండసౌఖ్యమహిమ ఘటించున్. 172

మ. కరనీరేరుహామర్షిపాఁపఁ బ్రతిపక్షత్రస్తుఁడై వచ్చి కా
తరబుద్ధిన్ మనుజుండు మాటుసొర నాస్థన్నిస్తులార్థాభయా
చరణప్రక్రియలం గృపామతిఁ దదాశాభంగ వైముఖ్యముం

బొరయం గోరనివాఁడువో పురుషుఁడొ ప్పా ప్పానిఁ గీర్తింపగాన్. 173

చ. విలపసమృద్ధభూజముల వీవలుల న్విరుల న్మరందలి
ట్పలిపియుత్ప్రదేశమునఁ బత్తులు వారిమరాళమండలం
బెటువలె నాశ్రయించి బలమెవ్విధిఁ గైకొనుచేమ నిట్టివో
నటువలె నిన్నుఁ జేరి ముదమందెద మోకమఠాన్వయాగ్రణీ. 174

వ. అని లఘుపతనకుం డనేకప్రకారంబుల మందరకు నుత్కర్షింపుచుండె నాసమయం
బున. 175

మ. చకితస్వాంతముతో మహామహిరజశ్ఛన్నప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజనిర్వేదైకనిశ్వాసవీ
చికతో బప్పిరపోకతో నటుకుఁ గళ్పిల్లుబకక్షోభ మొం
డొకకాంతారమృగంబు భిన్నఖురటంకోదగ్ర మేతెంచినన్. 176

క. మాత్రినికిఁ బొఱియకు సలిల, స్థానమునకుఁ గాక వివరసజ్జలచరముల్
లో నెరసినభీతిఁ బసిం, దానిఁ గనుంగొని యథాయథముగాఁ బఱచెన్. 177

క. క్షితిజాతాగ్రస్థితలఘు,పతనకుఁ డద్దిక్కు లెల్లఁ బరికించి యుప
స్థితమైనది కించిద్భయ, మతిభయ మిచ్చోటఁ గలుగదని తెలుపుటయున్. 178

వ. హిరణ్యకమందరకులు బహిర్నిర్గమనం బొనర్చి వెగడుపడియున్న మృగంబు నూఱ
డించి యాతిథ్యం బొనరించి చిత్రాంగనుం డనునామం బిడి ముఖ్యసఖ్యంబున వల
రించి భీతికి హేతువెద్ది చెప్పుమని యడిగిన నది మృగయుత్రస్తంబని చెప్పె నమ్మ
వ్వురు నతం డొక్కరుండునుం గూడ నలువురై యన్యోన్యస్నేహవ్యామోహంబునఁ
గొంతకాలంబు గడపి రట నొక్కనాఁడు. 179

సీ. ఆహారవాంఛఁ జిత్రాంగదుం డడవికి బఱచి యొండొకకుంటఁ బడియచోట
నలఘుసధీవరయంత్రవాగురఁ దగుల్కొని భీతినంగము ల్వడఁక గోడు
గుడుచుచుఁ దోనీద్బుకొనుచు శుష్యద్గ్రీవమై వచ్చుచుండ నృత్యాగ్రవర్తి
యగుచు దూరమున వాయసనాథుఁ డచ్చేట్టఁ గని నుత్రిక్కరొటువంటికష్ట మొదవె
తే. నేమి సేయుదు ననుచు నహీనవేగ, కలన ఱెక్కల పటపటాత్కార మెసఁగ
నరిగి బాష్పనిరుద్ధాక్షుఁ డగుచు సఖునిఁ, గదిసి యిట్లనుఁ గంఠగాద్గద్య మడర.

మ. చెలికాఁడా పదబంధ మేవలనవచ్చెం జెప్పుమా నివ్వెఱం
గలఁగె న్మానసమున్న నాతఁడను బల్కుం దాల్మి లే దింతయుం
దెలియం జెప్పెదఁ దిష్టటం బ్రతుకుఁ గంటేఁ గ్రమ్మఱం బోయిన
ర్మలవ్యాధాము హిరణ్యకుం దిలిచి తెమ్మా బంధవిచ్ఛిత్తికిన్. 181

చ. తనుపఁ బ్రియంబరయెనిఁ జనుమా యన వాయస నిశ్చలత్వరం
జని నిరవద్యహృద్యగుణసారు హిరణ్యకుఁ జేరి చూచితే
చెనఁటివిధాతచేత మనుఁజిత్రమృగాగ్రణికృత్తివాగురా
భినిహతపాదుఁడయ్యె నినుఁ బిల్వఁగవచ్చితిఁ దత్ప్రశాంతికిన్ 182

క. వానిని మూషకపతి దుః, ఖానేకితహృదయుఁడై సఖా పోవలయుం
బోవలయు జాగుసేయక, వేవేగ న్నన్నుఁ జేర్పవే నీవచటన్. 183

వ. అనిపలికిన వతని మృదురీతిం గఱచుకొని చని వాయసకులవల్లభుండు నికటంబున నిలిచిన రుగ్ణునకు నౌషధంబును దృషితున కుదకంబును క్షుధార్తునకు మృష్టాన్నంబును నగాధజలపతితునకు నోడయును. దరిద్రునకు నిధానంబునుంబోలె నుపస్థితుం డైన హిరణ్యకుం జూచి చిత్రాంగకుం డిట్లనియె. 184

క. మృగయుభయంబునఁ జీకా, కగుచున్నది మది భుజంగమాకృతిఁ గాలం
దగిలినయురిగోలికి భయా, ర్తగచిత్రగ్రీవుఁబోలెఁ దగు ననుఁ బ్రోవన్. 185

క. మందరకుండును గరటపు, రందరుఁడును నేను నీపరామర్శ న్నే
లందెదమని తలపోయుదు, మందెక్కుడికంక నీదయకుఁ బాత్రంబుల్ 186

క. విచ్చలవిడి వాగురికుఁడు, వచ్చినఁ బ్రాణములమీఁద వచ్చును గృపనేఁ
డిచ్చెట్టు నూన్పు మనవుడు, నచ్చికితునిఁ జూచి మూషకాగ్రణి పలికెన్. 187

క. వెఱవకు వాగురదునియుం, గొఱుకుటయన నెంత నీతికోవిద నీకే
తెఱఁగున నీదుర్దశ దె, ప్పరమై చనుదెంచెఁ దేటపడఁ జెప్పవనా. 188

క. అనిన నిది నేఁడ కాదట, మునుగలదన నతనిఁ జూచి మూషకరాజో
యనఘా నీతొలుతటికథ, విన నిష్టంబయ్యెఁ దెలుపవే నాకనుడున్. 189

ఉ. తంగదుపాయపారగుహిరణ్యకుఁ గన్గొని యొప్పఁ బల్కెఁ జి
త్రాంగదుఁ డిత్తెఱంగుఁ దెలియ న్విను మాఱవమాస మేగుమం
డంగ సుగంధనై జననిడాఁపునఁ బర్వి యఖర్వపర్వత
ప్రాంగణశాద్వలస్థలుఁ బచ్చికమచ్చికమేయ నాయెడన్. 190

చ. తతమతకీర్తియాత్కలమునాఁ గటకంబునఁ బుష్కరుండు భా
స్కరములఁ దొక్కనాఁడు తెలిగన్నులయన్న లాయారమొప్పఁ జా
మరము లిడంగ దివ్యమణిమంటపమధ్యమృగేంద్రపీఠి నం
బురుహవిరోధి పూర్వగిరిఁబోలె రహిం గొలువుండె నుండఁగన్. 191

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁగిరాతుల్ నను వీక్షింపఁగా
నటకాలోన హుటాహుటిం బఱచి పచ్చాకుల్ దృషత్స్వానము

గ్రిటిదంష్ట్రీ గ్గిరిదంతము ల్సవరము ల్ఖడ్గ ల్మివాళ్ళంగముల్
చిటుకల్తైచిన ప్రౌగువాఱువములుం జేకానుక ల్సేయుదుర్. 192

గీ. మ్రొక్కి చేమోడ్చి మాయున్నచక్కిఁ జెప్పి, యెన్ని వాఁగులెన్ని యేనుగులెన్ని పందు
లెన్ని పులు లెన్ని దుప్పులెన్ని లెళ్లు, చెప్పఁజిత్రంబు వేఁట విచ్చేయుమటకు 193

సీ. కాసవెంట్రుకలబట్టి కూపెట్టసింగంబుఁ బట్టి తేకున్న నీబంటఁగాను
నెఱవారసిలసొమ్మసిలపైచి శరభంబుఁ బరిమార్పకున్న నీబంటఁగాను
గండ్రగొడ్డటన వక్త్రంబుఁ జించి గజంబుఁ బడఁద్రొక్కకున్న నీబంటఁగాను
గండభేరుండపక్షుల నెత్తుట భూతబలిఁ జల్లకున్న నీబంటఁగాను

తే. గబ్బిబెబ్బులిడాకాల ద్రొబ్బి విరియఁ, బ్రామి రూపార్పకున్న నీబంటగాను
లావిగవిఁ జొచ్చి యచ్ఛభల్లములగముల, బడలువాపకయున్న నీబంటఁగాను. 194

వ. అని మృగారాతు లక్కిరాతులు పంతంబులు పలికి మృగయావినోదంబునకు
మోదం బాపాదించినం బుష్కరుం డలరి వేటసన్నాహంబువీటఁ జాటించిన. 195

సీ. అడంగింపఁబో యిమ్మహాసారమేయంబు జముఁ డెక్కు కాసరస్వామి యైనఁ
గూల్చఁబో యమ్మహాసుగ్గురం బద్ధీశుముద్గులాయుము కాఁటి ముసలి యైనఁ
గఱచఁబో యిమ్మహాకౌలేయకము విష్వగ్రీవు పేరెకిరింతగిత్తి యైనఁ
బట్టఁబో యిమ్మహాధిపకంబు తోలుసంజ గన్నమానిసి వాల్మీకంబు నైన

తే. నవఁగఁబులిగాఁడు చిలుకుటమ్మ చ్చపచ్చి, మిరియమురి ద్రాడు కాత్రేఁడు మిఱుపుదీగ
పిడుగుకిలగూరగంపను పేళ్ళవలరు, నిడుదకుక్కల పట్టుపట్టెడలఁబట్టి. 196

గీ. పరుసుకరసానఁ దీటినపందిపోట్లు, భూరిభుజపీఠములయందుఁ బొందుపఱిచి
పరికరంబులఁ గొనుచు భూపాలునగరి, యేలుబడి వేంటకాండ్రు మున్నే చినడవ.

క. ఏలలఁ బాడుచుఁ దగ విలు, గోలలఁ గొని వల్లప్రజలు గుములై నడవ
న్నీలాంబరుఁడై విభుఁ డు, ద్వేలాశుకశావిరాజి తేజీ నెక్కెన్. 198

క. ఎక్కినఁ ద్రొక్కనిచోటులఁ, ద్రొక్కుచు గుఱ్ఱంబునడవ దూరము లగుమా
యిక్కలకు వచ్చె నరపతి, పక్కణవాస్తవ్యసమితిపథ మెఱిఁగింపన్. 199

తే. వచ్చి మాయున్నపొలమెల్ల వల్లెవైచి, చందమునఁ జుట్టుకొనినఁ బోసందులేక
చలితచరణంబులును బరాసన్నదృష్టి, గలిగియుండెతి మచటఁ గాకవులకరణి. 200

వ. అంత. 201

క. పవికల్పప్రదరంబున, నవనీపతి దుప్పిదుప్పురనఁ బడనేసెన్
నవలాఘవ మేర్పడఁ గా, రవబాధకు మొదలుగారె రాజులు దలఁపన్. 202

క. శిఖిఘుమశ్యామలములు, ప్రకరగరుద్విసరభాసురము లుద్యజ్జ్వ

ముఖరితములు రాజశిలీ, ముఖములు బహుపుండరీకముఖకుల ప్రాలెన్. 203

క. తాలుచెవ నుష్ణినో, దారగతు ల్నెఱపి గగనతలమున జవన
ద్భేరుండము లాస్యముల న,పారము గాఁ గొనియె రాజబాణఫలంబుల్. 204

క. తులలేని శైత్యములుఁ జెలు, బిలముల బురుడించు నొనలఁ బెరిగిన శరముల్
పొలములు లాతుంబులగశి, ములు మోవఁగఁ దుండషండములఁ బూరించెన్. 205

క. నిరవధిక దానవిద్యా, పరఘనుఁ డాఘనుఁడు దాత ప్రజ్ఞాని వసే
చరమృగచరజాంగకముల, శరధిపృషత్కముల సరభసంబునఁ గప్పెన్. 206

క. సమయించె ఖడ్గముల ఖడ్గములం గ్రూరాచ్ఛభల్లగణముల జగతీ
రమణుఁడు దుర్గాహవన, క్షమఁ గ్రూరతరాచ్ఛభల్లగణములఁ గప్పెన్. 207

వ. అయ్యాఖేటవనంబు శానితపక్షప్రకరంబు గావున యజనవాటంబును ధ్వనిప్రధానంబు గావున సుప్రబంధంబును భంగదుర్నిరీక్ష్యంబు గావున బయోనిధానంబును నఖండభర్మసంపన్నంబుగావున కృతయుగంబును నిగూఢబుశ్యశృంగంబు గావున విభాండకాశ్రమంబును శిధిలీకృతాచ్ఛభల్లంబుగావునఁ బ్రభగ్నసంగ్రామంబును గుంతీష్టవిహారయోగ్యంబు గావునఁ బాండురాజార్జనంబును నష్టసింహబలంబు గావున భీమసేనోత్సాహంబును నపాస్తసింధురాజంబు గావున ఫలితార్జునప్రతిజ్ఞయు నికుంచితపంచకంబు గావున రాజనగరంబును నిశ్చేష్టితగవయంబు గావునఁ గుంభకర్ణసంరంభంబును సప్రకాశితపుండరీకంబు గావున శిశిరకాలంబును ననుకరించె నప్పుడు. 208

క. పోలములు వెదకి పక్కణ, పాలురతిఱుమాటయుఁ దల్లి ప్రజ లుద్ధురజం
ఘాలురు గావునఁ బరచిరి, పోలేకం దగులుపడితిఁబో వారలకున్. 209

క. నను నంతఁ జిత్రవర్ణుఁడు, గనిఁ జంపక తెచ్చి పతికిఁ గైకానుకగా
నొనరించిరి శబరసుతు, ల్వను రాజవ్వేటమీఁద విరిగె న్దిరిగెన్. 210

వ. తిరిగి మహీమహిళాకటకం బగు కటకంబునకు నచ్చి రాజు యువరాజునకు నన్నిచ్చె నిచ్చిన నచ్చెలువుండు నన్నుఁ గన్నసందనుకంటె నగణ్యకారుణ్యంబున రక్షించె నట్లు కుక్షిద్రక్షితుండనై యుండి యంతఃపురంబున వాసగృహంబున యువరాజొక్కరుండు పవ్వళించియుండ నేనును దత్సమీపంబున నుండితి నయ్యర్ధరాత్రంబున. 211

క. ప్రతిగర్జత్కేసరియై, యతికంపజ్జంతు హృదయమై నిర్భిన్న
శ్రుతిహృత్పుటమై విద్యు, ద్ద్యుతివాంతధ్వాంత మగుచు నొకయుఱుము మాతిపెన్.

మ. తనకర్ణంబుల కంతయాఘననినాదం బూర్జితామోదకం
బౌనరింప స్సుఖసుప్తి వానతటి యయ్యోగ్యపత్వతాధిత్యకా

ఖగుల ననవద్యవృత్తులం గులప్రభులతో వర్తింతుఁగా యింక శా
ప్ప నిరుద్ధాత్ముఁడనై ఖగా మనుజభాషం బల్కితిం బల్కినన్. 213

చ. విని యువరాజు త్రాసరసవిహ్వలుఁడై సదనంబు నర్దెస
ల్గనుఁగొని యేమ యీమృగము కాని యొరు ల్విహరింప రింకుఁ జె
ప్పను వినఁగూడు నే మనుజభాషల నిప్పుడు నద్భుతధ్వనిం
బనిపడి మ్రోసె వేగ తెలుపందగునీ తెఱఁ గెల్లవారికిన్. 214

క. అనితనువు వేఁగ వేగినఁ, దన కాపుష్కరనరేశుతమ్ముఁడు నెమ్మిం
గనుఁగూర్కి వెఱచి యొకలా, గున నంతయు దైవచింతనుల కెఱిఁగించెన్. 215

క. ఎఱిఁగించి మృగము లెక్కడ, తరి నేతన్మనుజభాషితము లెక్కడ నే
తెఱఁగో యేయుత్పాతమొ, వెఱఁగయ్యెడు ననిన నవ్వి విద్వత్సింహుల్. 216

క. యువరాజుఁ జూచి ధరణీ, ధవనందన యేలవెఱచెదవు మృగజాతుల్
పవలూరకుండి నిశనవ, నవభంగి మ్మనుజభాషణంబులఁ బలుకున్. 217

క. నరసంచారవిహీనో, ర్వర ననిచెప్పుటయు భయము వదలి నృపాలా
వరజుఁడు నను విడిపించెను, గరుణాపరుఁడై దురంతకాంతారములన్. 218

క. ఇది నాకు నేఁడకాద, న్మొదలం గలదనుమఁ డెల్లముగ మృగము జగ
ద్విదితుఁ డగునెయ్యునకు నా, ర్తదశం దడిలేనినోరఁ దనకథఁ జెప్పెన్. 219

క. అతివేలచింత నంతట, నెతమదిలో నెరసి సరసి వెలువడి మంద
స్థితి చాయఁ జూచుకొని య, ప్రతిమదయాశరధి మందసకుఁ డేతెంచెన్. 220

క. ఏతెంచిన భీతి విని, ఖ్యాతహితం ధృతినగంబు వ్రయ్యలుగాఁ జిం
తాతంతుబద్ధమానసుఁ,డై తత్తర మెసఁగ మూషకాగ్రణి పలికెన్. 221

చ. అరయ నుపాయపారగుఁడ వయ్యు నయోదధివయ్యు సంతత
స్థిరమతివయ్యుఁ గానిపనిఁ జేసితి వస్మసఖా మృగంబు ని
క్కరటము నేను సెప్పటికిఁ గాల్గలవారము చిక్కి మేరికి
ట్లురుగతి నీకులే దిచటికుద్ధురుఁడా మృగయుండు వచ్చినన్. 222

చ. అతివిశాలాత్ముఁడైనసఖునందును బెంపొనరింమధారుణీ
పతివరునందు భూరిగుణబంధుర మైనకళత్రమందు న
న్నతనయతత్వశాలి యగునంతనునందు మనంబు సొన్పి యా
గతబహుదుఃఖము ల్దొఱఁగుఁగాదె విచారధురీణుఁ డుర్వరన్. 223

చ. అనునెడ వేఁటకాఁ డదయుఁ డప్పు డుపస్థితుఁడై నదైన్యమా
ననమున నొంగులెత్తి మృగనాథుఁడు బెగ్గిలినన్ హిరణ్యకుం

దనువయావాక్యము లెస్సయని నాతఁడు మంత్రిపరీతవాగురం
దునియలు సేసి మందరకు దూతి యథాయథలయ్యె నయ్యెడన్. 224

క. జలచరుఁడు గనవరత్వర, నిలబోవం జేవలేక యెప్పటిపోని
ర్గళితగమనేచ్ఛఁ గచ్ఛప, కులనాథుఁడు శిరము ముడుచుకొని యుండుటయున్.

క. సరిసురికిఁ బాపి గాఢ, త్వరఁబఱచినమృగముఁ జూచి దారుణచింతా
పరితప్తుఁ డగుచు మృతయుఁడు మరుగుచు నచ్చో ముహూర్తమాత్రము నిలిచెన్.

వ. అట్లుండి మందర మందరకుం గాంచి పట్టుకొని త్రాటంగట్టుకొని వింటికొప్పునం బెట్టుకొని విన్ననైన మొగంబునం దిరిగి యరుగుచుండె నప్పుడు హిరణ్యక లఘుపతనక చిత్రాంగదు లంతంత ననుసరించి చనుచుండి రందుందురు పురందరుండు తనలోన. 227

ఆ. అంబురాశిపారమైనను గనవచ్చు, నిశ్చయింపవచ్చు నింగిపొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ బలునంగనగు సుహృ, ద్వరహ మింతయనుచుఁ దెలియరాదు.

తే. అదియు మవ్యక్త మది నిజప్రాణతుల్య, మదియు నిర్వాచ్య మట్లుగాదయ్యె నేని
జననిపై భార్యపైఁ దనూజన్ములపయిఁ గలిమిపై మైత్రిపైఁ బోలెఁ గలదె మమత.

సీ. కర్మచేష్టితములు గాలాంతరావర్తితము లగుమేలుగీ శ్శమరు నైనఁ
గనుఁగొంటి మరిసమాగమవియోగములేల చెనఁటివిధాత సృజించె మొదలఁ
బృథులశోకారాతిభీతిఘాతిప్రమోదసంపాదిప్రీతివిస్రంభభాజ
నము మతిరెండక్షరములఁ బూర్ణంబైనమిత్రశబ్దము మేర మెఱసి విడిసి

తే. యెట్లునిలువఁగూడు నెబ్భంగి రుచియించుఁ, గూడు కంటికెట్లు గూర్కువచ్చు
నని హిరణ్యకుండు దనలోన దుఃఖించి యపుడు పలికె వాయసాధిపతికి. 230

క. ఈయధముఁ డెంతదూరము, పోయెడునో యెంతదవ్వు పోదము సర్వో
పాయములఁ గావలోపల, నీయెడ విడిపించుకొంద మిమ్మందరకున్. 231

క. నావిని లఘుపతనకుఁడును, లావుపసం బోర నలఁతులము మందరకుం
డేవడువున విడివడు నీ, చేపనికి దిక్కు చెప్పవే వెరవనినన్. 232

సీ. అశ్రుమిశ్రితనేత్రుఁ డైనహిరణ్యకుఁ డనియె నిప్పాపాత్ముఁ డరుగుత్రోవఁ
గలదు చెందామరకొలను దత్తటమున మృగముఖ్య చచ్చినపగిది నుండు
నేమించి యాదల నిలిచి లోఁజెవులను ముకుగోళ్ళఁ బొడుచున ట్లొకట గన్నుఁ
గ్రుడ్లూడ్చి మెసవులాగున నుండు ముండినాపూఁట కచ్ఛపనాథుఁ బ్రోవ

తే. వేగఁ గేడించి యన్నిచు వెనుకఁజేసి, యరుగుమవ్వక్కఁ కనికూర్చి చనుచుటయును
ఖగమృగాధ్యక్షు లరిగి రాఘనులపజ్జ, నంత నంతట దానును నరుగుచుండె. 233

సీ. చిత్రాంగదుండు చచ్చినవానిగతిఁ బురస్సరణసతస్త్రీధరణినుండె

వానిమస్తకమున వ్రాలి వాయసకులాగ్రణి కనుగ్రుడ్డులు గలిచి పెలికి
కొని తినువానిలాగునఁ గావుకావున నఱచుచు మొఱయించునంతలోన
వరుగుచున్నకిరాతుఁ డగ్రభాగమునఁ జిత్రాంగుఁ గని మేనుపొంగ మరల

తే. కలిగెఁ దక తేర నేతన్మృగం బనుచును, మందరకు డించి కాకి బల్మిని నదల్చి
కొనుచుఁ జనుచోట మూషకకులవిభుండు, కూర్మవల్లభుబంధముల్ గొరికెఁ బైచె. 234

క. కొరికిన మందరకుఁడు దా, త్వరపుపడిం బఱచి సరసిఁ బడె మూషకరా
జారికి మృగవాయసంబులు, తెరఁగొప్పఁగఁ జేచి రెండుదిక్కుల కరిగెన్. 235

తే. అట్లు విఫలప్రయత్నుఁడై యడవిఁ బాసి, విన్నఁబాటునఁ జనియెను వేఁటకాఁడు
కమఠమూషకమృగమహాకరటవిభులు, గాఢతరమైత్రిఁ బొదలి రత్యంతనందు.

వ. సుహృల్లాభంబున సాధింపరాని కార్యంబులు గలవే యని సుదర్శనకుమారులకు విష్ణు
శర్మం డెఱింగించె నెఱింగించిన. 237

క. విని రాజకుమారకు లన, ఘు నయాంశవిలాసదివిజగురు నిజగురునిన్
గని మూఁడవతంత్రము పా, యనిధీ మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 238

మ. అతికారుణ్యకటాక్షసర్వభువనైకాధ్యక్షరాధాసుత
ప్రతిపక్షప్రియచర్యకల్పకనిశారాడ్ధుర్యచక్రత్రిశూ
లతిరోభూతిరవిప్రభూతశుభలీలాపూతరూఢాంధకా
హితతేజోవిభవప్రచారణదయావ్యాప్తస్ఫురద్వారణా. 239

క. మాయాతీతమహాశిత, కాయభటీకృతమరున్నికాయతపస్వి
ధ్యేయ నిజభక్తరక్షో, పాయ విభూతిప్రధానపాండిత్యనిధీ. 240

మాలిని. నిరుపమితమహత్త్వా నిశ్చలానందతత్త్వా, నిరతసుఖితలోకా నిత్యపుణ్యావలోకా
గరుడవృషపతాకా ఖండితానన్యశోకా, మరణజననదూరా మానిచేతోవిహారా.

గద్యము. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసు
కవిప్రశంసాభాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గప
రిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయ
ప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతం
బైన పంచతంత్రంబునందు సుహృల్లాభం బన్నది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీ రస్తు.

# పంచతంత్రము.

## తృతీయాశ్వాసము.



మద్వ్యాఘ్రపాకపాయీ
రామాసాపత్న్యరోషరసకృత్వరతో
భూమకుటిన్యోమధునీ
వ్యామిశ్రకటాక్షవీక్షహరిహరనాథా. 1

వ దేవా సంధివిగ్రహాభిధాన తృతీయతంత్రం బాకర్ణింపు మధీతనీతిశాస్త్రమార్గుం డగు విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. ఆకడ వీరుం డగున, స్తోకప్రతిపక్షుఁ బెనిచి తుది రాజాచేదుం
గాకంబుఁ జేర్చుకొని నుత, లోకబలోద్రేక మొకయులూకము చెడదే. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రుని జూచి చిత్రమది చెపుమా భూ
దేవకులోత్తమ మాకును, దావహముగ ననినవారి కతఁ డిట్లనియెన్. 4

చ మధురనభోమణిద్యుతిసమంచితరత్నవిరాజమానధా
మధురవిలాసినీశ్రవణమంగళరాగపదీరితేక్షుహ్రా
స్మధురదురంతసంప దభిమానతృణీకృతరాజరాజది
జ్మధురచెలంగుఁ బాండ్యమహిమండలిఁ దన్నికటాయతాటవిన్. 5

చ ఫలరుచివిద్యుదర్చిఁ దెలుపం బలిభుగ్రుతు లుగ్రగర్జలై
రొలయఁగ బెల్లుగా డిగినయూడలు పుష్కరవర్షధారలై
నిలువఁగ వార్షికాభ్రసరణిం గగనస్థలచుంబియై దళ
ద్దళములకల్మిఁ గాఱ్కొనుదగ్రవటం బొకఁడొప్పు నన్నటిన్. 6

చ. నటన ననేకకాకప్రతతు ల్ప్రతివాసరము న్భజింప న
వ్వటమున మేఘవర్ణుఁ డనువాయసవల్లభుఁడుండు వాని కు
త్కటభయకంపనంబు లెసఁగ న్నికటప్రకటాటవీకుటీ
ఘటమునఘూకసేన గొలువం బెనుగూబయొకండు నెప్పుడున్. 7

ఉ. ఆయరిమర్దనుండు మది వచ్చలమిచ్చఁ గృతాంతవాలభూ
లాయుధకంఠఘోర తిమిరాకులమౌ నొకనాఁటిచీఁకటిం
బాయనిఘూకసేనఁ బనుపం బెనుపొందినమత్తి కేడ్తెఱం
బోయి యజాగరూకబలిభుక్పటలిం బరిమార్చి పోయినన్. 8

క. ఆచెంతఁ గరటవిభుఁ డొక, కోటరగర్భమున నణఁగికొని యుండుట నా
చేటొదవదయ్యె వానికి, నాఁటికి వదపోయె మఱుసు నాఁ డుదయమునన్. 9

వ. హతశేషానుజీవకోటిం గూడుకొని యతనిమంత్రు లుద్దీపియు సందీపియుఁ బ్రదీపియు నాదీపియుఁ జిరజీవియు నను నా రేవురుం గలసి రంత నందఱుం గలయం గనుంగొని మేఘవర్ణుం డిట్లనియె. 10

ఉ. మ్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి ఘూకముల్
గాకముల న్వధించె నిది కక్కసపుంబని నిర్వహించు కై
ట్లెక్కడ నీతికార్యపరు లిందఱు పోలినభంగిఁ జెప్పుఁడా
నా కిపుడంచు రాజడిగిన న్వినయాన్వితిసంగచిత్తుఁడై. 11

వ. ఉద్దీపి యిట్లనియె. 12

క. ఈదృశబలవంతులతోఁ, వాదుకుం దించి బ్రతుకనచ్చునె యెందేఁ
బోద మఱత్తుల కిది మర్యాద వృథా పొలిసిపోవ నగు ఘనమేమీ. 13

క. అనువచనంబులు వాయస, జనపతి విని యానతిచ్చె సందీపికి నీ
వును నొక కార్యముఁ జెపుమా, యను డాతఁడు విహితహృదయుఁడై పతి కొగ్గై.

క. ఇది యొకపక్షమ్మున మం,చిది యగు నగుఁగాక యేమి చిరవిక్రమసం
పద గలరాజాన కుచితమె, సదనత్యాగంబు మానుషమ్యుతి గాదే. 15

క. స్థానంబు సకలఫలసం,ధానం బొనరించుఁ బతికిఁ దగనజకంఠ
స్థాన స్తనమిదునె యథా, స్థాన స్తనభంగి మధురతరదుగ్ధంబుల్. 16

క. చేఁగలభూమిపతు లటు, గావునఁ గోదరు విదేశగమనము దేవా
నీవెఱుఁగనికార్యములుం, ద్రోవలు మఱియెవ్వరెఱుఁగుదురు లోకమునన్. 17

వ. అనుమాటలు విని రాజు ప్రదీపి నాలోకించి తోఁచినకార్యంబుఁ జెప్పుమని యడిగిన నతండు. 18

చ. తడయక బాలవృద్ధవనితాజనతాదులవైరికోటికిం
గడువడిఁ జంపు మంచునిదుకంటె నయంబున సంధిసేయు టే
ర్పడ నుచితంబు వైరుల నపాయబలాఢ్యులు రాత్రిచారు లె
య్యెడఁ దగదీరసంబు బలహీనులకు న్వనబోటివారికిన్. 19

క. ఈవాలుపచ్చి శేవం, జావంగా నున్న వారిఁ జంపెద రహితుల్
దేవా సంధి యనూనకు, భావహ మొనరింపు మస్మదాదేశమునన్. 20

వ. అనుభాషితంబు లాకర్ణించి యధిపతి యాదీపి నడిగిన నతం డతని కభిముఖుండై 21

క. సంధికిఁ జను టెట్లరులు ది,వాంధులు బలదుర్నిరీక్ష్యులయ్యును దుస్సం
బంధ మిది గాదె మనము ని, శాంధుల మెట్లమరు దూతకరుగం దిరుగన్. 22

క. అటుగనుక సంధికార్యం, బెటువలె నొడఁగూడు రాత్రు లెదిరికి నెల వి
ప్పటికి మనకదను పగలు, తట్టటగతిఁ జని సంహరింపుదము పగవారిన్. 23

వ. అని యుద్దీపి ప్రదీపి సందీపి యాదీపులు తమకుఁ దోఁచినట్లు చెప్పిన విని మేఘ
వర్ణుండు చిరజీవి నాలోకించి 24

క. ఈతం డితఁ డితఁ డీతఁడు, చేతోగతిఁ దోఁచినట్లు చెప్పిరి పథ్యం
బై తోఁపదు కించిత్తుం, దాతా నీవేమి చెప్పెదవు నాతోడన్. 25

క. నీసద్బుద్ధిబలంబునఁ, జేసెద రాజ్యంబు నేఁ డకేయదివాంధ
త్రాస ముదయించె నీకిది, పోసమయము ప్రాప్తకాల ముపదేశింపన్. 26

క. హరిపరిణామమునకు ని, ర్భరనీతిపరుండు గురుఁడు బలె నాభద్రం
బరయుటకు నీవెకా కెవ్వరు నాఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 27

క. అంఘునయవిన మనిధు లీ, నలువురు విన్నపముఁ జేసినా రిమ్మతిమం
తులకంటెఁ గార్యనిశ్చయ, బలమున నధికుఁడని యంతపాండితిగలదే. 28

ఆ. వీరు నీకుఁ బరమవిశ్వాసఘటకులు, వీరినీతిరీతి వినుట యొప్పు
నైన నాకుఁ దోఁచినంతయు వినుపింతు, నేకతంబువలయు నింతదడవు. 29

క. హితుఁడని యొకనికిఁ జెప్పిన, నతఁడును దనకూర్చుసఖుని కది దెలుపు నర
క్షితమై నృపమంత్రం బీ,గతిఁ బలువురు వినుటచే విఘాతతనొందున్. 30

క. అతిగుప్తమయ్యు మంత్రము, హితనికర శ్రుతముచేత నివురంబడు ని
క్కాత యొడిఁగి ప్రాంతిజనసం, గతి రాజు రహస్య మొసఁగి కావఁగవలయున్.

వ. అని యేకాంతంబు వడసి చిరంజీవి మేఘవర్ణునకు సంధివిగ్రహయానాసనద్వైధీభావ
సమాశ్రయంబు లను గుణంబులం బ్రారంభోపాయపురుషద్రవ్యసంపద్దేశకాలవిభాగ
వినిపాతప్రతీకారంబు లనువంగంబుల సామదానభేదదండోపాయంబు లనుచతు
రుపాయంబులఁ బ్రభుమంత్రోత్సాహశక్తుల విచారించి యం దుచితం బగుదాని
నంగీకరింపుము నాకుఁ దోఁచినకార్యం బొక్కటి ప్రతిఘటులు లుదగ్రసత్త్వద
ర్పులు మనకు సమరసామర్థ్యంబు చాలదు దేశకాలంబులు విచార్యరమణీయంబులు

క. మీనోదపునంతకుం జనఁ, గానక బకముండుకరణి ఘనసీతిధనుం

దైవయుతఁ బూరకుండుం, దానహితుఁడు చిక్కువడినదను కతిశాంతిక౯. 33

క. తనసత్త్వ మెదిరిసత్త్వముఁ, గనుఁగొన కెవ్వాఁ డభవ్యగర్వమునం బో
రునకుఁ దుదఁ గాలు ద్రవ్వ, న్వాఁడు మమ్మక్కురునిఁబొందు విపదోఘంబుల్. 34

చ. సురియకరంబునం గొనక శూరుఁడు నీతి కళావిలాసభా
సురుఁడు వధించువైరి విరసుం దవుదవ్వులఁ జెంతనుండియు౯
సురియ ధరించియు న్మగువచొప్పున నేమియుఁ జేయలేఁడు త
న్నెరలఁగఁ జేయుమానవనికృష్టుఁడు మాటలు వేయునేటికి౯. 35

క. తాలిమియు ధృతియుఁ బ్రజ్ఞా, శీలతయుఁ బరాత్మగుణ విశేషజ్ఞతయుం
గాలోచితశౌర్యము గల వాలుమగం డేలు వార్ధివలితధరిత్రి౯. 36

క. సిరిపొందును పాయకళా, పరిణతుఁ దనుఁ దానపాయపారగుసభయుం
బరుసోక్తిఁ జేరరాదిం, దిరకేలం గురులఁ బట్టి తివిచినయివల౯. 37

క. గృహపేటినుండుమంత్రో, త్సహనాధ్యునకు న్రమాభుజంగినుమంత్ర
గ్రహణవిమూఢున కది గు, స్సహభీతి ననారతంబు సంపాదించు౯. 38

క. మతిమంతుఁడు శాంతుఁడు వి, శ్రుతగుణసంసిద్ధుఁడు న్విశుద్ధుఁడు నీతి
ప్రతిరహితుఁడు బలసహితుఁడు, గతభయుఁ డనఘుండుఁ గార్యఘటకులుసుమ్మీ.

వ. విశేషించి యిట్లు చెప్పవలసి చెప్పితిఁ గాని యుద్ధ మెప్పటికి నకరణీయంబు. 40

సీ. కోశమంత్రములు దక్కువలు గాకుండినఁ గలుగు లెక్కలకు నగ్గలము బలము
శాంతులు నిర్మలస్వాంతులు విక్రమోదయులు నిర్భయులును ధర్మమయులు
కఠినశాత్రవుని సాగావిత్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెపుడుఁ
బ్రభుతసహాయనిబంధనం బనిచెప్ప విందుము నీవును వింటివట్లు

తే. కులము గుణము రూపు చెలువంబు మురిపంబు, మానధర్మవిక్రమక్రమముల
వాసిఁ జూడ దబ్జవాసిని నిరపాయ, శూరసంగ్రహంబుఁ జూచినట్లు. 41

క. ఏరీతి జైత్రయాత్రా, ప్రారంభము సెల్లుఁ బతికిఁ బ్రజలేమి నధి
క్కారత గూడునె పత్త్రికి, భూతిబలాఢ్యత్తుపక్షములు లేకున్న౯. 42

క. ఘోరారివీరపారా, వారం బెవ్వాట దాఁటవచ్చు సహాయా
ధారతతి తారుఁ గోరక, పౌరుషసంపన్నుఁ డగునృపాలాగ్రణికి౯. 43

క. ఘనమంత్రసహాయంబుల, నొవరినభూవిభునకన్నియును గల వట్ల
య్యును సమరమకరణీయము, చవనేరదు సంధి సహజశత్రుల మగుట౯. 44

వ. ఘూకంబులకుఁ గాకంబులకు సహజవైరానుబంధంబునన కాదె వాక్పారుష్యం బెవ్వ
రికిఁ జేటుఁజేయదు. 45

క. భీషణశార్దూలతనూ, జేషము దన కమర దాల్చి విశ్రుతసస్యా
శ్వేషణతత్పరమతివా, గ్ద్రోషంబున నొక్క ఖరము గ్రుంగెను బుడమిన్. 46

క. వానిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము దేటపడఁ జెప్పు, మా వినియెద ననిన నతనికతఁ డిట్లనియెన్. 47

క. ఒకపురి నొకచాకలవాఁ, డొకదిక్కున నొకనిచేత నొక గాడిదె వి
ల్వకుఁ బుచ్చుకొనియెఁ జోర, ప్రకరపటీభృతికి మేనుబట్టువై యునికిన్ 48

క. వలువలు చలువలుసేసెను, నెలపువఁ బగలెల్ల నిలిపి నిశియగుటయు న
ప్పులుగాకి చాకి పెనుగ్రో, ల్పులిచర్మము గప్పి సస్యముల కగవిడుచున్ 49

క. అది కడుపుకోలదియును దిని, సదనమునకు మగిడివచ్చు సరిప్రొద్దున ని
ట్లద నరసి యరుగఁ దిరుగం, బొది చెడియెం జైరగొన్ని పూఁటలుచనియెన్ 50

క. పొల మరయుకర్షకులు మదిఁ, బులిగాఁ దలపోసి భీతిఁ బులిపులి యనుచున్
దలసొంపువిడిల రందొక, హాలికుఁడు శరచాపహస్తుఁడయి నిశ్శంకన్. 51

క. నెలవొడిచినధూసరరుచిఁ, గలగొంగడిముసుఁగుఁ దిగిచి కడువడిఁ దనయి
ల్వెలువడి చని కని తనమం, గలబొంచినవానిఁ జెండి గాడిదె యనుచున్ 52

క. మెండుగ నుత్థాపించిన, దండము గమనమున కొగ్గుఁదలఁపఁగ వీనుల్
బెండువడ నొండ్రపెట్టుచు, దుండగపుఖురంబు దన కెదుర్పఁగ తేరన్ 53

క. హాలికుఁడు నీవా యనుచుం, జలివిడిచి ప్రహాస మెసఁగ శయములఁ గాల్గం
బిలపిల నెదురుగఁ బఱచిన, నలగాడిదెయుం గువాళివతితీవచ్చెన్ 54

వ. వచ్చిన. 55

క. తగిలి తనపైరు మేసిన, పగ యగ్గలమగుటఁ గినిసి పటుముష్టిని వి
ర్దిగిచి ఘనతరశరంబునఁ, దెగనేసిన గార్దభంబు ద్రెళ్ళెం బుడమిన్. 56

ఇది వాగ్దోషఫలంబని చెండితయు. 57

క. అనిచెప్పిన చిరజీవిం, గని వాయసరాజు వలికెఁ గౌశికములకున్
మనకు న్బగ వాగ్దోషం, బునఁ బొటిలె నంటి విదిచెప్పుము వినవలతున్ 58

వ. అనినఁ జిరంజీవి మేఘవర్ణున కిట్లనియె. 59

చ. అపరిమితానురాగములయ న్వలయాద్రిపరీతభూపతి
త్రిపటలిమంత్రకూట మొనరించి మదాంధదివాంధము న్మహా
కుపితముఁ బక్షిరాజ్యమునకుం బతిగా నొనరింపఁ బూనియు
న్నపు డొకవృద్ధకాక మటకై యరుదెంచినఁ బుల్గులన్నియున్. 60

క. వెడవెడ నొండొకకొండొక, తడవు విచారించి సమతఁ దమలోననియెన్

జెడకేది బహుకాలంబులు, గడపినయతిగాన యుచితగతి నిటేఁగించుట. 61

వ. కార్యాలోచనంబున నిండఱు మనశుద్ధులము కార్యనిర్ణయసమర్థం బగుదీని నడిగి చూతమే యనుచు నాతిథ్యం బాచరించి పరిశోధించి తదభిప్రాయంబుఁ జెప్పిన నప్పక్షులకు వాయసాధ్యక్షుం డిట్లనియె 62

సీ. కర్ణహృత్పుటమూచికాయమానోత్తానవికటఘోషము విన్న వెగటుగాదె
కాలకాకోదరోగ్రస్ఫుటాస్ఫుటముఖం బాలోకనముసేయ నలుకుగాదె
భ్రమదుల్ముకభ్రాంతిభాగవీక్షణదృష్టిసరణిఁ ద్రిప్పుచుండ జాలిగాదె
కర్కశన్యాయామగరుడమంగళమరుత్ప్రీతితిసోఁకినఁ బీడవట్టుకొనదె

తే. దారుణాకార మప్రియదర్శనంబు, ప్రకృతిరౌద్రంబు క్షుద్రం బపత్యమంబు
ఘూక మేయూరు పికశారికాకలాప, కీరికాముఖధరణి మేయూరుచెప్పుఁడ. 63

క. దారుణదృష్టివికారా, కార మతిక్రూర మహముఁ గానదు కరుణా
దూరం బెట్లయ్యెడు రక్షారంభం బెఱుఁగఁ జెప్పుఁడా వినవలతున్. 64

క. వ్యపదేశక్రియ మెఱసిన, నృపు నింపెసలార నాశ్రయించినఁ గలుగున్
విపులసుఖ మమృతకిరణ, వ్యపదేశతఁ గుశలమంద దాశశ మడవిన్. 65

క. అనుకాకమునకుఁ బులుఁగులు వినయంబునఁ బలికెఁ దెలుపవే శశకం బ
వ్వనజరిపుని వ్యపదేశం, బున భద్రముఁ గనుట గరటముఖ్యా మాకున్. 66

వ. అని యడిగిన వాయసపుంగవం బవ్విహంగంబులకు నిట్లని చెప్పందొడంగె. 67

మ. అగశృంగోద్భరతీక్ష్ణభాస్వదభిషువ్యాఘాతపాతక్షర
న్మృగ మస్తక్షతజంబు పశ్చిమదుదగ్రద్ధత్రిధామజ్వల
న్నగ మంతర్జలనిర్ఝరంబు మృగతృష్ణావాహినీ సంచితా
ధ్వగ ముష్ణాగమమయ్యెఁ దొల్లి పురజిత్ప్రాలంబకాభీలమై. 68

వ. అక్కాలంబున. 69

చ. జలధరము ల్ధరాస్థలికి జాఱినన ల్దిననాథరశ్మికిన్
దోలఁగ కహో బయల్తెఱవెనో తిమిరంబులు నాఁగ జంగమా
శ్ములగతి గండకంపితగిరు ల్దరులారయ లెక్కకెక్కుఁడై
యలఘుమృగేంద్రభీతిరహితాటవిలో విహరించు నేర్పడన్. 70

క. ఏకసరోవర మగుదల, భీకరగహనమున నిలువ బెగడి పిపాసా
వ్యాకులితమానసము లపు, డాకరు లిట్లనియె యూధపాధ్యక్షునకున్. 71

క. ఇచ్చోటిసరము శరముల్, నిచ్చలుఁగొన నివిరె మేఁపునీళ్ళకరయో ని
ష్పచ్చరమై యొకవీథి మన, వచ్చు నవారిఁ గ్రవారిఖలె మాకున్. 72

క. అపాతాళగభీరమ, రూపూర్ణమహాప్రవాహమైనదు గూపా
రాపరిమితసరమైనం, జా పుము విఱువఁగ పోవఁ జొచ్చెం దనువుల్. 73

వ. అని పదనోదకంబులఁ జాపి విన్ననయి యున్న వన్నిచదళపళావల్లభుం డరసి నిమిషంబునం దడయక యప్పటికి సత్వక్షీణంబులు గానివానిఁ గొన్నిగజంబులం బిలిచి యనుజీవులారా యప్రతిహతమనోరథంబుల గహనఘంటాపథంబులం బఱచి యగాధశరం బగుసరంబుఁ గనుంగొని రండు పొండని నియోగించిన. 74

సీ. మదవనేచరవధూమధురగానధ్వానవివశకుంజక్రోడవిషధరములు
పరిపక్వఫలవిలుబ్ధస్తబ్ధరోమ దంష్ట్రాటంకభిన్నగోత్రారుహములు
ధరచరత్ప్రవనబాంధవదవ వ్యాపామధూమకల్పితమేఘదుర్దినములు
చరమదిఙ్ముఖపతజ్జరఠకాసరవిరక్త వ్యాఘ్రభీతఖడ్గవ్రజములు
తే. పవనతరసరసస్తోయసారమేయ, దళనదంశవనిష్ప్రాణతరుణహరిణ
వాళిసారభ్యదళదిశాంతస్థలములు, ఘోరకాంతారములు కొన్నికొన్ని గడచి. 75

క. సరిసెరసి మెఱసి బిలములు, దరిసి ధృతు ల్చెరసి దొరసి దంతావళముల్
పరశిఖరం బగు నొకమల, సరస న్సరసారసరసి సరసి న్గనియెన్. 76

వ. తత్సరోవరం బావిష్కృత పుష్కరంబు గావున యాదవస్థానంబును మత్స్యకూర్మవిలాసభాసురంబు గావున యోగిరాజును బ్రకాశితాహిమకరంబు గావునఁ బ్రాతఃకాలంబును నధిగతబ్రహ్మరథంబు గావునం బర్యస్తవితానంబును నారాధితారికులంబు గావున నపారబల సంపన్నంబును బకవిహారయోగ్యంబు గావున నేకచక్రపురంబును నూర్మికాభిరామంబు గావున నలంకృతుం బురుడించి యొప్పుచుండు.

క. కని యనురాగరసాబ్ధి, న్మునుము న్గ్రోలాడి భిన్నముఖకమలవనీ
ఘనపరిమళగుణచిక్కణ, వనజాకరవారిలో నవారిగ నాడెన్. 78

ఉ. ప్రావృతమాతపోతమృగుపల్లవపారణకారణంబునన్
లావువహించి సొంపు వొదలన్ బ్రబలం బదలాఘవంబునం
బోవఁగఁ ద్రోయుచు న్మరలిపోయి సరోవరలాభవార్త యా
క్రేవఁ జరించుయూథపతికి న్వినిపించె గజంబులన్నియున్ 79

ఉ. చెప్పిన నప్పు డుల్లసిలుచి త్తమునం గరిరాజు గౌరవం
బొప్ప మహాహితద్విరదయూథముఁ దోకొనిపోయెఁ బోవ నా
చొప్పున డాఁటిపోవ నొకచోటును గానక తత్పదాహతిం
జెప్పలు గుల్లలై పొలిసె శీఘ్రమె పెక్కుశశంబు లచ్చటన్. 80

సీ. అచ్చోటఁ జాదియు నంతశిలీముఖుం డనుశశరాజు దైన్యానలంబి
యగుచు మంత్రుల కిట్టులనునీతి నిధులార యక్షికి వారివాహములుదోలె

సరమున కలుషత్వస్థానారంబున నేఁ డవారణ నీదారివారణములు
పఱతెంచుచున్నవి పరికింపు మల్లవె కుందేళ్ళ వీని త్రొక్కుళ్ల మడిసె
తే. ద్రాసకర పైనయీశశ ప్రకయమునకు, నకట యెబ్బంగి శాంతికార్యంబు దొరకు
నేమిసేయుదు నను నంత నెదుర నిలిచి, వినయనీతికళాశాలి విజయుఁ డనియె. 81

క. దేవా నేఁ గలుగఁగఁ జిం, తావారిధి నేలమునిఁగెదవు శశములకుం
గావించెద శుభ మిభముల, రావిడుసం జూడు నాపరాక్రమ మనుడున్. 82

క. పలికె శశరాజు గాఢో, త్కలికన్నయనిధి దేశకాలవిభాగం
బులు నీక తెలియు నిట నీ, కలిమిఁ గ్రియాసిద్ధి యెట్లు గాకుండున్. 83

క. ఆలస్య మకర్తవ్యము, కాలం బారంభమునకుఁ గరుణ్యుదరులన్
దోలి శశప్రాణంబులఁ, బాలింపుము నీయుపాయపాటవ మమరన్. 84

క. అని యాజ్ఞాపించిన నయ, వినయపరాక్రమవిధానవిజయుఁడు విజయుం
డనిలజయంబున నెదురుగఁ, జని యూథపుఁ గాంచి మానసము గలఁగుటయున్. 85

క. గజముంటినట్ల యడచు, న్భుజగము మూర్కొనినయట్ల పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపుం, గుజనుఁడు మన్నించునట్ల కొను బ్రాణంబుల్. 86

క. కావునఁ గరినికటమునకుఁ, బోవం గార్యంబు గాదుపో యిపుడు మహా
భావనమున నుపకంఠ, గ్రావాగ్రం బెక్కి ముఖ్యకరిఁ బలికెంతున్. 87

చ. అనిగిరి నెత్తి మెక్కి శశ మగ్గజవల్లభుఁ జూచి యిట్లనుం
గనలున నీకు రాఁబొలుము గాదిది నిల్వుము చందమామ న
న్ననుపఁగ వచ్చితిం బయనమై యలజాబిలిలో శశంబుగా
మనమున నన్నెఱింగికొనుమా యన దంతి వతంసుఁ డిట్లనున్. 88

క. ఏమినిమిత్తము శశక, గ్రామణి నిన్నిటకుఁ బంపెఁ గైరవమిత్రుం
డామాట తేటపడఁ జెపు, మా మాకన విజయుఁ డగ్గజాగ్రణి కనియెన్. 89

క. హేతులు పైఁబడునపుడున్, దూతలు సత్యంబుఁ బలుకుదురు తద్భాషా
వ్రాతమునకుఁ గలఁగరు ధా, త్రీతలవల్లభులు నగరు తెగ రెప్పటికిన్. 90

క. అలనెల తనమాటలు గా, నలవున నీతోడ నాడుమని నన్ను నపున్
దలపోఁచి చెప్పవచ్చితిఁ, దెలియు న్వినుము యూథపతి తిప యప్పలుకుల్. 91

ఉ. చారువిచార యిక్కొలను చంద్రసరోవర మిందుఁ దారకా
ధారుఁడు చంద్రుఁ డిష్టవనితాజనతోయుతుఁడై యథేష్టసం
చారవినోదము ల్సలుపుసంతతము న్వినుమట్లు గాన నె
వ్వారికిఁ బోవరా దెలుఁగవా యట కెత్తెఁ గింతవింతయే. 92

చ. నిరతము నీయరణ్యధరణీసరణిం జరియించునీశశో
త్కరములు నాకుఁ జుట్టములుగాఁ బరికింపుము చంద్రనీరజా
కర మతిభీకరంబు తడగాఁ జను నా విహితోపదేశ మా
దరమున వీనుల న్జొనుపు దవ్వుఁ లవాఁడవు గాక నీతికిన్. 93

చ. సరసికి మీ రఖండరభసంబున రాఁ బరికించి యాసుధా
కిరణుఁడు నేఁడు మేరుగిరికేసరుల న్మిముఁ జంపఁ బంపఁగాఁ
పరశువు గోరఁ బోవుపనిపట్టున నేమిటికంచు మాన్చియీ
తెరువున మిమ్ము నిల్పఁ జమదెంచితి నీతిపరుండఁ గావునన్. 94

క. చావక నోవక యాదల, పూ వాడక నానియోగమున నెందైనన్
బోవుట శోభన మన దం,'తావళ మి ట్లనియె శశపతింసఁబునకున్. 95

సీ. అదిచంద్రకాసారయూసారమానసతారలు దార్లై తనుభజింప
జలవిహారం బందుసఖుపునె నిలుపునె యెరులెవ్వ రిటకు రాకుండ విధుఁడు
పంచాననముల మాపైఁ బంప ననుకంప మాన్చి యేతెంచితె మమ్ముఁ గావ
నీవంటి కారుణ్యనిధి యెన్నిభవములం గలుగు నీకతమునఁ గలిగె బ్రతుకు
తే. మగిడి పోయెద మనుచు నమస్కరింపఁ
బ్రత్యయముపుట్ట నక్కరి ప్రవరుఁ గొనుచు
విజయుఁ డారేయి గొలనిలో వెలుఁగువానిఁ
జంద్రు ననుబింబితుని జూపి జరుగుమనియె 96

వ. అవ్విజయు నియోగంబున దంతిపతి వనాంతరచింతం బఱచె నంత శిలీముఖ ప్రముఖశశంబు లానందించె గజంబుఁ దిరుగఁ ద్రిప్పుట శశంబుల ప్రశస్తంబు మాన్చు టచంద్రవ్యపదేశంబునం గాదే యట్లగుటఁ బ్రసిద్ధం డగు రాజు నాశ్రయింప వలయు దాన సుఖలాభంబులు దుఃఖక్షోభంబును నగు నీయులూకంబు ప్రసిద్ధం బగురాజ్యంబున కర్హంబు కాదని చెప్పి కాకంబు వెండియుం బులుఁగుల కిట్లనియె.

క. సముచిత మెఱుఁగక క్షుద్రుం, గ్రమరహితుగు తించిపోవఁ గడుఁగీడొదవున్
దమలో నొంటక మార్జా, లముడగ్గతి శశకపింజలంబులు చెగవే. 98

క. నావిని విహగములను నయ, కోవిద యారెంటికేల గొదగొదపొడమెన్
జా వేఁబచ్చె నోతువు, చే వానికి నింతపట్టుఁ జెపుమా తెలియన్. 99

చ. అని తనువేఁడుకొన్నఁ గరటాగ్రణి పక్షులఁ జూచి యిట్లను
న్వినుఁ డలవింధ్యభూమి నొకపీరమహీరుహమూలకోటరం
బునికి యొనర్చి యమ్మనికిముందుఁ గపింజల మప్పతత్రితో
నెనసి కుశైకదేశమున నేనును నుండుదు సఖ్య మేర్పడన్. 100

చ. విరసులువల్కి నన్ను వెఱపింపఁదలంచెదొ కట్టిపెట్టు నీ
గరువము వెఱ్ఱి యాశశిఖామణిమందిర సేద నెవ్వరి
క్వరు వసియించి యుండి రది వారిదకాననభూమిజాతకో
టరముల వాఁప్రవిట్టెను యుదంబడి పక్షుల కుర్వి చెప్పుమా. 111

క. చెఱువులు బావులు గృహములు, తరువులు వృత్తులు ననారతము గాదినయా
నరు లయవి యనుచు మనువు. త్రర మొసఁగఁడె తొల్లి దేవతా సంతతికిన్. 112

క. బలవంతుఁ డైవధరణీ, తలభర్తకుఁ బోలునిట్టితగ వకటవకటా
పులుఁగులకును గుందేళ్ళకుఁ, బలుకులు సేయేల చెల్లుబడి గాదుసుమీ. 113

క. జగతీరుహవివరమునకు, ఖగనాథా నీకుశేదు కారణమేలా
తెగిపోర నాకు నీకుం, దగ నెక్కడికేని నరుగుదము శష్మనుడున్. 114

వ. మదీయమైత్రిముంజాలం బక్కపింజలుం బిట్లనియె. 115

క ఒప్పితి నిటఁ దగ నెవ్వరు, చెప్పిద రెఱిఁగింపు మతనిఁ జేరఁగ నెడలే
కిప్పుడ యరుగుద మనవుడుఁ, గప్పినతమకమున దీర్ఘకర్ణుం డనియెన్. 116

సీ తపనజాతటమున దధికర్ణుఁ డనుమహావృద్ధమార్జాలంబు విహ్వలిసల్పు
నది రుద్రచాంద్రాయణాదికార్యంబులఁ దనువు సన్నముఁ జేసికొని విరోధి
షడ్వర్గ మణఁగించి శాంతిన త్రిలుబహువ్యవహారదర్శి వయాంబుకాశి
యది నేర్పు మన దిక్కువదలింపఁ బెనుజోలి ద్రవ్యాక నిమిషంబు దడయకటకుఁ

తే. బోదమా వాద మాఱడి బోకపోవు, నని ప్రబోధించి శశ మమ్మహాకపింజ
లంబుఁ దోడ్కొని చనుచుండె లాఘవమునఁ, దలలు వడుచోటికిఁగుపాదములు గాకె.

క ఏను గపింజలుఁ జిరమై, త్రీనిధి విడనాడలేక వృక్షలతాగ్ర
స్థాని విడవాడి యెపుడెం, తేనెవ్వడిఁ గూడిపోయితిం జెలికానిన్. 118

మహాస్రగ్ధర. చని కంటిం బ్రాంతకాంతక్షమనిరవధికశ్లాఘ్యసౌంభ్యసంప
ద్వనజాతవ్రాత రోధోవనవమధుమధువ్యగ్రమత్తాళిగీతిన్
జనితశ్రద్ధానిమజ్జజ్జనఘనహదనోచ్చండకాండప్రపూతిన్
వినిష్క్రబ్రహ్మనిష్ఠద్విజహితసికతాస్వీతఖద్యోతజాతిన్. 119

తే కని తదంచితమణివాలుకావితర్దిఁ, జరణములు మోఁపి నిర్గతశ్రమముఁ జైతిఁ
గంతుపర్యంతపరిమిళగ్రాసమంద, జపనపనాభిగమసమాచారకలన. 120

సీ. మునికిచో టిదిగాదె యనువాసనాచాంతఖచరజీవిత మరుత్కాశియునకు
నాటపట్టిదిగాదె యరివిభాగతగోపవేషబృందావనవిష్ణువునకు
నిష్టకుజ్జనగృహం బిది గాదె రాసనృత్తాక్రాంతకాంతానతంసములకు
హాలహాలంబిదిగాదె హాలోద్ధతప్రలంబారిలాంగలలేవి హానమునకుఁ

తే. ప్రతిదినము గ్రోలనిది గాడి కావిగాద, కృతకకృత్యకీర్తిదనంద గోబృందము
క్షుద్ర మిదిగాదె దివసకృజ్జలజమువవు, నని నుతించితి నంతిదాయమునయము.

సీ. అచటఁ గపింజల మావృద్ధమార్జాలపతిఁ జూచి చిత్తంబు పల్లటిలినఁ
గదియఁగూడక దీర్ఘకర్ణుఁ జూచి నిజాలతగవరి యని వీనిఁ బొగడితీవు
కుటిలమానసుఁ డతితుచ్ఛుండు కేవలజఠరపూరకుఁడు మార్జాలజాతి
బెడిదుండు వీని నమ్మెడితెలం గయ్యాది యొద్దికిఁ జనఁ జిత్త మొప్పకొనదు

తే. తగవు దయ్య పెఱుంగు నీతగవుపట్టు, ప్రాణమేటికిఁ దెక తేరఁ బాపికొనఁగ
ధర్మమునకొండుకడ తెరువము దురాత్మ, మగుడు మనుటయుఁ గనలి యమ్మదటశశము

వ. పలికెఁ గపింజలంబున కపారకృపానిధితుల్యదర్శికే
వలపరిశుద్ధుఁ డార్తజనవత్సలుఁ డుత్తముఁ డబ్బిడాలభూ
తలపతి యిట్టిధర్మపరతంత్రుఁడు నమ్మినవారిఁ జంపఁ గాఁ
దలఁచునె యేమిపల్కితి పతత్రిపసంశయ మొప్ప దియ్యెడన్. 123

చ. ఇన్నియుఁ జెప్పనేమిపని యింకిట నీవది నంతిసాధ్వసం
బున్నబిడాలముఖ్యకడ కొక్కట నిద్దఱ మేగి సర్వ మ
చ్ఛిన్నమనీషవిన్నపముఁ జేయుద మూరకపత్తు మంచు ము
న్నెన్నను గానలేక పిఱుబీకులు సేయు ఖగంబు బీరమై 124

వ. యాగపద్యాభిమానంబున శశకపింజలంబులు డాయంబోవుచుండె నప్పు డారం
టికి నిత్యప్రత్యయం బారాధించుటకుఁగా దధికర్ణుండు ధర్మవాక్యంబు లుచ్చ
రింపం దొడంగె. 125

క. ధర్మంబు తమ్ముఁ బెనుచున్, ధర్మం బభివృద్ధిఁబొంది తను బ్రదికించున్
ధర్మము శర్మకరం బని, ధర్మం బేమఱరు సంతతము దత్త్వజ్ఞుల్. 126

ఉ. ఉపగతులై భజింపుతనయు ల్సహజన్ములు గూర్మిచుట్టము
ల్విపులతరైకదుఃఖముల వేగిరు దిరింతియు రారు వెంబడిన్
నిపుణులకేల తన్మత నెట్టన దేహి శరీరమూడ్చి చ
న్నపుడును ధర్మమొక్కఁడ సహాయము దానిఁ ద్యజింపవచ్చునే. 127

క. పురుషార్థపరున కిహముం, బరముం గలదండ్రు సత్యపరతంత్రు సురా
సుర లర్చింతురు గావునఁ, బరహితసత్యములు విడువఁబడ వెప్పటికిన్. 128

తే. ఆత్మవత్సర్వభూతాని యనుపురాణ, వచనమూని బహుప్రాణివత్సలుఁడయి
సుఖము దుఃఖము సమముగాఁ జూచికొనుచు, దేహి పరలోకచింత వర్తింపవలయు.

చ. సొలవక మేను కంటకము సోఁకినఁ గొండొకశోణితంబు పి
చ్చిలి తనకెంతనొప్పి యగుఁ జెప్పెడి దొండొకఁ డేమిదేహముల్

గలిగినవాని నిర్విఘ్నముగాఁ దనుతేరఁగ నలంచు నేరికై
వలనుగుటతోఁ బ్రాంగ నదమై తనంగాఁ జనుసత్త్వమేదికిన్. 130

క. అనుదధికర్ణునిపలుకులు, విని నిర్భయవృత్తిఁ గొంకుపడక కనియం
జనితనతనవాగ్వాదము, లనుదానికి శశకమించజాలంబులు సెప్పెన్. 131

సీ. చెప్పిన నప్పు డాతీర్థోత్తుం వారెంటి కనిగొని మీరేమనియెదరో వినము
తెగనిచాంద్రాయణాదివ్రతంబుల దేహ మతికృశం బొనరించుకతనఁ జెవులు
తానకనూత్తశబ్దస్వీకృతిం బాటిగావు గావున నీవు నీవు నిపుడ
శ్రవణము ల్గదిసి యుచ్చైస్స్వనంబులఁ బల్కఁ దేర్పడ మీకుత్తులెల్లఁ దెలియుఁ
తే. గదవె మమువంటిమునులకుఁ దగవుదీర్ప, జేవురుంపంగ మము మీరు విశ్వసించి
దూర మరుదెంచితిరి కావునఁ ద్రోవరాదు, జాగుపనిలేదు మాకనుష్ఠానవేళ. 132

క. అరుదెండని నికటంబున, కరిగినదధికర్ణుఁ దంష్ట్రిహతి నారెంటిన్
దొరకుపడఁ బట్టుకొని కం, ధరవిరియం గొఱికిచంపి తగభక్షించెన్. 133

సీ. క్షుద్రాశ్రయంబు నొవ్వుటకు జన్మట కాదికారణం బనిచెప్పి కాక ముఖల
ఖగములఁ జూచి ఘూకంబేడఁ బక్షిసామ్రాజ్యాభిషేకసంబంధ మేడఁ
బనిగానిపని మానుఁడన రోసి కూడినపులుఁగులు చదలఁ బేరెలుఁగులెసఁగ
నెసఁగన్న దెసఁ గుబ్బెసలారఁ బఱచినదర్పాంధ మద్దివాంధంబు గనలి
తే. పసపుజేగురుకొలఁకచ్చు మిసిమిదేరు, మిట్టకనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగఁ
గంఠఘూత్కారములదిశ ల్గలఁపరింప, గర్వదుర్లోకమునకుఁ గాకమునకనియె. 134

క. ఏమినిమిత్తము కుటిలా, త్మా మత్స్వామితను నెగ్గుఁదలఁచితి వేనీ
కేమిదురితం బొనర్చితి, నేమంటి భవద్విరోధినే యిదితగవే. 135

క. శైలవనవహ్నిశిఖలం, గాలిపాదల్పొదలఁ బరశుగతిఁ ద్రవ్వి మునున్
సాలములు కత్తిరింపఁగఁ బ్రతి, కూలవచోదగ్ధముసుడుకొన దింతైనన్. 136

ఉ. కుచ్చితమేమిగూడ సమకూడినరాజ్యము వీటిఁబుచ్చఁగా
వచ్చినలాభమేమి మఱవంబడదా తరువాత నిట్టిని
యుచ్చపుఁజేఁత సౌఖ్యమున నుండుదుగాకని పక్కపోరె న
వ్వెచ్చఁజూమీ విరోధ మొదవం గరటాళి యులూకజాతికిన్. 137

క. వావిని వాయసపతిపై, జీవికి నిట్లనియె నీతిశీలా హితసం
భావనకుఁ కీ నీతిడవే, లా వేగమ తెలుపు మనిన నతఁ డిట్లనియెన్. 138

వ. సంధివిగ్రహంబు విచారణీయం బాసనము బలిష్ఠమయ్యె నుపస్థితిపుస్థానం బగుట
నదియునుం గాకను యానంబునను లావు చాలదు స్థానత్యాగంబు లాఘవమూలంబు

ప్రత్యాసన్నవిరోధిశలంబఖావంబగుట ద్వైధీభావంబు పొసంగదు సంశ్రయం
బన్నిటికిం గర్తవ్యంబు విను శరీరపతనపర్యంతంబు నీకార్యంబున కేఁ బాటుపడఁ
గలవాఁడ. 139

క. పలువురుకృతవైరు లమతి, బలధుర్యులు విమతులున్నఁ బరకార్యంబుల్
పొలిసిపడుం జెడు మునుధూ, ర్తులు మేఁకం గుక్కఁ జేసి తోలరె విప్రున్. 140

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము తేటపడఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 141

సీ. చెనఁటి యాకులపాటుచే నలంగినసాధుతరుల కుబ్బొసఁగు నాదరణమూర్తి
భీమతీవ్రాంబకాభిహతిస్రుక్కిన మహావధురధర్మునిఁ బ్రోచు మాన్యవైజ్ఞ
ఫలభంగమున మాటపట్టు జాతిన పైకమునకు సత్ప్రోక్తు లిచ్చినసుదాత
హాలినున్మత్తచండాలుర మాధవార్చనధురంధరులఁ జేసిన ఘనుండు
తే. కాలగతిఁ బేర్చు నలజళ్ళఁ గలఁగఁబడిన, సరసులకు నిర్మలత్వంబు సంఘటించు
సౌఖ్యసందాయకుండు సాక్షాత్కరించె, నన్నుతోకంతుఁ డవనివసంతుఁ డంత. 142

సీ. ముక్తపత్రవ్యాజమునఁ జీరసడలించి కలికలఁ బ్రువ్వలకల గలుగఁజేసి
పాలిపోనితావులఁ బూవుదండలఁ జుట్టి కడలేనిమధుసాత్త్వికమునఁ దెల్చి
రణదళిఝంకారమణితము ల్ఘటియించి దీవిచక్కిరలాలు మోవియాని
పరవినున్నతఫల స్తనములఁ గబళించి కళదేఱుతనువల్లి గౌఁగిలించి
తే. కలికిరాచిల్కపల్కుఁబల్కుల నల్చి, సురభికర్పూరరజముల సొంపొనర్చి
కలితవనలక్ష్మిఁ గూడి రాగము వహించె, మాధవుఁడు వ్యాప్తనిఖిలసుమాధవుండు.

వ. మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తిసందర్భ
గర్భితంబై భాగవతంబును గలకంఠకలాపదీపితంబై రాజాస్థానంబును బ్రకాశిత
ప్రవాహంబై సముద్రతీరంబును సందృష్టశారికాజాలంబయి వీణాయంత్రంబును
బుపడించు నక్కాలంబున. 144

చ. కలఁడిల ముగ్ధభూసురుఁ డొకానొకఁ డాయనయధ్వరార్థమై
బలిసినమేఁకపోతు మెడ పగ్గమువం బిగియించి యీడ్చికొం
చలవున నింటికై యరుగ నప్పుడు గొందఱు ధూర్తులిచ్చలో
పలఁ దలపోసి యవ్యాజముఁ బాపఁదలంచిరి దుర్ణయంబునన్. 145

క. తలఁచి యొకఁడొకఁడ చని లో, కులు నవ్వ న్విప్రుకుక్కఁ గొనిపోయెదు నీ
కులశీలంబులు పఱుతం, గలపితి విఁక నేమియని విశాలికనగుచున్. 146

క. ఈగతి నంతఱు నాజన, ట్ఠాగముఁ గుక్కఁగమఁ జేసి చనుచుండంగా

నాగరిక మేదినీవిప్రుఁడు, వేగలమున వెలిచి భ్రాంతి వికలుం డగుచున్. 147

క. ఒకరిరువురుగా కందము, నకటా ఛాగంబుఁ గుక్కయని పోరొద రే
టికి బ్రమసి వేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వకుండుదురె తత్త్వజ్ఞుల్. 148

వ. అని విహరణస్థలచ్ఛాగం బగుభాగంబు విడిచి విప్రుండు పూర్ణకరం బగుకాసారంబునకు స్నానార్థియై చనియె నప్పుడు ధూర్తులు ప్రహాసభాసమానాననులగుచు నొండొరులకరంబు లప్పళించుకొనుచు నయ్యజంబుం జంపుకొని భక్షించి రట్లు ప్రజ్ఞాశౌర్యధైర్యాదిగుణంబులు గలవారలు పరులకార్యంబుల విఘాతంబు సేసి స్వకార్య ముద్ధరింతురని మఱియుఁ జిరంజీవి మేఘవర్ణు నాలోకించి. 149

క. తనలావుఁ జూచి మృతకా, కనికాయశరీరరక్తకణములు మేనన్
జినికిపటతటమునం దిడి, చనుఁ డుపహతిరహితభూమిజాతంబులకున్. 150

క. అరిమర్దనుండు సరిస్రా, ద్దరుదెంచుం గరలి తరలి హతశేషరట
త్కారటపూత్యతికటధిజింతున్, హరుఁ డాపగ వారిఁబోలె నాపగ వారిన్. 151

వ. ఘటించి నీకార్య మార్యసమ్మతంబుగా నిర్వహింపం గలవాఁడనని పలికిన మేఘవర్ణుండు లుంఛితగరుజ్జాలుం గావించి విస్రంబగు కాకజఠరాస్రంబుఁ జినికి యచ్చిరజీవిని న్యగ్రోధాగ్రకోటరంబునం బెట్టించి సపరివారుండై నిరుపహతిస్థానంబున కరిగె నాసమయంబున. 152

చ. అరుణగభస్తిబింబ మపరాద్రిఁ దిరోహితమయ్యెఁ బన్నగా
భరణి శిరోధిహాలహాలభంగి నిజుల్ మెరసె న్విరోధిభీ
కరగతి వంతఘాఁబపరిగాఢమహీధరభూజదుర్గకో
టరములు నిర్గమించి వికటప్రకటాననము ల్మడించుచున్. 153

క. అరిమర్దనుఁ డనుపబల, స్ఫురణోల్లోకములు ఘూకములు పటకరటా
హరణేచ్ఛఁ గదలి బహుపా, ద్ధరణీరుహ మాశ్రయించి తద్విటపమునన్. 154

క. కాకములు మెదలకున్నన్, ఘూకంబులు కర్ణఘోరఘూత్కారహతా
కాకులము లగుచుఁ గ్రమ్మతి, పోకను నఱ్ఱాడుచున్నపుడ భూజమునన్. 155

క. మతివిదులకు నుచితమనూ, ద్యతనము సారంభుఁడయ్యె నాకృతకార్య
స్థితిఁ గడఁగవియుని కి మహో, న్నతియని మను వానతిచ్చినాఁ డట్లగుటన్. 156

క. అనితలఁచి నిలిచి తీవిం, బనివడి చిరజీవి యేయపడ నొకనెత్తిం
బొనరించినఁ గ్రమ్మతి పరి, మునుమై యత్తోలులఁ జుట్టుముట్టె న్బట్టెన్. 157

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక యరుగుఁ గావున నతనిం
జుట్టమువలెఁ గొనిచని పతి, కట్టెదురం బెట్టి కౌశికంబులు నిలిచెన్. 158

క. దూరితగరుడుత్కరుని, ప్రారంభునలోహితాక్షతాక్షతి నతని౯
దేరికొనఁ జూచి గర్వస, మారంభోక్తుల విరోధియగ్గనుఁ డనియె౯. 159

క. ఓరీ నీవెవ్వఁడ వీ, తీరమిటికి క్షతి ఘనిన ధృతిపెంపున నా
పేరు చిరజీవి యనిన య, పారగుఁ డాయన యులూకపతి కెఱిఁగించె౯. 160

క. ఎఱిఁగించిన మించిన ని, వ్వెఱ నిట్లను ఘూకలోకవిభుఁ డిట్లనుచే
తెఱఁగు చిరజీవి విన్నఱ, మఱలే కక్కఱరాజు మన్నించుఁగదా. 161

వ. దివస్పతికి బృహస్పతియుంబోలె మేఘవర్ణునకు ముఖ్యప్రధానుండవు నీతిపథికుండవు ధన్యుండవు నీయట్టి కృతకృత్యునకు నిట్టి దశ రానేర్చునొకో సర్వంబును జెప్పుమనిన జిరజీవి యరిమర్దను నాలోకించి. 162

చ. తనపెనుగాకిమూఁకల ఖదాటున నీభటకోటి మట్టి కా
వనితఱిఁ జంపి చన్న మఱునాఁడు మృతేతరభృత్యవర్గము
ల్గనుకనిఁగొల్వ వచ్చిలిచి కార్యము వాయసభర్త వేఁడిన౯
మనమునఁ గొంకులేక యరిమర్దనునిం గనుమంటి నాతని౯. 163

చ. ఘోరబలుం డగాధతరకోటరదుర్గవిహారి రాత్రిసం
చారనిరంకుశుండు పటుశౌర్యఘనుం డరిమర్దనుండు క్రూ
రోరగభంగిఁ జంపఁదలఁచుండఁగ నెవ్విధి నిద్రవచ్చు నీ
వారికి నీకు నెట్లు మనవచ్చు శుభంబు భజింపుమా యన౯. 164

క. అరిమర్దను నిటుఁగని మని, తిరిగినజమునోరు దన్నితివి నాబుద్ధిం
జరియింపు మనిన వాయస, పరివృఢుఁ డంగులకు ముండిపడి నాపంక౯. 165

ఉ. చూచి హితప్రధానుఁ డనుమన్నదిఁ బెద్దయు నమ్మియుండు ని
న్నౌచు విరోధిపక్షుఁ డని నేరనయో తుది నిశ్చయింప నిం
దీచెడుగొట్టు కాల్చి లిచె నేనిఁ జెఱుం బ్రతుకంచు నూఁచిపో
నైచి యులూకభర్తకిఁ కినవత్సలుఁడై విడిపించె మత్తిపై౯. 166

తే. ఎఱుక పిడికెడు ఘనమంచు రదినిజంబు, నెరయునీమూఁక మున్న నన్నెఱుఁగుఁ గానఁ
గవలి చంపక కొంపక గొడవరున, దేవ నీపాదముల మ్రోలఁ దెచ్చి నిలిపె. 167

తే. తోడిమంత్రులజాడ నాదుర్మదాంధుఁ, డాడిన ట్లాడ కుచితకార్యంబుఁ జెప్పి
సిగ్గు గోల్పోతినని చిరజీవిజాతి, బాష్పుఁడై చెప్పెఁ దనచేటుపాటుఁ బలికి. 168

క. ఆవేళ ఘూకపతి వయా, కోవిదు లగుమంత్రివరులఁ గూర్చి ప్రభుత్వ
ప్రావీణ్యంబున నచ్చిర, జీవిచరిత్రంబుఁ బ్రీతిఁ జెప్పెం దెలియ౯. 169

తే. చెప్పి వాయసరాజన్యశేఖరునకు, మానినీయుండు ముఖ్యప్రధానుఁ డితఁడు

స్థలమున్స్త్రీం బటలాభృశాతుం బిగళద్దంతు న్వయోగక్ష్వని
స్థులరోమాక్షిక్కుల మేర్పడం బతివారించు స్నాలవానింబలేక. 182

సీ. పాలుపోయుటెకాని భక్ష్యంబు లిచ్చిన వారెవ్వ రంట దప్పాలుగంటి
చించివైచుటెకాని చీరలిచ్చినఁ గటీరముశఁ గైసేయ దాలింపులాడి
తొలఁగఁబెట్టుటెకాని తొడవులిచ్చిన సొంపుపస మేనఁబూన దప్పులువచెలువ
మగుడనిచ్చుటెకాని మాడలిచ్చిన ముల్లెఁ గట్ట దాజగణాఁగ కలుపకంటి

తే. యింటిముంజూరు పెండెలో నిడుటెకాని, పుప్పులిచ్చిన ముడువ దప్పాగరుమునువ
కుడిచి కూర్చుండి యిదియేమి గొడవఁ జేసె, వార్ధకంబున నాసార్థవాహకుండు 183

ఆ. చెనఁటిభార్య పేరుఁ జెప్పగ పెలబోటి, పేర సిగ్గుఁ దొలఁగఁ జెత్తె సెట్టి
ముదిమి నేడ రోఁత యుడె నాకవిటవిటీ, జాతిపశ్యభేదజంబు లడుగు. 184

సీ. మొరడువంగిన సెట్టిముదుకకు జవరాలిమోము గానవివాని ముకురమయ్యె
వగ్గుభర్తకు నాఁతి వాతెర చండాలవాటినంటిన పిండివంటలయ్యె
గొయ్యాలూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు విపినమందలిఁ గాయువెన్నెలయ్యె
వయసుపోయిన బేరివానికి సఖిచన్ను గొండలందని మానిపండులయ్యెఁ

తే. బలితునకుఁ గోకిలాలాపజిలుగు సెలుఁగు, బధిరునకు నయిన సంగీతపాకమయ్యె
మొలఁతవీక్షించి గ్రుక్కిళ్లు మ్రింగుఁగాని, సౌఖ్యమేమియు నెఱుఁగఁ డజ్జరఠుఁడు.

చ. నెల కొకనాఁడు గట్టిగు నిల్వఁగఁ జూచినవాఁడు గాఁడు పీ
నుల కొకనాఁడు మాటవిన నోఁచినవాఁడును గాఁడు నవ్వులన్
వలపులఁ జల్లమేల్గనినవాఁడును గాఁ డతఁ డెందుపోఁడు గాఁ
వలజపరాలితో డిరతి యందనిమ్రానిఫలంబు సెట్టికిన్. 186

వ. ఇట్లు సన్నిహితవిశేషవేదనాజాతఖేదంబున నారాటంబు బుట్టి యడియాసపసమసు
రుఁ బరిత్యజింపం జాలక కీలకటుమకొని యొడ తెగక నిగుడు నమందోష్ణనిశ్వాస
మాతరిశ్వంబున వధరపల్లవం బల్లలనాడ నతం డొక్కనాఁడు శయ్యాతలంబున
నొడలుపడవైచి దాసీజనంబులు తనకాచరించు నాడిగంబులఁ గోడిగంబులం జేసి
కూడుసీళ్ళకుం బాసి గాసిపడుసమయంబున రజస్వలాంభోజినీదివాసంగమక్రీడా
సంప్రాప్తదురితప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చినవిధంబున దపనుం డపర
గిరిఁ దిరోహితుం డయ్యె నయ్యెడ. 187

సీ. పిసవెత్తియంపుగుబ్బెతలతప్పులు దప్పదాల్చుట కిది కన్నతల్లియిల్లు
కడుపుకక్కుఱితిపిల్చుడుగను ముదిలంజె వఱదుల కిది పిన్నవయసుమందు
గడికన్నగాంద్రయక్కలలను నిలుచూలు పాయువు సొమ్మిదనిది పూఁటకాఁపు

కలవ ర్తకుల కన్నుఁగవఁ బాయునిద్రఁ గదలింపనిది నిమ్మకాయపులుసు

తే. ప్రభకుఁ బాసినకుముదినీపత్త్రనేత్ర. రంజనంబున కిది విశుద్ధాంజనంబు
నాఘనాఘనకాళికానాస్తి వహించి, కటికిచీఁకటి జగమెల్ల గప్పుకొనియె. 188

తే. మానసాటవి నేర్చుచున్మథనవాగ్ని, బాహ్యసంచారమునకుఁ బాల్పడియె ననఁగ
దీపములు సౌధగేహములందిరములందుఁ, జ్రకరశిఖ లుల్లసిల్ల జూపట్టెనపుడు. 189

క. ఆరూపవతి సనారా, హారంబుల నృప్తిఁబొంది యపుడొకభంగిం
బోరాని ఘోరనరక, ద్వారముగలె నృద్ధపతినివాసముఁ జొచ్చెన్. 190

తే. చొచ్చి వచ్చినవందాలుఁ జూచుమూడ్కిఁ, జూడకల్లంత నోసరించుచు గృహాంత
కాంతభిత్తికఁ జెంతఁ గంకటికి నగుగు, బిటికి నీక్షించి యప్పటిపెద్దసెట్టి 191

తే విరహదహనగ్రహంబున విగ్రహంబు, కొలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నాగాబపడుచు నక్షీణవిభవు, భల్లకంపితభవు మనోభవుఁ దలంచి. 192

ఉ కేరె ధనుర్ధరు ల్పవమి లెక్కకు మిక్కిలి యుండు రెండుగా
వా రడరింతు రేటి నెఱవాదితనం బదిరెండు నొండుగా
నారసి వేయు నేరవలదా ముదిసీనలె నెంతవింత యా
నీరజగర్భుఁ డుండుఁ గడునీకరకౌశల మెన్న మన్మథా. 193

ఉ ఇంపున వన్యచాపధరు లేసినతూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయఁగఁజాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనము సేయు నవద్విశిఖంబు లెల్లఁగి
ట్రింపుదు నీదుచాప మువధీరితశాంబరకాంచనాంబరా. 194

క. తీరనికోలపగయుంబలె, నీరమణీమణికి నాకు నెనయదు విరహాం
భోరాశి నెల్లుగడకు, స్వైరోత్తమ నన్నుఁ గూర్పవే కలకంఠిన్. 195

క. అని వెన్నునికొమరు మరు, న్వినతాముగ విరహిపథముదవిధసముగఁ గన
త్కనకమణినిచయుచామరు, నను క్తభ్రమరు దూటి యతఁ డున్నంతన్. 196

తే. కుశలగతి మజ్జనములాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ
ఖడ్గఖేటకపాణిరై గస్తుదిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. 197

వ. అంత. 198

సీ. భవనదీపాహితభ్రమరపేటికవాలు కాగిత్రితలము ల్పృగద్దగోళ్ళు
ములుదోరణముబట్టె మొలత్రాటికుఱువాఁడికైదువు దెసకట్టు కావుబొట్టు
జిలుఁగుకన్నపుఁగత్తి బలపంబు మొగమాయముందు తొలపుటాకు మైలగోఁచి
మనుపుటాకుఱు పోఁకపొడికాయ మోరచ్చు చెప్పులు భుజగవృశ్చికచికిత్స

తే. సుప్తివృద్ధికరౌషధశ్రీద మనిత, వసనభంగంబు పెదతలవంకనికయుఁ
గాఱునును మేను నెట్టనికన్ను లమర, దూరితత్రాసునేపుడొక్కెడొంగబంటు 199

సీ. వచ్చి త్రిమ్మరియతలవరులు గన్గొనకుండ బవరిచుట్టును బలపమున వ్రాసి
ముంచి కన్నపుఁగత్తి మొనకత్తిపెట్టించి యొయ్యనొయ్యన శిలబూడ దివిచి
వివర మేర్పఱిచి యావెంబడి బదములు నడపి నల్వంకలు దడవిచూచి
యలికిడిలేకుండఁ దెలిసి యిల్సొరఁబాఱి వాకిటిగడియ నెవ్వడిసవల్చి
తే. గాలిరాకుండ వెలుతురు గాకయుండఁ, గఱకుగఱబట్ట కన్నపుగండిగప్పి
యొడలిసొమ్ములు వేర్వేర నొలిచికొనఁగ, సరస కేతేర బరికించి జడదరించి 200

క. కచభరము విరియ హార, ప్రచయం బల్లాడఁ బఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ, కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్. 201

సీ. యువతిసేసిన యపూర్వోపచారమునకు వెసమిన్నుముట్టి యమ్ముసలిసెట్టి
యిచ్చనచ్చెరువంది ముచ్చటయినను మొగం బీనిరక్కస దనుదాన వచ్చి
ననునిటు గౌఁగిలించినది నేఁడింయకుఁ గారణం బేమేనిఁ గలుగవలయు
ననిలేచి నల్వంక లరసి యొక్కెడ భయంకరహేతికరునిఁ దస్కరుని గాంచి
తే. యితఁడుపో మూల మీశుభస్థితికి ననుచుఁ, బెన్నిధానంబుఁ గాంచిన పేదవోలె
నీరదోదయ మరసిన నెమ్మివోలె, సమ్మదంబంది యాపరాస్కంది కనియె. 202

క. పొడవుఱువుంబలె ననుఁ దన, కడకన్నులఁ జూడరోయుకన్నులకలికిం
గడువేడ్కఁ గూర్చితిఁక నె, క్కడఁగలఁ డిటువంటిచెలిమికాఁ డారసినన్ 203

క. మానగుమహిజక్రోడ, స్థానంబున నలుఁగుమదనదావానలకీ
లానివహము చల్లార్చను, దీనిపయోధరము లద్వితీయచరిత్రా 204

క. చోరకుఁడవె యతిసమ్మద, కారకుఁడవుగాక తీర్చగలనే నీస
త్కారఋణ మీభవంబున, దూరీకృతకలుష వడ్డితోడం గూడన్. 205

క. తనగృహమునఁ గలవాసో, ధనకనకము లెల్లనిచ్చెదను ధృతిమీఱన్
గొని చనుమని యంజలిసే, సినఁ జోరుఁ డతిప్రసన్నచేతస్కుండై. 206

చ. నెఱయఁ జెలంగియున్నయతినిం గని యిట్లను సార్థవాహ యి
త్తెఱవ భవన్నిరోగమునఁ ద్రిమ్మరదే యది క్రొత్తగాదె నా
మఱఁదివి నీవు చెల్లెలివి మమ్మవలోకముఁ జేసికాదె బ
ల్వెఱపున నిన్నుఁ జేరి పొదవెం దనచక్కనిసోగచేతులన్. 207

క. నీనిలయంబునఁ గలసొ, మ్మేనొల్లం బడుచుకరణ మిచ్చితినిది నీ
తో నలగిన వేసారిన, చో నను మదిఁదలఁపు మఱయుదుం గఱితేటన్. 208

క. చెలియలని చూడఁ గినిసిన, దలఁ గోయుదుఁ బతికి సమ్మదము గానిది యు
వ్వలికేల హితులకేటికి, లలనామణి యిది మొదలై లెఁగు నీయాజ్ఞన్. 209

వ. అని భయంబుఁ బుట్టించి కృతసత్కారుండై చోరుండు సార్థవాహు వీడ్కొని చని
యె నా సమయంబున. 210

సీ. రాజాస్యముఖతామరసవాసనల గ్రుక్కి నానుముక్కున బంటి యైనదనుక
ధరపయోధరసుధాధరరసంబునఁ జొక్కుఁ బంచబాణపిపాస వాయుదనుకఁ
జంచలేక్షణ ఘనస్తనగుళుచ్ఛకముల నలముహస్తగ్లాని వోఁగుదనుక
నాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు బొంది తాపము శాంతిఁ బొందుదనుకఁ

తే. బ్రాయ ముడిబోయి కసరింకఁ బాటియుండు, పంటిచాట్పున నెఱవేరుపడినయొడలి
పరుసు పెట్టిన బీదచే పడినపగిదిఁ, గులుకుగుబ్బెతవయ పెల్లఁ గొల్లలాడె. 211

సీ. ఉదయవేళకు మున్నె నిగురమేల్కని వచ్చి ప్రాణవల్లభు పదాబ్జములన్వ్రాలు
వ్రాలి నిర్మలతరజ్వలనతప్తసువర్ణకలశోదకంబుల జలకమార్చు
జలకమార్చి సపర్వశర్వరీకాతపోత్తాలచేలంబులఁ దాల్పనిచ్చు
నిచ్చి పొచ్చములేక హేమపాత్రంబున నిష్టాన్నముల భుజియింపఁబెట్టుఁ

తే. బరిమళముఁ బూయుఁ గపురంబు సురటి విసరుఁ
బూవుదండలఁ జుట్టుఁ దాంబూలమిచ్చు
బడక సవరించుఁ జిటిపొటినడుగులొత్తు
వలముఁ గౌఁగిట నాతిచోరాతిభీతి. 212

ఉ. ఏరికినైనఁ జోరుఁడు సుహృత్తముఁడే యతఁడేల నేసస
త్కారము సార్థవాహునకుఁ గన్గొన నిచ్చిరజీవితావకీ
నారికి ముఖ్యమంత్రియగు నైనను నీతిపరుండు గాన నే
తీరున నైన నిట్టిసుమతిప్రవరుం డశుభం బొనర్చునే. 213

క. అని దీప్తాక్షుఁడు చెప్పిన, విని యరిమర్దనుఁడు నీతివిభవవిలాసున్
వినుతాసువక్రనాసుం, గనుఁగొనుటయు నతఁడు కాశికప్రభు మొగమై. 214

క. కంటకులు రిపులు దమలో, నొంటక పురిఁబాసి యూర నొకఁడై విను మి
ట్లొంటిఁ గృశియింపుచుండుట, గెంటనిశోభనము గాదె క్షితిపా నీకున్. 215

ఉ. ఈతఁడు మేఘవర్ణునకు నిష్టము గల్గినవాఁడు సత్క్రియా
న్వీతుఁడు రాజకార్యపరినిష్ఠితుఁ డీతఁడు లేమి లేమిను
మ్మాతని మార్జితైకవిజయస్థితి నీ కితఁ డుక్కఁజేసి వి
ఖ్యాతి సహింతు శత్రుబలహైన్యము నీకు శుభంబు గావొకో. 216

క. వైరులు రాయుట హితస, త్కారమునక యనువులిచ్చెఁ దస్కరుఁడు లఘు
శ్రీరమహాగోద్వితయము, రారాపున గృహికి బ్రహ్మరాక్షసుఁ డిచ్చెన్. 217

క. ఆవవిని యరిమర్దనుఁ డా, నవ మలరఁగ విక్రనాసునకు నిట్లను ది
గ్విసుత వసుప్రథ యక్కథ, వినవేడుక యయ్యెఁ దెలుపవే నాకనుడున్. 218

వ. విక్రనాసుం డిట్లని చెప్పం దొడంగె. 219

చ. కృతవిదధీశ చెప్పెదఁ బరిగ్రహలబ్ధము భూరిదుగ్ధగో
ద్వితయము పొల్చు నొక్క జగతీసురు లోఁగిట దానిఁ బంచనా
మతి నొకటన్ హరింపఁగను మందచరుం డనుతస్కరుం డళి
ప్రతినవకాలకూటరుచిబంధురమైనయమాస రేఁకటిన్. 220

క. నెప్పెఱుఁగక చనఁ గానల, నొప్పున నొక బ్రహ్మరాక్షసుం డరుగుచు నా
దెప్పరిపుమ్రుచ్చు నచ్చోఁ, దప్పక వీక్షించి యద్భుతధ్వనిఁ బలికెన్. 221

క. ఓరీ యిఱులూ ఱెడునీ, దారుణనిశి నెందుఁ బోయెదవు చెపుమా దు
ర్వారత్వర ననుటయు నల, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కిట్లనియెన్. 222

క. జయసిద్ధి యనుగ్రామము, నయనంబునఁ గలదు గోద్వయము దాని నతి
ప్రియతం గొని చనునాతఁడ, నయిపోయెద నొంటి నిమ్మహారాత్రమునన్. 223

ఉ. కందెనదాయుచాయిలొఱ కచ్చులమేళము లక్షుగోళము
ల్గుందనమానునోరుపసిగొమ్ములదండులుపంచు లిట్టిమా
పెందును జెప్పఁ జూపనరు దెవ్వఁడవీవని వేఁడినం దరా
స్కందకి బ్రహ్మరాక్షసుఁడు సత్యపురస్సరభాషణ్ణిట్లనున్. 224

క. ఈనిశ నిట నేవిప్రుని, ధేనువులం ద్రాట నీవు దివియుటకై చో
రా నేఁ డరిగెద నతని న, తానకమునఁ జంపఁబోయెద న్బలలాశిన్. 225

క. నావిని చోరకుఁ డంతం, బోవక యనునిన్నిశీథమునఁ గ్రోధమునన్
భూవిబుధుఁ జంపఁబోయెదొ, కో వాఁ డెటువంటినేర మొనరించెనొకో. 226

క. కారణముఁ దెలుపుమన నల, చోరకునకు బ్రహ్మరాక్షసుండను రజనీ
చారపలాయనమంత్రక, శారూధుఁడు గాఁడె యరయ నవ్విప్రుండున్. 227

చ. జరఠకపిత్థరంధ్రములఁ సాఁబిలంబు లగాధనింబకో
టరములు మట్టిమానితొఱట లైనురావుఁతొఱ్ఱలు న్మహా
నిరవధితింత్రిణీమహిజనిర్వ్యధనంబులు తొంగిచూడరా
దరసిన బ్రహ్మరాక్షసుల కద్ధరణీసురుచేతిరాయడిన్. 228

క. మెఱమెఱసి యద్ధరామరుఁ, బఱిమాఱ్పం బోవరాదు బ్రహ్మకునైనన్

మొఱఁగి నిదురింపవో నిది, తఱి యగుటం జంపఁబోయెదం బదమునుచున్. 229

వ. ఇరువురు చని యవ్విప్రగృహంబు ప్రవేశించి రందు బ్రహ్మరాక్షసుండు ప్రతిరోధి కిట్లనియె. 230

క. తొలుదొలుత నరిగి విప్రుని, బొలుపారం జంపి కడకుఁ బోయెద నాలోఁ
దలఁకక నీ వరిగి నిరా,కులవృత్తిం బసుల నాఁచికొనిపొమ్మొకటన్. 231

క. తెరిది యని చెప్పినవిని, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కను నీద
ర్వారంభ మెఱిఁగి రేని మ, హారభసము పుట్టు నీగృహంబున నకటా. 232

క. ఈ నెఱి నలికిడిపుట్టిన, ధేనువులను ముచ్చిలింపఁ దీఱునె నాపూఁ
పైనతరువాత దూఁడుము, గా నరిగినమీఁదఁ జంపు కాదన విప్రున్. 233

ఉ. నావిని బ్రహ్మరాక్షసుఁడు నన్నిటులాడఁగ నెంతవాఁడ వీ
లేవడి నిన్ను వేఁడ నవులేకలిగెం బొలఁదొల్త నిద్ధరా
దేవునిఁ జంపెదం గనలు రేఁగినం జడరంగి దొంగయుం
బోవకు పోకు మం చతనిభూరితరధ్వని నడ్డగించినన్. 234

వ. అక్కలకలంబు విని బ్రాహ్మణుండు మేల్కనియె నప్పు డతనికి విశ్వాసంబుఁ బుట్టింపం దలంచి 235

క. మును బ్రహ్మరాక్షసుం డి,ట్లను నఘా తాపకీన మగుగోద్వయమున్
గొన నున్నత్రాసదీపితుఁ, డని చోరునిఁ జూపె నిజకరాంగుళికోటిన్. 236

క. చోరుండును బటురౌద్రా,కారుండై నినువధింపఁగా నదయుండై
చేరినక్రూరుం డితఁడని, యాగాత్ముఁ జూపె భూసురాధ్యక్షునకున్. 237

క. సేరముఁ దప్పించుకొనం, జోరుండును బ్రహ్మరాక్షసుండును దనతో
నీరూపునఁ జెప్పినముఖ,సారసరిపుమీఁద హాసచంద్రిక మెఱయున్. 238

క. ధరణీసురుఁ డిట్లను మీ,రిరువురు పరమాప్తు లనఘు లిందెవ్వరిపైఁ
గరలెదము చనుఁడు గాఢ,త్వరఁ గ్రమ్మఱ మీరు మీనివాసంబులకున్. 239

క. దీవింపవలె దపనీ,దేవత లామోదవనధిఁ దేలిన శాపం
బీనవలె దలఘుసంతా,పావిలచేతస్కు లమ్మహామహులయినన్. 240

వ. బ్రాహ్మణద్వేషంబులేక బ్రతుకుం డని వీడ్కొలిపినం బోయి రాచోర బ్రహ్మరాక్షస వివాదంబు జయసిద్ధికిం బోలె మేఘవర్ణ చిరజీవి సంవాదంబు నీకు నిస్తులకల్యాణంబుఁ జేయునని విన్నవించి వక్రనాసుండు వెండియు. 241

సీ. తనమేనికండలు దఱిగి డేఁగకు మేఁపి ఖగముఁ గావఁడె శిబిక్ష్మావరుండు
గరుడుని కాహారకళమై నాగేంద్రవరుఁ బ్రోవఁడే మేఘవాహనుండు

నిజకళత్రద్రోహి నిర్దయాత్ముఁ గిరాతు మనుపఁడే విస్రబ్ధమైత్రిపత్రి
శత్రుసోదరు విభీషణు సమిద్భీషణు రక్షింపఁడే తొల్లి రాఘవుండు
గీ. సకలదిక్కామినీకుచ స్తబకములకుఁ, దారహారకలాపమై తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది నిత్య మగుచుఁ, గంటె శరణార్థి మనుచుటకంటె శుభము.

సీ. అని వక్రనాసుఁ డిట్లాడుమాటలు విని యందఱు వేర్వేఱ నడుగబుద్ధి
నపుడు దివాభీతనృపతి వికారకర్ణునిఁ జూచి తోఁచిన ట్లనఘ నీవు
పోలిన తెఱఁగుఁ జెప్పుము గాక యనుటంత నెడసొచ్చి కర్ణాత్ముఁ డిట్టు లనియె
నేకార్య మెఱుఁగరు రింకఱు పలుగూఁత లఱచెద రవివేకి వగుటఁ జేసి
తే. మంత్రులకు నైజములు మృగమధురభణితు, లవి యథార్థీకరించి వారాయసముఁ బెంచి
యేలచెడిపోయెదవు సేవ నేఁ జెడెదనె, దహితు నిర్జింపు మాబుద్ధి నాదరింపు 243

క. నేరము ప్రత్యక్షంబై, చేరువ నుండంగ సంతసిల్లి సజారన్
దార న్సాధూక్తుల రథ, కారుఁడు శిరసావహించుకథ యిది యయ్యోన్. 244

క. అవనిని యరిమర్దనుఁ డా, యవనా లోకించి యోనతూర్ణ్వ యిది యె
ట్లనురాగంబునఁ జెపుమా, వినియెద నన నతఁడు లూకవిభునకు ననియెన్. 245

క. కేరళదేశంబున రథ, కారప్రముదామతల్లి గల దవ్యకచాం
భోరుహముఖి యుపజారీ, దారన్యసంబులకు వల్లిత్రాస్తై మెఱయున్. 246

ఉ. జాయకొంగుపత్తిడి యసభ్యులచేసుపుపంలు మన్మథ
ప్రేరితకోటి కేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారులకట్టుగొమ్మ యుపవల్లభసంపదపాంథబృందమం
దారము పల్లవాంగణనిధానము జానివిలాస మారయన్. 247

ఉ. క్రొవ్వినచన్నదోయికులుకు న్నునుబయ్యెదఁ దెల్పఁ జూచిన
న్రవ్వనఁ బర్వచూపులవదరు ల్చెదరం బటుపాంథమర్త్యముల్
ద్రవ్వ మెఱుంగుమేనిచెలగం బెడఁజేయక మాడఁ గోడెకాం
డ్రువ్విళులూఱ నూర మెఱను న్రథకారవధూటి నీటునన్. 248

చ. మెఱుఁగులఁ గ్రమ్మరించుకనుమించులు త్రొక్కనిచోట్లు ద్రొక్కఁ గ్రి
క్కిఱసినగుబ్బచన్ను లెడయీక విరోధులఁ జోక నొండొక
ర్లొఱయ నితంబబింబమున నొక్కఁ గయించుక జాఱఁగట్టుఁ గ
ట్టొఱపు ఘటింప నేగునలయుగ్మలి మారుపుటేటినీటికిన్. 249

సీ. అన్యాత్రిస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిగ్గారిహామో
హావేశత్తుభితుండు గానినయుఁ డిష్టాహాశసంచారని

ద్రాక్షైముఖ్యము లేనివాఁడు గృహకాంతాకాంతసంతానది
స్వావైరాగ్యనిరుండు గానిజమునఁ జెన్నఁగఁ లేఁడు లేఁ జొక్కఁడునఁ. 250

సీ. పలుమెఱుంగులు మోవిపై వటింపఁగఁ గేరి నవ్వ నొక్కసారి అవ్వనవ్వ
జారకర్ణగ్లాని చేర నారజముగా బలుకు నొక్కొక సారిపన్నిపలుకు
ముఖదృష్టియుఐమర్మములు గ్రుచ్చి పొరఁగఁజాచు నొక్కొక్కసారి మఱుకుఁజూపు
గిలుకుమెట్టెలఱంతు బెళుకుసంపాదింప నడుచు నొక్కొక్కసారి బెడఁగునడుపు

తే. పదముగా జాజాచేసితపనిఁడితేను, పోల్కఁ జూపట్టు దూతికపోలతలము
తమ్మరస మంటఁగఱచుఁబ్రాయంపుకలిమి, మరియు నొకసారి వక్షంగి మోహనాంగి.

సీ. ఏతెంతువనియు పొక్కడిపోయి మత్తాలిచూడ నాకట తొంగిచూడనయితి
చేసేఁత నపుడ యచ్చికబుచ్చికపుమాటలాడ నాతో మాటలాడనయితి
కమ్మోవిరుచులఁ జొక్కించి తింతియుముద్దుగుమ్మగుబ్బలజొమ్ము గుమ్మనయితి
వను నేకతమున రమ్మని యొప్పి రప్పించి తెఱవ యేటికిఁ దప్పఁ దెఱవవయితి

తే. నీకుఁ జనణానతుఁడ నైతి నేత్రజితచ కోరనన్నిచ్చలో నేఁకోరనయితి
వందు రాత్మప్రపంచకు లైనజారు, లెగరుతాఁకైన నన్నాడవదినెఁగూర్చి. 252

తే. పరుషటంకకుఠారసంభరణకరణ, జనితతాపదసక్లాంతకాంతి కాంత
హస్తములఁ దేర్చునొక్కొక్క యవసరమున, శైత్యభైషజ్యమున దానిచన్పుదోయి

క. కై సేసి బిడ్డపాపల,తో సందడిలేమి నొడలు నొవలుం బిఱుఁదిం
తేనికుచంబులు మెఱయుం, గా సుందరి పొతబొమ్మగతిఁ జూపట్టుఁగ 254

క. చెలిచెలువు తెరవుపెసగుం, బలె నా నాకథికభోగపాత్రంబై వ
రిలుచుండ దానిచెడుపో,కలు దెలిసెం బతికిఁ గొంత కాలంబునకుఁగ. 255

క. తెలిసి యొకనాఁడు వాఁడా, లలనాతిలకంబు తలతలం బట్టుకొనఁగ
వలయునని తలఁచి వెంగలి, కలికిం బరికించి నిర్వికారతఁ బలికెఁగ. 256

క. ఏలినయాకేరళనర,పాలుఁడు నా కానతిచ్చెఁ బయనము చాలఁగ
గాలవిళంబన మోమహి, కాలీం దెమ్ము సంబళముఁ గంబళముఁగ 257

క. వేఁయూరికిఁ జని యిట కై,దాఱుదినంబులకు వత్తు నద్దిననము లా
ఱ్ఱాఱుకుమీ నీసంగతి, జాఱుట నాకనినయోష సంతోషమునఁగ. 258

సీ. చివురువాతెర అచ్చసేయుఁబో వేఁయూరి యొసపరి గానిపల్లొత్తుకెంపు
తమిగుబ్బచంటిపాళిముడిగ్గుఁబో వింతగుమ్మవిమ్మటవ్రేలిగోరి తాఁకు
మోముదామరతావి ముదమందుఁబో క్రొత్తభోజాఁగుకస్తురిమక్కబొట్టుతేఁటి
చిన్నారిమేనవాసించుఁబో పొఱుగింటికిలికిమట్టము బొమ్ముకమ్మపూఁత

తే. తనచొక్కాటపుఁజెక్కుటద్దములఁ బ్రతిఫలించుచుఁబో లీలమగనిఁ గ్రమ్మించుచూపు
ప్రాంతపోరాటమెంతయుఁ బలుచెనసుచుఁ బొంగె లాస్యానీమ వస్లంగిలేను. 259

క. తలపేనుపంటిసందిది, పులుకాలనుముల్లు వస్త్రమున యూకకటి
స్ఖలితిఁటపాదరక్షుణ్, శిలవోలెం బ్రాఁతమగఁడు చే లెవ్వరికిన్. 260

ఆ. నెరసుతోడఁబోలె నేత్రంబు దుర్భర, వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లఁగతి వీనిఁబాసి యి, చ్చానురూపవృత్తి నగుదు నేను. 261

క. అనిమూఁపులు మూఁడై లా, లనరథకారునకు సంబళము గంబళి మి
చ్చి నిలిచి కుహనార్తి గడ, ల్కొన నప్పుడనిలిచి పేరుకొని పతికనియెన్. 262

ఉ. నిక్కువ మారికేగెదవె నీకు దయాపహితాత్ముఁడైనరా
జెక్కడఁగల్గె నిన్ను నొకయించుకసే పెడఁబాసి యుండలే
నిక్కడ నేను మాపిఱుఁద నిప్పుడనచ్చెదఁ దోడుకొంచుఁబొ
మ్మక్కట దీని నాహృదయ మక్కట నీపశమై చెలుంగవే. 263

క. నిమిషము దివసంబై దిన, సము నెలయై మాసకంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద, రమణా నీవదీయయోగరాహిత్యమునన్. 264

ఉ. ఈచెలువీశభావిభవ మీగుణ మీకమనీయవిగ్రహం
బీచతురత్వ మీగరిమ మేనుగవారికి లేదు చూచితిం
జూచితిఁ బ్రాణనాథ నినుఁ జూచినకన్నుల కాలుఁగాంతనా
రాచుఁడుఁ బట్టఁడీవు మగరాజవు రాజవు నిక్కమింతయున్. 265

ఉ. కేవలసాధనంబు లిరుగేల వహించి నటించు నమ్మహా
భావజునట్లు యుక్కటులిబాడిసయుం గొని నీవు మామకీ
నావసథంబున న్మెలఁగ నచ్చరచాడ్పునఁ గన్నులార్ప కిం
పావహిలంగఁ జూతు దరహాసపరిస్ఫురితాననాబ్జనై. 266

క. విశిఁగలమాణిక్యము వ, త్తడితోడం గూర్చినట్లు తినతో నిమసాం
పసరం గూర్చిన బ్రహ్మకుఁ, దపయుక చేయెత్తి మ్రొక్కెద మె ప్రాణేశా. 267

క. తపసినిఁ జత్తు న్వడి ని, క్కడి కత్తెమ్మనుచు ముచ్చ గన్నీరొలుకన్
బుడిబుడియేడ్పులతో న, వ్వెడమాయలప్రోవు మగనివీడ్కొల్పుటయున్. 268

ఉ. వంచనఁజేసి వాఁడు తలవాకిలి వెల్వడి పోయిపోయి య
స్తాచలకుంజకోటరమునం దినుఁ డేగినఁ డక్కబెట్టి యా
ముంచినచీకటి న్మసలి ముచ్చవలెం జొరఁబాఱి యింటిలో
మంచముక్రిందఁ దూఱుకొని మానముఁ గైకొనియుండె నంతటన్. 269

చేరికిఁ గలవాని సుమీ, కాతాళము గాదు నీకు ఘనుఁ డాతనికిన్. 281

ఉ. ఒంపనసేల వామనయనియొద్ద రమించుట యింద్రభోగమై
యుండునరో యనుంగువిభుఁ డూరికిఁ బోవు టెఱింగి యొంటి ని
ట్లుండఁగ వచ్చి పట్టికొని యోరిదురాత్మక సిగ్గుగొంటి వీ
వెంపయుఁ బోలె వేఁడి ఘటియింపదె నాకిటునంటికూరిమిన్. 282

ఉ. రాచపను ల్వహించి వెలరాచకుమారునివంటిదేవుఁ డ
య్యో చని కాళ్ళలో వరిగె నూరికి నెప్పుడు వచ్చువాఁడు లే
లే చవిగావు కండ్లు పెకలింపుచు నున్నవి ప్రాణవల్లభుం
జూచినదాఁక యొట్లునిలుచుం దనువెట్లు సహించియుండుగన్. 283

శా. కాయం బెక్కడనుండెనేమి వనితాకంపమ్పుఁ బ్రాణేశ్వరుం
బాయంజాలవు ప్రాణము ల్మనసురుబ్బాయాళ్ళుగాఁ జేయుచున్
డాయ న్వచ్చుఁగదా పయోధరము లంటం గౌఁగిటం జేర్చి యా
చాయం బైకొని చెక్కునొక్కు రతిరాజ్యశ్రీలఁ దేలింపుగన్. 284

చ. అగునగు బైసిమాలిచితినంచు విజృంభణావృత్తి నివ్విధి
న్వాసగయనిమాటలం జెవులు సూఁడను నైఁచినదానఁ గాను నా
మగనికి నిన్నువంటికొఅమాలినమానుసులీడె *ధర్త్రతోఁ
దెగి యొడబ్రత్యకం బ్రదికితే మని యైనునై సుఖింతెదన్. 285

చ. అనుతనుమధ్యభాషితము లారథకారుఁడు నాదరంబుగా
విని యిది నాయెడం బ్రణయవిశ్రుతయౌ నటుగాకయుండినన్
నను ననుకూలుఁ డంచు నుపనాథునితోడ శతావనంబుల
న్వినుతి యొనర్చునే పరభవింపక చంపక కాతు మెచ్చితిన్. 286

ఉ. ఏను బ్రవాసినై యెఱిఁగి యింతట నంతట నాకుమా రెవ
ర్లని దెఱంగి కన్గొని చలింపక వీఁడిలుసొచ్చి యుద్ధతుం
డై నిలుపోవలేక కదియుంబడెఁ గాఁతిలు రోఁతిలంమ ల
జ్జానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్. 287

ఉ. చిక్కితి వీనిచేత రొదసేయుట సిగ్గులచేటు పొంగుచుం
జొక్కక వేగ నిల్వెడలఁ జూడఁడు మచ్చటఁ దీర్పకున్న నేఁ
డుక్కున నేమిసేయుదు భయోదయ మయ్యెడునంచు నోడి యా
చక్కెరముద్దుగుమ్మ సరసప్రియభావుల నింపొనర్చెడున్. 288

* ధర్త్రకుం దెగి యొడబ్రవ్వకం బ్రదుకదే యని పాఠాంతరము.

క. అతివా నారతిలో నీ, పతిరతిలో నిష్టమెద్దిపలుకం దగువం
చితఁ దడిగిన హితరూపా, న్వితుఁడని నన్నబల పొగడె వినిం దెగడెన్. 289

ఉ. పంచన యిప్పు డీతులనవంకజనించె జనించుఁగాక యీ
చంచలనేత్రి నాయెడఁ బ్రసన్నమనోరథ దీనిమాటలన్
గాంచితి మోదమంచు రథకారుఁడు వేగ సజారదారతో
మంచము నెత్తికెత్తుకొని మంజుగతిం జని వాడవాడకున్. 290

ఉ. వాకొని యెంతశాంత యెటువంటిసతివ్రత యెంతయుత్తమ
శ్లోకవివేకరాశి యనుచుం బ్రియ నెన్నుచు హస్తతాళమా
నైకలఘుప్రచారగతి నాడెఁ బ్రహాసవిలాసవక్త్రులై
మూఁకలుగట్టి నాగరికముఖ్యులుఁ దన్బరికించి నవ్వఁగన్. 291

వ. ఇచ్చరిత్రంబు సాపరాధుం డగుచిరంజీవిం జేపట్టిన నీ కుదాహరణం బగు నని రక్తాక్షుండు చెప్పిన నప్పలుకు లాదరింపక నులూకేశ్వరుం డూరకుండె నంత నయ్యభిప్రాయ మరసి. 292

క. తనకు నులూకత్రాసము, మనుగడ కుపహతియునబహుమానత్వము లే
దని తెలిసి తెలివిఁ గలయా, వనమునఁ జిరజీవి ఘూకనాథుని కనియెన్. 293

క. నీరిపుచే నూరక యిప, ధీరతఁ గాంచితి జగద్విదితమతి నయ్యున్
గ్రూరాగ్ని కాహుతిగ దను, ధారణ మిఁకఁ జాలు వేల్చెదం బ్రాణంబుల్. 294

క. నావిని రక్తాక్షుఁడు చిర, జీవిం బరికించి చచ్చి చేసెడుపనియే
మీ వివరపుట్టఁ జెపుమా, నీవనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. 295

క. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి యులూకయోనిఁ బుట్టి బలిమిమైఁ
గాకముల గర్వరేఖా, స్తోకములం ద్రుంతు మనసుతుందుడుకాఱన్. 296

వ. అనిన విని రక్తాక్షుండు. 297

క. లోకదృశుఘనసమీరను, హోకుఘరంబులనరింతు నని కాదా పూ
ర్వాకృతికి వచ్చె నొక్కతె, కాకికి నీకేల కౌశికత్వము గల్గున్. 298

క. అనురక్తాక్షునిఁ గనుఁగొని, ఘనుఁ డచ్చిరజీవి పలికె గాఢప్రజ్ఞా
ధన వినఁగోరితి నిక్కథ, యనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 299

సీ. శైలభూహితసదాంగదమాత్తికచ్ఛాయ విధికమండలుసమన్వితమరాళి
మారారిమకుటమందారమాలిక విష్ణుత్కృష్టధేనుక్షరత్క్షీరధార
సాధుజీవంజీవచంద్రికసగరజస్ఫాటికస్వర్గసోపానపంక్తి
చిఁతపోవిత్తసంచితభగీరథకీర్తి వారాశిప్రాదయకరూపవర్చ

తే. పరుషవాసిష్ఠశాపసంప్రాప్యమాణ, మిత్రసహపుత్ర గీర్వాణశత్రువేష
సముదితక్లాంతిహృతిసమ్యగమృతవృష్టి, గంగ పొగడంగ నెగడు శంగ త్తిరంగ 300

సీ. తజ్జలంబుల నొక్కతపసి యాస్వాదింప శయపుటం బల్లనఁ జాఁపుచోటఁ
దటకుటానిలనటద్విటపకాండనిషణ్ణ ఘనగృధ్రచంచునిర్గళిత యగుచు
మూషికపడియె నమ్ముని దానినిజతపోమహిమ నొక్క మనోజ్ఞమహిళఁజేసి
కన్నకూఁతునకంటెఁ గడుగారవంబునఁ బోషింప నొకకొన్నిపూఁటలకును

ఆ. గుఱులుగూడె మేను మెఱుఁగెక్కెఁ బాలిండ్లు, బయలు మెఱసెఁ బిఱుఁదుబలిసె నడలు
ముదిప మెఱిఁగె సిగ్గుమోమున నివుఁరొత్తెఁ, దోయజాస్య కంరుఁ బ్రాయమైన.

క. కలితరుచిమించునింమన, ఫలముంబలె నూఁగునూఁగుఁబ్రాయము చెలిపై
నిలువం గని ముని మనుపీ, వలనని తలపోసి నధికవాత్సల్యమునన్. 302

క. ప్రతినూతనర్తువేళా, న్వితరెయివ్వతె యన్వథుంటి వ్యాలి యగు న్ద
త్సతిపాణిగ్రహణముఁగా, మతిఁ దఁగరు సుమతులు నభిమతిమై యునికిన్. 303

వ. ఇంతపమున్న వివాహంబు సేయలేనైతి నిచ్చిపుచ్చుకొనువారికిఁ గులధనాది గౌరవంబులు సదృశంబులునయిన ననురాగంబు పెరుగుగూఁక యౌవనాదులు పరస్పరానురూపంబు లయియుండిన సతిపతులకుఁ బ్రేమానురంబులు వృద్ధిబొందుఁ గావున నిప్పనజగంధి మహానుభావుండగు సూర్యదేవునకుం బరిణయంబు సేసెద నని యమ్ముని తిగ్మధాము నాకర్షించి. 304

సీ. తనునోరఁ జేరఁగ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాఁ డఘముఁ బ్రచ్చువాఁడు
పరరాజసంబాధ విరియుచ క్రముల రక్షించువాఁ డిఱులశిక్షించువాఁడు
వేదాంత శుద్ధాంత వీధుల నోలగంబుండువాఁ డాపద ల్చెండువాఁడు
దుష్టమందేహ సందోహంబు నెలగోలు తరమువాఁడు మురారితరమువాఁడు

తే. సంప్రదోషపచన్నిస్రతిజలదరించు, నవనిజనులకు దృష్టిపాటనము నిచ్చి
మించువాఁ డెల్లదిశల దీపించువాఁడు, సారసాప్తుండు మునికి సాక్షాత్కరించె.

చ. ముని యలతీవ్రధాముని సముజ్జ్వలధామునిఁ బూజసేసి యి
ట్లను దిననాథ యిక్కసలయాధర పెంపుడుబిడ్డ నాకు నీ
కెన సుముహూర్తవేళ వరియింపుము నీకిదె యిత్తునన్న న
వ్వనరుహబాంధవుండు శ్రుతవంతుఁ బ్రశాంతునిఁ జూచి యిట్లనున్. 306

తే. అనఘ నాకన్నఁ బర్జన్యుఁ డధికుఁ డగ్ర, సంచరణంబున నను నిరోధించుఁ గాన
నమ్మహాత్మున కీకన్య నఖిలమాన్యఁ, బరిణయము సేయు మదినీకుఁ బరమశుభము.

క. అనిచెప్పి తపనుఁ డరిగిన, ననఘుం బర్జన్యు నంత నాకర్షింపన్
జనుదెంచి నిలిచె నతఁ డమ్ముని యావేల్పునకు నెయ్యమున నిట్లనియెన్. 308

కారతఁ గాలకాంతు పొసఁగ న్నిజకార్య మొనర్చు గాంచిన
జ్యారవదేవదత్తరవసంక్షుభితాష్టహరిత్కరిశ్రుతి
ద్వారుఁడు క్రీడి మత్స్యపురి నాఁడు బృహన్నలయై నటింపఁడే. 328

చ. ఒకదెసఁ గార్యదాహమున నుండక యేరికినైనఁ దీఱదం
తకనిగ్రహసత్త్వుఁ డాదరణధామకటాక్షుఁ డఖండవిక్రమా
ధికుఁడు విలాసవిశ్రమణదేశము మాద్రికిఁ దొల్తపుత్త్రుఁ డా
నకులుఁడు మత్స్యరాజభవనంబున సాహిణియై చరింపఁడే. 329

చ. భుజబలశాలి నీతిపరిపూర్ణుఁడు రూపవిలాసవారిజ
ధ్వజుఁడు హరిజ్జయాభిముఖదర్పుఁ డతిప్రియభాషుఁ డాశ్రిత
ద్విజనిధి కార్యదాహనిరతి న్నిజవేషముఁ గప్పిపుచ్చి గో
వ్రజములఁ గాచువాఁడయి విరాటుపురి న్సహదేవుఁ డుండఁడే. 330

ఉ. కాలము దాఁట నెవ్వరిలఁ గాల్గలవారలు వారిరాశికి
లాలపరీతభూతవిపులాన్వయరాజముఖీశిరస్థ
స్థాలఘురత్నభానునికపాతిసమున్నపదంఘ్రిపద్మపాం
చాలతనూజ తొత్తుపని సల్పదె దైవగతి న్సుధేష్ణకున్. 331

వ. అనిచెప్పి బాష్పనిష్పీడితాక్షుండై వాయసాధ్యక్షుండు చిరజీవి నాలోకించి, 332

క. పరదేశ మఖిలము౽ఖా, కరము మదీయోపదేశగమ్యుఁడవై కా
ర్యరథసముకోర్చి రిపురం, బిరమున నెబ్బంగి నుండితివి చిరజీవీ. 333

క. ఘూకములు చెరఁడ ఘూక, క్ష్మాకాంతుఁడు గౌరవంబు సలుపఁగ బ్రతిప
క్షౌకమున మంటి విద్దశ, నాకతమున నీకుఁ గలిగెనా చిరజీవీ. 334

సీ. అని విన్నవయిన వాయసరాజు నీక్షించి యచ్చిరజీవి యిట్లనియె మత్స్వ
తరువున నీయాజ్ఞఁ దలమోచి యేనుండుతఱి మదాంధదివాంధతతులు వచ్చి
కెలఁకు లీక్షించి మీపాలకుఁ బ లేకున్న తెరలివచ్చినత్రోవ మరలిచనఁగ
నున్నకన్నెఱిఁగి నేనొకశబ్ద మొనరించి క్రమ్మఱించితిఁ గార్యకరణబుద్ధి

ఆ. నపుడు వికృతమూర్తినైయున్న నన్నులూకములు గాంచి యెఱుఁగుఁ గానఁ దొలుత
నింపుకలిమి సంహరింపక నొంపక, నాదరమున భర్త కప్పగించె. 335

వ. అప్పుడు ఘూకవల్లభుండు నన్నుం జూచి నీ వెవ్వండవని యడిగిన మేఘవర్ణు
నకు ముఖ్యదండనాథుండ నగు చిరజీవి నని చెప్పితి నప్పలుకులు విని మంత్రులరా
వించి మంత్రకూటంబున నన్నుం జూపి యితని కుచితం బగుకార్యం బొక్కరొక్కరు
చెప్పుండనిన నందు రక్తాక్షుండనువాఁ డొక్కరుండు దక్కఁ దక్కిన వారందఱు
నాపక్షంబ పలికిరి రాజును వారివాక్యంబు లంగీకరించి నీతిదక్షుండగు రక్తాక్షుని

దెస నాదరణంబు సేయం డయ్యెఁ గాలపక్వంబున నట్టిద. 336

క. జనియింపం గలకార్యము, మనమున దగ నిశ్చయించి మంత్రి సురీతిన్
వినిపించిన వినకొల్లని, చెనఁటికి ముకుబంటిగాదె చేటుం గాటున్. 337

తే. గగనమంటిన దోషాగ్నిగాఢకాంతి, నీరమున శీతలము సేయ నేర్చుమంత్రి
చిరహితారంభపరుఁ డైనసేవకుండుఁ, గార్యనిర్వాహకులు నూవె కరటముఖ్య.

క. తానెంత కార్యపారగుఁ, డైనరహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానకి నేకార్యంబుం, బూనందగ దుద్ధతప్రభుత్వప్రజ్ఞన్. 339

ఉ. ముప్పదిమూఁడుగోట్ల సుమూర్తులవేల్పుల నేలువజ్రియు
న్నప్పు మనార్యశౌర్యకరుణాదులపట్టున నిందుకేనియున్
జెప్పనివాఁడె యట్టినయశాలి బృహస్పతిగోపనంబునం
జెప్పినపంపుసేయక విశృంఖలవృత్తిఁ జరింప నేర్చునే. 340

క. కావున రక్తాక్షుఁడు నయ, కోవిదుఁ డమ్మంత్రిమాట గురుమంత్రముగా
భావింపలేక కోటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మంబయ్యెన్. 341

చ. అరయఁగ దుష్టమంత్రినివహం బను వారము గల్గియుండ నే
పురుషు ననీతిదోషములు పొందవు రోగములే యపథ్యబం
ధురుఁ గలఁగింప వేజనునిఁ ద్రుంపదు మృత్యువు లక్ష్మియెవ్వనిన్
జిరమదగర్వదర్పితునిఁ జేయదు పైకొనవేరి నాపదల్. 342

వ. లోభికిఁ గీర్తియు ఖలునకు మైత్రియు నష్టక్రియునకుఁ గులంబును ధనార్జనతత్పరునకు ధర్మంబును వలసునకు విద్యయు గృపణునకు సౌఖ్యంబును బ్రమత్తసచివుం డగు జగతీపతికి రాజ్యంబును లేదు వెండియు నీరసేంధనంబుల వహ్నియు మూర్ఖులందు శోకంబును జపలచిత్తులయందు గోపంబును గాంతలందు విత్తంబును దయావంతులందు ధర్మంబును మహాత్ములయందు ధైర్యంబును వృద్ధిఁబొందు నది యట్లుండె. 343

క. వలవగువంతకు బగతుం, దలనిడుకొని తిరుగునీతితత్త్వజ్ఞుఁడు మున్
జిలువయొకం డట్టిదయై, మలుగందిన దే యనేకమండూకములన్. 344

క. అనినవిని మేఘవర్ణుం, డనురాగరసాబ్ధి నోలలాడుచు విద్యా
ఖనికా యిట్టికథ చెపు, మను డచ్చిరజీవి వాయసాగ్రణి కనియెన్. 345

సీ. విను పూర్వమున మందవిదుఁ డనుకాలాహి యాహారకాంక్ష నహార్నిశమున
బఱచి యొండొకచోట బహుభేకకలకల ప్రతిభిన్నసకలదిగ్భాగమైన
హ్రదము గన్గొని లోనికరుగ నెద్దిక్కున దెసవుగానక తీరధరణినిల్చి
కుంభిని ఫణమూదికొని డిల్లచెడినట్లు పరవశుగతి రుగ్ణుపగిదియుండఁ

తే. బలిమి మండూకపతి మహాఘణిపతింప, ప్రాణములు లోచనంబుల బయలుపఱచి
యొఱఁది యొల్లక యిట్టుండ నేల నేల, చింతలేమిటి నీవి భక్షింపరాదె 346

క. తలఁద్రిప్పక మ్రింగుచు నే,బలము మహాబలుని యంతవాని వయోనీ
కలఁతింబడ నేకార్యము, గలిగనో కో యన్నఁ బన్నగం బిట్లనియెన్. 347

తే. ఓదయానిధి దైవోపపాదితుండ, నైన నాకేల దొరకు నాహార ముఱక
నొరులు వెట్టినదనుక బస్తుండవలయుఁ, దనకు నావుడు మఱియు నద్దర్దురంబు. 348

క. అనిలాశనవల్లభ చె,ప్పు నహో చిత్రంబు వస్తు పారణ లుండన్
వినరం గారణమున్నను, వినియెద జెప్పుమనిన మందవిషుఁ డిట్లనియెన్. 349

క. కేవల మాహారేచ్ఛం, బోవఁగ నొకనాఁటి రేయి భోగం బద్రువం
గావడి ద్రొక్కిన నొకభూ, దేవకుమారకునిఁ గఱిచితిని బడలుపడన్. 350

క. కాటుపడి భీతిఁ గాయం, బూటాడంబరచి జనకునూరుద్వితయా
స్ఫోటితము స్తనుఁడై శిశు, వేటుపడిన కురరివోలె నేడ్చుచునుండెన్. 351

క. అనలునలముద్దుపట్టిం, జడియుసుమని వీపుబఱచి జనకుం డురమం
దిడికొని మునుగడ పుడమిం, గడునడకువ నున్ననన్ను గని కోపమునన్. 352

క. వసుధామరుఁ డిట్లను వెలి, విసరిన తమిసోరి విసపువిత్తానోర
పసనాడెఁ గటకటా యి, క్కసుగంగుం గుందులేక కరవన్ బంపన్. 353

ఆ. కుటిలగతికిఁ బుట్టుగుడ్డికి ననుదిన, శ్రుతివిహీనవరును గ్రూరమతికి
పాపజాతికేలప్రాపించుఁ బరహితా, చరణవిద్య నిన్ను నైఁపఁదగునె. 354

చ. కడుదొడుసైన యిగ్గురితకర్మము నిన్నొని ముంచుగాక యొ
క్కఁడుఁ జననిమ్ముఁ బుట్టపురుగా కొఱగ కెపు పస్వతంత్రతన్
మడుఁగు భజించి భేకముల మస్తమున న్భరియించి కొల్చి యొ
ప్పు డవి దయామతిం గడుపు పోయఁగనుండు పాకారిసొమ్మనన్. 355

క. ధారాళచింత నంతం, గ్రూరతచెడి మిమ్ము మోచికొని తిరుగంగా
నోరాజా వచ్చితి నా,హారము మీరిడక లేదయా నాకనుచున్. 356

క. ఆరోహణకౌతూహల, సౌరభ్యము మోసులొత్తి జలపాదుఁడు దు
ష్టోరగభాషణములు మా,యారూపము లనక నిజము లని తనలోనన్. 357

క. తలఁచి యలచిలువకిట్లను, వెలకొనినను గొలువనిలువ నీహృదయమువం
గలిగిన నాహారం బిడి, తలకుం గ్రొవ్వెక్క నడపెద న్నే ననుడున్. 358

ఉ. మందవిషుండు కప్ప దనమాయకు లోనయి చిక్కె నంచు నా
నందమునొంది భేకముల భ్రమణాదులు నాకులేవు నీ

కందువచేరి భోగఫలకంబున నీపదము ల్వహించి యేం
దుం దుదిముట్టనందనుకఁ ద్రోవక దగ్గఱఁ జేర్చుకొమ్మటన్. 359

క. నను విశ్వసింపు మిప్పటి, కనుమానము మాను చచ్చువంతకు నెందుం
జనవని దేవరనగరికి, దనపేరం గష్టకష్టదం గొనుమనుమన్. 360

ఆ. కడుపుఁజూపి చావగా నింక నెన్నఁడు, వడుపుకొనియె దనుమ చెనుగుఁబురుగు
చెప్పరాని ప్రియముఁ జెప్పినహృదయంబు,గరఁగి భేకరాజు తెరువుచూపి, 361

క. ఆరోహింపఁగవలె గృ,ష్ణోరగ యీసరియువెంట నొద్దికఁ జనుదె
మ్మా రయమున ననుటయు ని,ర్వారణనది సొచ్చి కదియ వచ్చెం గప్పన్. 362

క. అప్పు డనురాగమొప్పం, గుప్పలుగొని క్రోతిగొమ్మగొన్నట్లు పడం
గుప్పించి కప్ప లేఁడ, ప్పప్పఫణిప్రవరుభోగ మారోహించెన్ 363

క. జలపాదుని వాదుకొనం, దలనిడికొని త్రాఁచు సేచునటనం దటభూ
ములకొంతసేపు ద్రిమ్మరి, యలసినగతి నూరకుండె నట్లుండుటయున్. 364

ఉ. పన్నగభర్తఁజూచి జలపాదుఁడు పల్కెనిదేమి వేగసం
పన్నము గాకయున్నయది మందవిషా భవదీయవిగ్రహం
బన్నభుజంగ మిట్లను దయామయ యాఁకటదీలుపడ్డ నా
కెన్నదె యానశక్తి కడు పోమినమీఁదటఁ జూడు చిత్రముల్. 365

క. దొరలు తమవేడుకల జా,తురగాని వహించి తిరుగు తురగంబులఁ బ్రో
వరు మేపునీళ్ళతఁజినిడి, యరుదివ్విధ మనిన దర్దురాగ్రణి మదిలోన్. 366

క. కలతెర గిట్టిద యనుచుం, దలఁచి యహో విప్రశాపదశ దనయిచ్చన్
వలసిన యాహారము గొన, గలుగమి నిచ్చలును నొచ్చెగద యకటకటా. 367

క. భారవహం బిదిలేదా, హారము నే నిడక కటికి యాఁకట నిపుడే
కారెడునిట్లుండిన నా, యారోహణ కేళి యే క్రియం గొనసాగున్. 368

చ. అని తలపోసి మందవిషు నారసి యజ్జలపాదుఁ డిట్లనున్
ననుఁ దలఁదాల్చి యాడఁజవనంబువలెం జరరావలంబురాఁ
జిన యపుడెల్లఁ గప్పల విశృంఖలవృత్తి భుజించి లావుగై
కొని విహరింపుభోగికులకుంజర నాదములన్ బ్రహ్లాదంబునన్. 369

వ. అని నిరప్పణగాఁ గప్పలఁ దేదు సెలవిచ్చిన బలవంత ముగుట సీరంబున నవర్గళ
ప్రచారంబునం బేరెంబులు వాఱుచు నొడిసియొడిసి బడబుపడం గఱచి కిముకు
కిముకురవక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులం భక్షించి.

క. తలవంటి పట్టుకొని చి,ప్పలు విరిగి పడంకుచున్నవాని సహో యయ
జ్జలపాదు విడిచి రోషా,విష్టమానసుఁ డగుచు మందవిషుఁ డిట్లనియెన్. 371

క. తగుచో భోగశిరోమణి, నగుచో లోకైకవీర నలఁగి యరుదెంచినఁ దై
వెగురుకొనఁ గొండయొక్కెడ, దగ రొక్కెడ యిలని తారతమ్యం బరయన్. 372

క. నలఁకువ ధర నెవ్వరికిం, గలయతియు మహాబలారిగా యితఁడెంతయుం
దలఁపక గౌరవమింతయు, సలుపక వను నసదునేయుజను నే నీకున్. 373

క. అతిమణిఘృణిసంభరణో, చిత మగు నాఘనము కష్టశిలా నీకు
త్సితపుటడుగులకు వర్షా, మె, తతినిక్క నలాఱ మ్రింగెడ న్నిన్నమున్. 374

క. పడి నోడిసిపట్టుకొని దెస, పడ నోడలుం దోడలు బడలుపడ నొక్కి ముదం
బడర దిగమ్రింగి యిలసిన, కడ కరిగె న్మందవిషుఁడు కాకాధ్యక్షా. 375

వ. ఏ నమ్మందవిషుచందంబున నవమానంబున కోర్చి ప్రతిపక్షక్షయం బాపాదించితి
నని చెప్పి చిరజీవి మఱియు మేఘవర్ణున కిట్లనియె. 376

క. మూలముల జెఱుప వనల, జ్వాలలు తరువులనకాని చందనశైత్య
శ్రీల మగుగాడ్పు చెఱుచు, న్మూలంబులతోన వృక్షముల శీఘ్రమునన్. 377

క. ధనమున ఋణశేషము సా, ధనముల రిపుశేష మౌషధంబునఁ దనుసం
జనితగదశేష ముదకంబున శిఖిశేషం బశేషముగఁ జేయఁదగున్. 378

చ. ముడిపడియున్న దుర్వ్యసనము న్సడలించి దురంతరోషపుం
గడలి కుశాంతి సేతువునఁ గట్టి సమాసమదేశకాలముల్
కడఁగని చిత్రగుప్తి పొసఁగ న్మనుజేనికి వేయునేల యి
ప్పుడమిఁ గరస్థలామలకముల్గద సంపదలు న్నృభంబులున్. 379

క. శరములఁ బవరుమనీషా, శరములఁ బడినట్లు రిపులు సమరమువలయున్
శరములకు వలను ప్రజ్ఞా, శరములకుం గ్రాహ్యమెద్ది సరియారంటన్. 380

క. అంఁతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్లపనులౌదగు మహా
బలుల కది లేకయుండినఁ, బలుకులు వేయేల కడమవచు సర్వంబున్. 381

వ. సుచరితఫలంబులంగాక సకలకార్యంబులు చేకూడవు త్యాగంబున శూరుండును
వైదుష్యంబునం బ్రియుండును గుణంబుల లుబ్ధుండును నగుచు రాజు రాజ్యంబు
గావింపవలయు నిందొక్కటితక్కినం బురుషాకారంబు నిరర్థకం బని వెండు మఱి
యుట్టిద. 382

సీ. ఘనమాపనిధి యవంగునకా జఁనంత్వ ముచితమే బలి కహివ్యూహవసతి
పాండునందనునకా బహుకాలవనవాస మిథిపురాధిపునకా యేటిచోరవ
యనుకులాగ్ర్యతునకా శాపమరణంబు జాహ్నవీసుతునకా శస్త్రశయ్య
వలరాజునకా మహావసపాకభజనంబు నహుషునకా ఘోరనాగమూర్తి

తే. మతిత్రిశంకునకా పచ్చిమాలతినము, ద్రుపదనందనకా రాచతొత్తుపాటు
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁ డరయ, నీశ్వరుఁడు గాక సమకూర్పనిట్టిపనులు.

వ. ఇదియెఱిఁగి ప్రజ్ఞాన్యాయంబు లేమఱక యుండవలయు దైవబలంబు గలవాఁడవ
గుట నీకు శీఘ్రకాలంబునఁ గార్యసిద్ధియయ్యె నిరమిత్రుండవయితి ప్రాప్తమి
త్రుండవయితి వింకఁ బ్రాజ్యవైభవంబున రాజ్యంబు సేయుమని చిరజీవి చెప్పిన
మేఘవర్ణుండు సకలసంపత్పరిపూర్ణుండై రాజ్యభోగంబు లనుభవింపుచుండె. 384

క. అని చెప్పిన ధరణీవర, తనయులు నిజగురునిఁ జూచి తాత్త్వికముఖ్యా
వినఁ బ్రియమయ్యెడు జెపుమా, యనువారఁ జతుర్థతంత్ర మని యడుగుటయున్.

చ. అతనుభయంకరైకవిషమాంబకసమ్యగినంతభోగసం
గతవిగతాంతరాయగతి గాఢవినాయకపత్తచిత్తజా
దృతిబహుపద్మజాండమణిదీపితకుక్షికరంకమందరీ
కృతపరతత్త్వవిజ్జటిమృగేంద్రవికస్వరయోగపుష్కరా. 386

క. రంగత్తిరజాతమహా, గాంగేయస్తవనఘటితఘనపులకాయ
త్తాంగనిచోళయమప్రా, క్రంగస్థమహ్యసంచరన్నైలూషా. 387

మాలిని. కలుషమశకధూమా క్లాంతచింతామగామా
ప్రశయకరణరోషా ప్రాణిసంగుప్తితోషా
విలసదచలధర్మా విశ్రుతశ్రౌతకర్మా
కులధిధజనలోలా సుస్థిరశ్రీవిలాసా. 388

గద్య. ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకల
సుకవికృతకైవారభాషణోల్లాస రాజకులపారావార పర్వ శర్వరీరమణ నీతిశాస్త్రమార్గ
పరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృత నీహార పర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్ర
బంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతం బైన
పంచతంత్రంబున సంధివిగ్రహం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# పంచతంత్రము.

## చతుర్థాశ్వాసము.



శ్రీసత్యాలోకనజని
తాసమశరకరణసంభ్రమాధికనరక
త్రాసవిధిప్రాభరణా
భ్యాసభుజార్గళసనాథ హరిహరనాథా. 1

వ. దేవా లబ్ధనాశనాభిధానచతుర్థతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రుం డవిష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. పరకపటాలాపపరం, పరకేర్పడ భ్రమసి విడుచు ప్రాప్తార్థముగా
పురుషుఁడు విడువఁడె మును సాగరమునఁ గపికింశుమారకము గృష్ణని తెఱఁగా. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రవతంసుఁ బలికి రది యెట్లు నయ
ప్రావీణ్యా యాకథ సెప్పుమా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెఁ. 4

సీ. నీరదపథికపానీయనికేతంబు మేదినీయువతికిఁ జీరుకూల
మంబరచరవరాఖ్యనహారసత్రంబు సరిదలంకృతికార్యకరణశాలి
కార్పణ్యభయదవీక్షణవధూజనికర్త రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాకనిసర్గశుభదాయి నిస్తులరత్నపూర్తి తకళంక

తే. ముగ్రశరధారాధారాసమగ్రభీతి, పరవశాగత బహుకుభృద్భరణనిపుణ
మతనుసత్వ మలక్ష్మితౌర్వానలంబు, వఱలు దక్షిణశరధిసర్వజ్ఞశరధి. 5

సీ. ఇమ్మహాగాంభీర్య మెవ్వనికిఁ దవు నీవాహినీభరణ మెవ్వనికిఁ గలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీయనిమిషావాప్తి యెవ్వరికిఁ దొరకు
నీసత్యసౌభాగ్య మెవ్వనికెసఁగు నీఘనహీంతాచరణ మెవ్వనికి నొదగు
నీగాఢజీవన మెవ్వనికుండు నీకనకరత్నోర్మ్యు లెవ్వనికి వశము

తే. నీలలితరాజసన్మాన మెవ్వనికి లభించు నెవ్వని కిట్టిదియొప్పిదము నిత్య
మూతనికి కాక యని లోకు లభినుతింపఁ, గ్రాలుచు నిర్ఝరవిభుఁ డాపగావిభుండు. 6

క. అపరిమితం బుడుపతర, ణ్యుపసక్తం బఖిలజలధరోపాస్యం బా
త్మపదస్థానిమిషంబు, ద్విపులాక్షోమం బనంతవిధ మెఱఁగించున్. 7

క. ఆనీరధితటమున బహు, మానుం డనువాఁడు వృద్ధమర్కటుఁడు మహా
వానరులు ముఖరక్షత్ర, స్థానరులు భజింప సుముఖుఁడై వర్తిల్లున్. 8

ఉ. వానికిఁ గంటిలో నెరసునంటివిరోధి సమీపపర్వత
స్థానమునం జయోన్ముఖుఁడు తామ్రముఖుండు చరించు నమ్మహా
వానరసార్వభౌముఁడు ప్లవజ్జనసంగబహుప్లవంగసే
నానతగోత్రుఁడౌచు నొకనాఁడు సమిత్కరణేచ్ఛ వచ్చినన్. 9

క. కైకొనఁగలబహుమానుం, డాకంఠక్రోధవివశుఁడై ప్రతివీరా
నీకినిపై బలధిక్కృత, నాకపుల న్గపులఁ బనిచిన న్నిశ్శంకన్. 10

క. ఆహవ మొనరించె నము, త్సాహత నిరువాఁగు దోషరి దంతాదంతిన్
బాహాబాహిముఖాముఖి, వాహావాజ్ముఖరథవర మై నధి మొప్పన్. 11

శా. లావు ల్పేర్కొని నొంతు రుర్విఁ బిడికిళ్ళం ద్రెళ్ళ పాశ్వ్యాచల
గ్రావంబు ల్పెకలించి ఱువ్వుదురు ప్రగ్ర్యాగ్ర ప్రత్యాగ్రశా
ఖావర్గంబుల నెత్తి మొత్తుదురు స్రుక్కం జిక్కఁ గంఠచ్ఛటల్
గావుంబ్పట్టుదు రొండొరు ల్మదమునంగం బ్రుంగ నవ్వానరుల్. 12

క. చఱతురు పెడచేతులనోఁ, గఱతురు తెరనోళ్ళఁ బిసితఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు, పఱిబోవనికలిమి బలిమిఁ బ్లవగాధ్యక్షుల్. 13

క. విపసము నెఱసాహసమున్, బురిగొన నిట్లుభయసైన్యములు పోర న్ర
క్తరసతరసములు గదురఁగ, శరనిధిసత్త్వములు వెలివిపరి రాఁ దొడఁగెన్. 14

వ. ఆప్లవంగసంగరం బావిష్కృతారుణంబు నవ్యక్తతారకంబు నగుచు నహర్ముఖం
బును లంఘితాగమనంబు లంఘితశ్మశ్రురోమంబు నగుచు బాధకర్మంబును నదృ
ష్టశాస్త్రంబు ననక్షతపరికరంబు నగుచు యౌవనవివాహంబును బరిభ్రంశితచరణం
బుం బ్రణష్టపళీవిలాసంబు నగుచుఁ గుకవికవిత్వంబును ననుకరించె. 15

క. అంతఁ దనఘనబలంబులు, పంతము దిగనాడి యోడి పఱచిన సంప
ర్భాంతకుఁడన బహుమానుఁడు, తాం తేజరతామ్రముఖపతాకినిఁ దోలెన్. 16

తే. అప్పు డూర్ధ్వశిఖుం డైన యనిలసఖుఁడు, పోలె మత్తామ్రముఖుఁడు మూపులతిస్ఫు
లింగసంఘాత ముదయింప నింగినింగి, దాఁకుచుం బావ బహుమానుఁ దాపసించి. 17

వ. తత్తిమివధింప శత్రుననుఁ దానసమీకసమీకరంతయై
యుత్తిముఖిఁ బల్కెఁ నోరిజ్ఞరతా పెఱతావ్రనకేను నాబలం

వెదకఁగియుఁ జూచెనుదయపుడీ వన నబ్బహుమానుఁ డోరి ద
బ్బఱలకు రాకు తాఁకువెనపల్కుల కోర్చినవాఁడఁగాఁ జామీ. 18

క. పందమఁ గాక పలాయన, కందళితసాహసునియందు గలుగునె యని మి
న్నందినకోపంబున నై, చెం దామ్రముఖుండు పుల్లనిల శిలనలుకన్. 19

క. మఱియొకకపటవిటపంబునఁ, జఱచి ఘనక్రోధదృష్టి సమకొనముష్టిన్
బఱియుపడ నురముఁ బొడిచిన, మఱియుం బనకపుకు తామ్రముఖుఁ డుగ్రుండై.

క. బలవంతు మాల్యవంతుం, జలధికడం గడఁగి నొంప సమయింపంగాఁ
దలఁచుమహనమంతుఅంతున, నల్పాఘుం గ్రుద్ధుముష్టిహతి క్షితిఁగూల్చెన్. 21

తే. కూల్చి చంపక యాసురతోఁ గూడ నతఁ, డతని కాంతాళిఁ గైకొని యతులగతుఁ
బఱచి వానాళిరాళితప్రాంతకాంత, ధరఁ జిరాద్భుతిశైత్యకృత్యము లొనర్చ 22

క. కొండొకకాలమునకుఁ గపి, మండలపతి మూర్ఛఁదేఱి మహిరహితోఁ గూ
ర్చుండి కనువిచ్చి రిపును, ద్దండపరాక్రమునిఁ గాంచి తలవంచుకొనెన్. 23

వ. అగణ్యదాక్షిణ్యాభిముఖుం డగుతామ్రముఖుం డబ్బహుమానుననవ్యార్థనామఁ
గావించి పంచిన 24

చ. జరఠకపీంద్రుఁ డట్లరిగి సాగరతీరమునందు మానితాం
బురుహభవాండషండపరిభూషితుఁడైవెలుఁగొందుచున్నయా
శ్వరుఁడన నుజ్జ్వలజ్జటిలసారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భమునాఁ జను మేడిఁ దోఁచినన్. 25

క. పరికించి యుదుంబర, తరువెక్కి తదీయపక్వతరఫలసేవా
గరిమం బ్రాణానిలసం, భరణముఁ గావించికొనుచుఁ బ్లవఁగుం డుండెన్. 26

క. అలకపిచేతిపచేలిమ, ఫలము ప్రమాదమున జారి పాథోధిజలం
బులఁ బడియెఁ బడినదొండొక, బుళబుళశబ్దంబు సంప్రభూతం బయ్యెన్. 27

క. అనినదము కర్ణంబుల, కానందవిధావిధాయి యగుటయు గణనా
హీనము లగుతత్ఫలములు, వానరుఁ డక్కడలి నీటవైవఁగఁ దొడఁగెన్. 28

క. వనచరకరముక్తములై, వనధిం బడుమేడిపండ్ల వారణలోలోఁ
దినుచుఁ జలింపక క్రకచుం, డనుదారుణశింశుమార మచ్చోనుండన్. 29

క. అధికతమోదుంబరఫల, మధురరుచిం జొక్కి శింశుమారము మాసా
వధిగా నచ్చోటనకర, మధివసియించె న్నిజప్రియావిముఖంబై. 30

చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం
డకట యిటేనిఁబోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో

తికమకమైతి నా మగఁడుఁ దీర్పుము నీవిఁక డేఁగి యూవి నా
యకసుఖవార్తఁ జెప్పుమని యంచిన దూతిక పోయి యుంచెరన్. 31

క. ఒకచో వికచోదుంబర, నికటంబున ముసలిక్రోఁతి నెయ్యంబునఁ దా
యక యున్న శింశుమారుం, గ్రకచాంకురదూతి ప్రీతిఁ గని చని యిట్లన్. 32

చ. చెలువతియున్న కూర్మిచెలిఁ జేరి వినం గన గ్రొత్తలైన వో
చెలితెలియంగ నంతయును జెప్పెద రోయుక విన్ము నేను నీ
యలఘునియోగమూఁది చని యక్కడ నొక్కెడఁ జూచి యచ్చితిం
దొలఁగక వానరప్రమదతోఁ గనఁబాయని వాని నీపతిన్. 33

క. నేనెఱుక చేయుకొలఁది నీట, వెనువెనుకకు వచ్చివచ్చి వెలఁదికొలందిన్
జననీపని చెప్పితిఁ బర, వనితారతి లుబ్ధుఁ డేలవచ్చు న్మగుడన్. 34

క. నావిని కాఁపుర మిటువలె, నీవిధమునఁ బ్రాణనాథుఁ డితరస్త్రీపై
త్రీవశుఁడయి యుండఁగ నని, పావకశిఖిపోలె మండిపడి యది మదిలోన్. 35

చ. కనుఁగవ వత్తులోడికలు గట్టఁగఁ దైలనిషిక్తయై నిజా
నన మరవాంచియుండె సదనంబున నత్తతి శింశుమారుఁ డ
వ్వనచరనాథువీడ్కొని యువారిగఁ దియ్యని మేడిపండ్లు గొం
చు నిలువ కేఁగుదెంచి యిలు సొచ్చి కులాంగనఁ జూచెఁ జూడ్కికిన్. 36

ఉ. ఒండొకభంగిఁ దోఁచుట యిది యుల్లము ఝల్లనిపల్కె శింశుమా
రుండు ప్రియా నయాతిగవిరోధిని హృత్ప్రియ దాప్రయాదివే
యండవు వచ్చినం బలుక వక్కట యీవన శింశుమారిని
ష్ఖండవిధానమైనయలుకం దలయెత్తదు చూడ దెంతయున్. 37

క. అదియట్టిద యప్పనికిం, బొదరగుటం దూతి ప్రీతిఁ బురికొనఁ బలికెన్
జదురాలికిఁ దెవులెత్తిన, యదియేతో నెట్లుమాటలాడం గూడున్. 38

క. మందులు దెమ్మని చెప్పిన, మందులు నినుఁ గొలుమధిటులు మాతోఁ దమలో
నిందెవ్వరుఁ బలుకరు నీ, చందముగా నెట్లు సాధ్వి జారుజ మానున్. 39

క. నావిని క్రకచుం డను మ, జ్జీవము లౌషధము లయినఁ జేడియ కిలో
సేవింపఁజేసి నిర్గదఁ, గావించెదఁ జెపుము దాఁచఁగా నేమిటికిన్. 40

క. అని కూర్మిఁ జేటపడఁ బ, ల్కినపలుకులు శింశుమారి గెంటనివేడ్కన్
విని నీతి తంత్రమంత్రిం, గనుఁగీఁటిన నతఁడు చేరి క్రకచుని కనియెన్. 41

క. ఎలనాఁగ రోగమణఁపం, గలమందులు చెప్పఁడవిని ఘనశాస్త్రకళా
బలవైద్యులు వైద్యులు గ్రనాఁడిం గ్రోఁతిగుండె నరెడని రధిపా. 42

క. అది ముదిత కోసఁగనున్నన్, బ్రతుకదు చెడచెడఁగరాదు పరిణామమునన్
మఱిఁగదిరిన వెఱఁ గ్రకచుం, డిది యెవ్విధి నారయు భార్య నెట్లీడేర్తున్. 43

క. బహుమానం డొకఁడున్నాఁ, డహితుఁడు గాఁ డతఁడు హితుఁడు హాహా ముక్త
స్పృహ గృహ తత్త్వార్థము దుస్సహతరమా ప్రజ్ఞ నెట్లు చంపుదు నతనిన్. 44

చ. నిరతము విశ్వసించు నతినిర్మలచిత్తున కెగ్గు సేయుటా
పురుషుఁడు దక్క భూరికులభూమిధరంబులు గావు సప్తసా
గరములు గా వరణ్యములు గావు భరంబని ధాత్రి మైత్రి నా
సిరివరుతోడ విన్నపము సేయదె వేఁడిన యట్లు గావునన్. 45

చ. కడపట భార్య నిక్కడనుఁ గాఁ జెలికానికి నెగ్గు సేఁత యొ
క్కడు దురితంబు కాఁ పురిటు గూల్చఁగఁ జూచుటయు న్మహోఘమి
ప్పుడఁ తెకపట్టున న్సఖునిపట్టున నింతి విశేష మింతకుం
జెడుపని యేనియుం దగిలి చేయక మానఁగరాదు గొబ్బునన్. 46

వ. అని నిశ్చయించి బహుమానవధోద్యోగంబునం దిరిగి వచ్చి నప్పు డుపాంసుసన్న
దంబునం బ్లవంగపుంగవుండు. 47

క. క్రకచాధికచాదృతియై, ద్దసఁ గ్రమ్మర నరుగుదెంచెదవు కులకాంతా
నికట మకటా యసహ్యం, బోకో సత్యముఁ జెప్పుమనిన నువచనుఁ డనియెన్.

ఉ. ఏను భవన్నియోగమున నేగి ఫలంబులు కానుకిచ్చినన్
మానిని పల్కె నీ వరిగి మాసకమయ్యెఁ బ్రవాస మెవ్విధిం
బోనిది నీకు నెద్దికతమో గతమోహ భవద్వియోగంబు నా
తో నెఱిఁగింపుమన్న భయదూరసదాదృతి నంటి దానికిన్. 49

చ. తనయనసూనభామతిమిధామతలంబున లెక్కకెక్కడా
ఘనఘనరాజిఁ గ్రాలు మనుగర్భమునాఁ జనుమేడి దానిపై
మను వనువాసరంబు బహుమానుఁడు తత్కపిచక్రవర్తి ప్రో
పున నితరం బెఱుంగక యపూర్వసుఖస్థితి నుంటి దాలిమిన్. 50

చ. మఱునఁగ రానిసఖ్య మది మాటలు వేయును నేల పుట్టి బు
ద్ధెఱిఁగితిఁ గాని యట్టిజగదేకపవిత్రునిఁ జూడ నెందు నో
తెఱవరో యంచుఁ జాతకుగతిం గృతి నీయుపకారకృత్యముల్
గుఱిగడనం బ్రియంబు తమిఁ గొండలు కోటులు చేసి చెప్పితిన్. 51

ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై ప్రియంబు సాం
పుప్పతిలంగఁ బల్కె నది యోయి కృతఘ్నుఁడ వీవు గావె యు

ప్పప్ప సుహృత్తముం డయిన యాయన యింటికిఁ దెచ్చి తెల్పు నే
చొప్పునఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యల దేల్చుటొప్పదే. 52

ఉ. ఎక్కటి మేడపై నిలువ నేటికి నేఁటికిఁ గాను నిల్చుఁ గా
కిక్కడఁ బెద్దకాల ముఖిలేప్సితభక్ష్యము లావహింతు నా
మ్రొక్కని మ్రొక్కి పెక్కుప్రియము ల్నయము ల్పచరించి తోడితె
మ్మక్కపినాథువంచుఁ బ్రియయంచిన నిన్గొనిపోవవచ్చితిన్. 53

క. కారణవిముఖుండై యుప, కారముఁ గావింపలేరుగద లోకము కై
వారం బగు నిట్లన ని,ష్కారణపక్షులుఁడ వీవు కారణజన్మా. 54

క. కపివర నీచేవందిన, యుపకారపుటప్పుఁ దీర్పనోప న్గరుణా
నిపుణమతి నాగృహంబున, కిపుడీ వేతెమ్ము పూజ లిచ్చెద భక్తిన్. 55

క. ఇలువాడి మ్రుగ్గులిడి కూ,రలు గూ ళ్లమరించి యేలరాఁ డారయునో కో
వెలలెం బ్రొద్దని యట నీ,చెలియలు నేఁ డెదురుఁ జూచు సేవించుటకున్. 56

క. రారానిచోటుగాదు కృ,పారాజితపిచ్చుకుంటుపైఁ బర్విన భా
గీరథివిధమున వస్మద, గారమునకు రమ్ము కపిశిఖామణి యనుడున్. 57

వ. ప్లవంగపుంగవుండు. 58

ఉ. రాసిరణం బొనర్చి నిజరాజ్యముఁ గైకొని నన్ను గాసి గాఁ
జేసినవైరిఁ గన్గొనుచుఁ జెంగటనుండుట కష్ట మిందు నా
కోసఖ యట్లుగానఁ బదమూఁద సహింపదు నంతువెంబడిం
గానిలియుండువారలకుఁ గానని క్రంతలు మేలు గావొకో. 59

క. అనఘా నీనిలయమునకుఁ, జనుదెంచెద మీకుఁ గాక జలసంచారం
బనువగు నే మముఁ బోలిన, వనచరులకుఁ జెప్ప మనిన వాఁ డిట్లనియెన్. 60

క. నీవాక్యము లుచితంబులు, గావె పయోవిహృతియేడఁ గపులేడ యొకే
నావీపున నిన్నిడికొని, యావాసముఁ జేర్చువాఁడ నరుదెమ్మనినన్. 61

వ. తద్భాషితంబులు మాయాదూషితంబు లగు టెఱుంగక. 62

చ. మెఱసి యుదుంబరద్రుమముమీఁద వసించినకీశరాజు చే
టెఱుఁగనికూనతెప్పవలె నేర్తెఱఁ దోఁచినశింశుమారుపై
నుఱికెఁ దదీయపృష్ఠమున నుండినవాఁడు విశృంఖలత్వరం
బఱచి హుటాహుటి న్మనికిపట్టున కేఁగెదు త్రోవ నేర్పడన్. 63

క. నీరము తెరువునఁ గొంచెక, దూరము చని యులసి నిలిచి దుర్దాంతవిహా
రారూఢహృదయుఁడై చిం,తాకలి వది యూరెలుంగునం దనలోనన్. 64

ఉ. సన్నిహితుం డంతరంగమున నమ్మి యథార్థము తెల్పుచున్నవాఁ
డెన్నిభవంబులం దొలఁగ దెన్నఁడుఁ జంపినఘోరపాప మిం
దు న్ననువంటిదుష్టచరితుం బరికింపఁడు లోకమాత్రి యాల్
గన్నవిగావు విన్నయవిగా వొనరింపఁగఁ జూచె సఖ్యముల్. 65

క. వడవడి పురుషుని భారం, బిడి భూరివృషంబు తాఁత హేయము తొలఁగం
బడు బుద్ధికీర్తిచులకఁ, బడఁతులవ్యాదయంబు లోరయఁ బడ వేగతులన్. 66

మ. పరమద్రోహపురస్సరంబులు నయోపాయక్రియాదూరము
ల్దురితచ్ఛన్నము లన్యతాపకరణోద్యోగంబు లప్రత్యయా
కరము ల్సత్యపరాఙ్ముఖంబులు సమగ్రక్షాంతివల్లీశిత
క్షురము ల్దంభమయంబు లెట్లొలఁగవచ్చుం గామినీచిత్తముల్. 67

క. ఈమనసులు గలిగినమహి, భామామయితరస్థలకు లోనై య
య్యో మదినమ్మినకీశ, గ్రామణిఁ దెగటార్పనలసెఁ గా నా కనుచున్. 68

క. అలక్రకముఁ దల్లనల్లనఁ, బలుకఁగ విని వానరాధిపతి భూరిభయా
కులమానసుఁడై యపుడో, దళితాఘా యేమిపలికితవు నీ వనుడున్. 69

క. ధృతిఁ గ్రకముఁ దపుడదత్త, ప్రతివచనం బగుచు నుఱకపలుచునుండన్
వితతప్రజ్ఞం గపియు, ద్ధతు వానిం గ్రమ్మఱించెదం గా కనుచున్. 70

క. భీతిప్రవాహ మతిధృతి, సేతువుచే నాఁగి పలికె చెలికాఁడా నీ
శాతోదరి నాసోదరి, కాతుకమున నున్నె భవదగారం బమరన్. 71

క. ఇది వినవలతుం జెపుమా, మది వొదలఁగ ననిన శింశుమారుఁడు పలికెన్
గదబాధిత యాయియున్నది, గద నీయనుజాత యొల్లుగా ధరియింతున్. 72

సీ. భార్యలేకయొనర్చుపండువు దండువు కులకాంతపెట్టనికూడు గిడుసు
పత్నితోఁ బలుకనిపలుకులు చిలుకలు గృహిణిలేనికబంధకేళి జాలి
జాయవాటింపనిసరసము ల్విరసము ల్ప్రాణేశ్వరికిఁ గానిపాటు చేటు
దయితకై చేయనిప్రియములు భయములు వల్లభవెలితైనయిల్లు పొల్లు
తే. ముద్దుకులకాంతసుద్దు లేస్రొద్దువినని, చెవులు గవులు వృథా వేయుఁ జెప్పనేల
యొకట సతిలేనిబ్రతుకేల యర్థమేల, వాహనములేల కరులేల వసుధరేల. 73

క. నావిని బహుమానుఁడు బా, హ్యావృతముఖుఁడగుచు వాని కనుఁ గ్రకచా నీ
దేవి రుజ మాన్పుటకు లే, రే వెజ్జులు మందుఁ జెప్పరే వారనినన్. 74

క. చెప్పిరి వానరహృదయం, బప్పడతికి నవశ్య మనుచు నగచంకారు
లప్పకదిహేతువుగ ని, న్నిప్పుడు గొనివచ్చుట యని యాహింతుఁ బతిఁ జూడన్.

క. నగచరుఁ డదివిని వెఱఁబం, డ్లిగిలించి వడవడ వడంకి తొడఁబడి చెడితిన్
జెగితిఁ గడచనితిఁ జాలితిఁ, దొగరువ నిట్లయితి జూసపోయితి వనియెన్. 76

వ. అని. 77

క. దారుణగహనంబున నా, హారోఁతలఁ జెట్టుమీఁదిమి నసురుఁ డుర్వీశా
మారంభం బుడుగని యల, ఘోరాఘఫలంబు గట్టి కుడిపెడునన్నున్. 78

క. భీమాటవిలో నున్నం, గామాంధుని బోదవు బాతకంబులు రాజ
గ్రామముననున్న దూరిత, కాముని గల్మషము లంటఁగా శంకించున్. 79

క. చిరకాల మరిగె నురిగెం, దరుణిమ యిక నేడ గామతంత్రం బనుచున్
బరలోకచింత సేయుని, పురుషార్థముఁ జేటుపాటు పొందదె యనుచున్. 80

చ. క్రకమని చూచి వానరశిఖామణి యిట్లను నీవిచారమే
టికిఁ జెడిపోయె నేమిటికి డించె భవన్మతి ప్రాణమైన భా
ర్యకు రుజమాన్పఁ గీశహృదయంబునకుం జనుదెంచువాఁడ వీ
వకట యెఱుంగఁ జెప్పవలదా మునుగల్గగ నాకు నింతయున్. 81

ఉ. చెప్పిన నాయుదుంబరపుఁ జెట్టున నెప్పుడు దాఁచియుందు నొ
క్కప్పుడు మామకీనహృదయంబు సమర్పణఁ జేసిపుత్తు నీ
చొప్పున నింత దాచెదర చుట్టమఁ గానె విరోధినే వృథా
త్రిప్పటఁ జేసి తింకోరులు దెత్తురె నిన్నడసం బ్రతిక్రియల్. 82

క. హృదయము దరువున నున్నది, గద నా కాయమున లేదుగద మునుగా నా
కిది చెప్పక పనిచెఱచితి, గద రిపుఁడవు గాని చెలివిగా వంగవకున్. 83

సీ. ధర్మార్థకామచింతకులకు భూదేవధారుణీపరవధూదర్శనములఁ
జనరాదు రిక్తహస్తములను గామ్యార్థి వగునీకు మున్ను పాయనము వలయు
హృదయంబు మేడినున్నది పోకమఱలు విస్మండితోరినికాయు గుండెకాయ
చేయార నీకు నిచ్చెదఁ బుచ్చుకొని చేరి జాయ నిరామయఁ జేయవయ్య
తే. యనుచు బహుమాయఁ డాదుమాయామయోక్తు, లాగ సూక్తులుగానప్పుడాత్మఁ దలఁచి
తిరిగి యాశింశుమారుఁడే తేరఁ దీర, వృత్తు మెగఁ బ్రాఁకి కపి వాని వెక్కిరించె. 84

క. కనినుస నాఁకట ఫలము, ల్మెసవుచు జలిదిడిచి మేడిమీఁద న్మోదం
బెసఁగ నటియించు వానరు, మసలక వీక్షించు శింశుమారుం డనియెన్. 85

చ. కుజమున నున్న వానరుని గుండియ దండియశంబు నీకుఁగా
భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయెదదీఱ మట్టిప్రియా
[illegible] కనఁ బల్కెఁ గానవచరుండు దురాత్మ విచారమూఢ యే

కుజమువనుండు వానరునిగుండియ యొక్కడిబోలిపొ ష్మికీ. 86

చ. స్తుతులఁ గరంచి నాగృహము జాతువు దమ్మని తోడుకొంచుఁ బో
యి తగవుమాలి నన్ను బొలియింపఁగ యత్నముఁ జేసితేను నీ
గతి భవదీప్సితం బొసఁగుకై పడి నిన్న దలించి మేని బ్రో
చితి చిరకాలజీవి మతిశీలుఁడ మోసము నాకుగల్గునే. 87

క. కదలుమిఁక వనికిఁ గ్రకచం, డెదపడి యేనలన మోసమెఱుఁగనివను ని
మ్మదిక్రోఁతి మోసపుచ్చెం, గదరా యని విన్ననగు మొగముతో నున్నన్. 88

వ. బహుమానుండు. 89

క. దొరకిన వను విడుచుట క,బ్బురపడకుము నీకుఁ దోడుపోయినధరణీ
సురుఁ డొకఁడు లబ్ధమునుజే, శ్వరకన్యక విడిచి రిత్తవాఁడై చనఁడే 90

క. నానీరచారుఁ డాబహు, మానున కిట్లనియెఁ దెలుపుమా వినవలతున్
దానేలవిడిచె నయువి, ద్యానిధి బ్రాహ్మణుఁడు భూతలాధిపకన్యన్. 91

సీ. అనిన శాఖామృగాధ్యక్షుఁ డాక్రకముని గనుఁగొని పలికె నిక్కథ వినంగ
దగుదువు నేనును దగుదు నీకెఱిఁగింప మును విశాలాపురంబున సుకీర్తి
యనురాజు రాజిలు నమ్మహీజానికి భువనమోహిని యనుపుత్రి గలదు
దానికి మందాభిధానుఁ డొండొకధరాత్రిదశుండు సుముఖుఁడై చదువుఁజెప్ప

ఆ. నట్లు కొంతకాల మరిగిన నపరఁజి, పనిఁడి కలరఃతా వివలె మనోజ్ఞ
ఫలము చెఱుకునందుఁ బలె నేమిచెప్పలేఁ, బ్రాయమయ్యె నానృపాలసుతకు. 92

మ. సితరోచిర్ముఖి కప్పుగొప్పు సుమనస్స్నేహం బధిష్ఠించి కృ
ష్ణతనొందంగని యోర్వలేక పదనాబ్జాతంబు గాంచె న్విధూ
న్నతిజన్ముంగవ యుచ్యుతాప్తి బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితిరోమావళివల్లి చక్రితభజించె న్నిష్ప్రియాసక్రియన్. 93

శా. బింబోష్ఠంబు మధూద్ధతింబు పరహృద్భేదు ల్కటాక్షంబు లా
స్యం బుద్యద్ద్విజరాజమండలపరిస్పర్ధాళు వాక్పద్ధదీ
ర్ఘుంబౌ గ్రాల్గనుదోయియుం గువలయప్రత్యర్థి తారాపథా
లంబు ల్వాల్గురులేలొకో పొగడుబాలం జాలముల్లోకముల్. 94

శా. లీల న్సాగరసోదయస్ఫురణదాల్చెన్ మైజగద్గీతస
ర్వాలంకారపదప్రవీణయది యాహా యట్లుగాకుండినన్
వాలగ్రంథివరాళిమోవి ననుదీవంగూడి తోరంబుగా
పాలిండ్లన్ ఫలమంజరీగరిమ చెప్పం జాఁకనొ చెవ్విధిన్. 95

మ. అతిభాస్వత్తరకాంచనంబు చెలిపాపాంగంబు కల్యాణమా
శతపత్రేక్షణ మేను మేరుకుధరాంచత్కూటము ల్దానియు
న్నతవక్షోజము లేమిచెప్ప నదియుంతొయంతబంగారు మ
ప్రతిమం బౌనరనాథుపట్టి గణుతింప న్శక్యమేయేరికిన్. 96

క. తనరుఁ బయోధరభృతిప్రేఁ, గని మిన్నేలనాఁగమధ్యమయ్యె వనైనన్
జనను పయోధరభారము, జనవాంతరకర్మమేల చను నెంచున్నన్. 97

క. పరమాణువు పరమమహా, త్పరిపూర్తి న్గోచరించుపరమమహత్తున్
బరమాణువై కనంబడు, దరుణీమధ్యస్తనేక్షితత్త్వజ్ఞులకున్. 98

క. కన్నులకు మొగముచాలదు, చన్నులకు నురస్థలంబు చాలదు వెన్నుం
బెన్నెరివేణికిఁ జాలదు, కన్నియచెలువంబుఁ బొగడఁగా నాతరమే 99

వ. ఈదృగ్విలాసధన్య యగు నారాజకన్య చకోరికాపరివృత యగు చంద్రికయుంబోలె సఖీజనసహాయయై వన్నెమీఱిన యొక్కనాఁడాస్థానంబునకు వచ్చి నల్లేగుదెంచిన కుమారీరత్నంబు సౌహార్దభాసమానోల్లాసంబున దిగిచి యంగపీఠంబున నునిచి సుకీర్తిబంధుజనాదులతోడఁ దత్సౌందర్యసౌశీల్యాదిగుణంబు లుగ్గడించుచు గొలువిచ్చియుండె నాసమయంబున. 100

సీ. చిఱుతకెంజడలఁ గీల్చినజాతిపటికంబు గళమున రుద్రాక్షకంఠమాల
యపరంజిపసిఁడికామాక్షులుడామూఁపుపై గొండ్లిఁగావించుయోగపట్టె
చిన్నారికంటె గ్రుచ్చినశింగినాదంబు గుత్తంపుజిక్కులకుట్లబుఱ్ఱ
కరమునఁ బెనుచొఱగరిముల్లు మాయూరబర్హనిర్మితమైనబవరిసురటి
తే. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ
లమరఁ జెట్టునడిగినట్టు లవనినాథుఁ, జేరనేతెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. 101

క. ఏతెంచినఁ గాంచి ధరి, త్రీతలనాథుఁడు హృదంకురితనిర్ణిద్ర
ప్రీతి నెదురేఁగి నతుఁడై, యాతిథ్య మొనర్చి యమ్మహాయోగీంద్రున్. 102

క. వినయమునఁ దెచ్చి కనకా, సనమున నిడి రాజుపలికె సదయా మీచా
పనిభూములు పావనం దడి, యునివారలు గలరె మిమ్ము నడిగెద నొకటిన్. 103

క. రాజకుమారులలో రతి, రాజకుమారుల సురూపనవిక్రమబ
ల్మీజయములమించినవాఁ, డో జగదారాధ్య కలఁడె యొకఁ డట్లున్నన్. 104

క. ఆసర్వజ్ఞన కసర, వ్యాసా కులగోత్రజాత యగునీసుత ను
ల్లాసగుణవసతి నిచ్చెద, నాసక్తిం దెలుపుమనిన నతఁ డిట్లనియెన్. 105

క. ఇలఁగలరాజకుమారుల, దలివిపడం దిరిగిచూచితిని బొటలపూ

త్ప్రలయుఁడు జనుపేమఁడనం, గలఁడాతఁడు నీకుమారికకుఁ దగుఁ గూర్పన్. 106

క. అత్త్రైలోక్యశ్లాఘిత, గాత్రుఁ బ్రశంసింపనేల కనుఁగొను మతనిం
జిత్రరస మావహిల్లం, జిత్రించి మునీంద్రుఁ డధిపుచేతికి నిచ్చెన్. 107

వ. ఇచ్చినం బుచ్చుకొని యచ్చిత్రరూపంబుఁ జూచి యచ్చెరువంది యమ్మనోహరాకారంబు తనయనుంగుతనయకుఁ గానంజేసి యజ్జనపేముండు దనకు మేనల్లుండు గావున సదృశసంబంధంబున కలదుము 108

క. జనపతి మునిపతిఁ బూజా, వినుతి నతిక్రియలఁ బల్లవింపఁజేసి ప్రియం
బున వీడుకొలిపి తానుం, జనియెఁ గొలువువిరిసి రత్నసదనంబునకున్. 109

ఆ. అమ్మరాజపుత్త్రి యాచిత్రరూపంబు, గన్నదనిచెఁ జూచి కంతదప్ను
మోహసింధుపతితయై హారమాహార, మాళిజనవిహార మురుదిపుట్టి. 110

వ. చింతించుచుండ నెచ్చెలు లారామంబునకుం గొని చని. 111

సీ. కలకంఠకటిశయాత్కాలికావిలాసంబుఁ దార్పదే యారామధామకేళి
లీల నేతత్ప్రియాళికి నమందానందలహరిఁ బుట్టింపవే లతలు విరులు
వికసిల్లునీపద్మినికి సదామోదంబు జరుపదే కాసారసారవిహ్వాతి
శిఖిబర్హతులితకైశికకు సంతాపంబుఁ బాపదే ఘనకదంబకకులంబు

తే. సకలెనుగదమ్మ లావుకాంచనకలాప, పరిచయము మానెనమ్మ దెప్పరపువంత
వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ, కొమ్మ మున్నాటు కెల్లోర్చుకొనఁగవమ్మ.

వ. అని నెచ్చెలు లచ్చెలి నాలోకించి సుముఖిగాఁ జేయువారయి శిలీముఖప్రముఖం
బులం జూపి యిట్లనిరి 113

చ. కరటుపాంసువం గనఫుఁగాలము బల్లనసంగముంబున
న్దియగుఁ గుజాతమైత్రి నెనత్రైవ్యక శీధువుఁ గ్రోలు మాలలం
దనసినసుంము ప్రోఁత తలు చాత్మభిక్షై కసుపర్వఘర్మముం
గుఱుచయొనర్చు నెట్లుపాసఁగుం జెలి దీని ప్రియాళిగాఁ గొనన్. 114

చ. కలగుణము ల్దర్జించి పలుగాకులవంటి నవంగవచ్చునే
ఫలదశపారణ ల్వినయపాటవము ల్మతిప్రాప్తకాలభా
షల సుమహత్తరు ల్చెలిమి సల్పఁగనున్కి దగుం ద్విగంగదీ
ప్తులు వెలిగఁ దపస్వినులు వోకలకంఠులు చూడఁజూడఁగన్. 115

మ. మురిపంబుల్ గలమిండతేటికడియంబుల్ మారుతోత్కభ్రమిం
దిరుగం భాసురకేసరీతుకణికాధిష్ఠానకించిద్వికా
స్వరపుంగ్రొవ్విరులోళ్ళఁ జైత్రహారనించం జంచరీకాలకా

కరిశిరంబున్నరసైత్యవంబు చిగురాకుం గొప్పెర ల్బింపగన్. 116

చ. సరసులలో సువర్ణపరిష క్తములై కనుపట్టుకోశముల్
గర మనుర క్తిమాచి మృదులస్వర ముట్టిపడ న్సుభాషితో
త్కరము విధాత కెక్కుడగుగౌరవ మొప్పఁ బఠించుఁ జూచితే
హరిణవిలోచనా పరమహంసవతంసము లూర్జితస్థితిన్. 117

మ. గమకంపుంబసనేలకై దిగినశాఖల్ హస్తపాద్విభ్రమ
భ్రమఁ బుట్టింప లతాంతబిందుకులముల్ పైదేర నుద్యద్ధ్విన
త్సుమధూళీమదధారలూర నళిపంక్తుల్ గప్ప నుద్యానపా
వమహిం గానఁగనయ్యెఁ జూచితివె పున్నాగంబు బింబాధరా. 118

ఉ. ఉన్నతి నంబరం బొరసి యొచ్చె మొకింతయులేక కొమ్మలం
గన్నులపండువై బవరిగా వరుదెంచిన ప్రాసవాసనో
త్పన్నరుచిరం బగ ద్దదెలుప న్గలపాలికయొప్పె జూడు మా
సన్నబలైకపత్త్రకవిశాలము సాల మఖండమూలమున్. 119

చ. చదువులమేలులేదొ శుకసంతతిగాదొ వినీతరీతి చా
లదొ భజియించునీచతురు న్మతిమాటకువచ్చునిచ్చలుం
బదివదిగా నొనర్చుఫలభంగము నెమ్మొగ మెట్టజేయున
ల్లదె పరికింపుచిల్కహృదయంబున గోపముజిక్కె దొయ్యలీ. 120

చ. సరళగభీరశబ్దఘనసారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్నయా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతతు ల్భజియింప బాదవి
స్ఫురణఘటింపుచుం దొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము జేయుచున్నకవి నారసిచూడు మరాళగామినీ. 121

క. నిరుపమఘనరసపుష్టి, స్ఫురణం బాదములు మెఱయ భూభువనమునన్
సరిజెప్పఁగలదె యిందిం, దిరకుంతల యీవసంతతిలకంబునకున్. 122

క. విరికొఱవులఁ బథికపరం, పర జూడుంజూడు మిట్టిపరుషపలాశో
త్కరమునకు నెట్లుగలిగెం, ధరణీసురదండవిధిసుధామధురోష్ఠీ. 123

చ. గళితఫలాశఁ బూజకలికాచ్ఛలనంబున విస్ఫులింగము
ల్చిలుకుచు మత్తకోకిలవిశృంఖలఘోషమిషంబుచేత గ
ర్జిలుచు ధరాపరాగముల రేఁచి పడి న్సడిగొంచువచ్చెడిం
బెలుచమనోజమాంత్రికుఁడు పెంచినగాలిపిశాచిఁ జూచితే. 124

ఉ. వేవెడఁగేల డీలుపడ వ్రేసినఁ జైఁబడ వక్త్రశీధుని
ష్ఠీవన మాచరించినపడిం జరణంబున దన్నిన న్రహిన్
బోవనిపార్థివస్ఫురణఁ బొందియు సత్కళికాప్తినొందు హే
లావతి యిట్టినీచతరులం బరికించితె యిమ్మహావనిన్. 125

సీ. నెలఁత నీపలుకులో నిదికర్ణికారంబు వనిత నీనగ వెఱింగినది పొన్న
మెలఁత నీకనుసన్న నలరుబొట్టుగముద్దుపాలఁతి నీచేసంజ్ఞఁ బొదలుమావి
ముగుద నీసమ్ముఖంబున గ్రాలుసంపెంగ రామ నీహృదయపారగము క్రోవి
పడఁతి నీపదమాసపడునశోకము వినఁ బ్రియపడునీపాటఁ బ్రేంకణంబు
తే. అతివయుష్మత్పదగ్రహాశ్రితము పొగడ, యువిదవావిలియలరునీయుగుతకలిమి
బంధుమధ్యము మిప్వనాభ్యంతరంబు, విద్రుమాధరకన్నిచ్చ విశ్రమింపు. 126

సీ. ఘనసుమనఃకులంబున నెట్లుపుట్టెనో యొరులచేరువ నున్ననుదుకుఁ జూపు
బహుపత్త్రభరణసౌభాగ్య మెట్లందెనో యుగ్రగంధస్ఫూర్తి నుల్లసిల్లు
నిరవధికామోదభరిత మెట్లయ్యెనో మహిబుణ్యతరులకొమ్మలఁ బెనంగు
సతతాభివృద్ధి రాజస మెట్లుగల్గెనో కఠినకంటకమైత్రిఁ గడపుఁ బ్రొద్దు
తే. ననుచు బెనుచూరపోలె జెల్లాట మెసఁగ, నసమకుసుమాపచయకౌతుకాప్తి నదరి
సంపెఁగలమల్లికాగుళుచ్ఛములఁ బొన్న, విరులమతిగేదఁగుల రెమ్మిపెలఁదులంత.

ఉ. కోయిలనోరుసోఁకనిచిగుళ్లు నికారపుఁజిల్క భిన్నము
ల్సేయనిపండ్లు కాలవడి లేవడితెమ్మెరసూనరాశిగా
వ్రేయనికమ్మపుప్పొడి ప్రవృద్ధపిపాసమదాళిపుత్త్రకం
బోయనితేనియ ల్గమిచి పూవిలుకానిభజింప నంగనల్. 128

సీ. కలకంఠముల నోరికడిదివ్వవలె నంచుఁ జికిలిగుబ్బెతలు గోసిరి చిగుళ్లు
చిలుకమూఁకలమూడు చౌలుతమా యని పువ్వుబోండ్లు మాఁగినపండ్లు పుచ్చుకొనిరి
యొందుటుదుమ్మెదలఁ బస్తునుతమా యని ముద్దుకొమరాండ్రు విరితేనె కొల్లఁగొనిరి
మదటగాలి వయాలి మాన్తమా యని కుమారికలు పుప్పొడు లావరించుకొనిరి
తే. అతనువిలు మూలవేయింతమని సుధార, సాధనలు తావిపూవుల నపహరించి
రంత నాక్రీడ భూక్రీడ నటనీ యలసి, తాంబుజాక్షులు కంకేళిహాళి వ్రాలి. 129

సీ. మోమాటనలరుతమ్ములతావు లగలింప గనుసన్న మనుఝషకముల నలపఁ
జూడనాసవమైత్రిఁ జొక్కనయళిరేఁప నరగుత్తికగుసంకు నలటఁబెట్టఁ
గైవసం బగుబిసాగ్రముల నుస్మాలింప మాటకు లోనైనమధుపు లొలుకఁ
జనుమానమంటినజక్కవలఁ నురేఁప దండఁ బాయనికుముదములఁ జెండఁ
తే. జరణముల నాశ్రయించినసన్నరాళ, నీడజములపయోభూతి నేలఁగలప

నెత్తుకొని రెంతనిర్దయు లీలతొంగు, లనఁగఁ గంకేళికాంతఁ గా లాఁగ కలికి. 130

ఉ. చేరువఁగాంచి రక్కలికిచేడియ లవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిఝాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుండ్రగపూగకుటీరతీరముల్. 131

చ. కని బిసదండపత్త్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్త్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరుదిక్కులఁ బత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. పడిఁ బుటమెత్తి వ్రాలునిడువాలుపచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁజేయ రాజుకై
పడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమాఖ్యమాలికలచొక్కపుఁదావులు సోఁడుముట్టఁ జూ
పట్టునిరల్పకంకణవిభ ల్నయనోత్సవ మాచరింపఁగా
మట్టపుటూర్ముల స్నైఱయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరసము ల్జవముల్ ఘనపత్త్రనిర్భరా
సంగమునం బహుప్రసవజాకలరేణువు లంటిరాఁ బర్హి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ. సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రిము ఝంకృతిభాగలీనభూ
త్కరణమిషంబునై సొగసుగాడ్పులదూలుచు మాగుతుండిక
ద్విరసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
శ్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నాదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దలుక్కువ స్నైలుకుచేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలవోటులన్నియును జేకొని బంధురధారసత్త్రసం
హరణబలంబు నిత్యమయి పత్తిల దారుణమైనవిక్రమం

పురభవనంబులం బొదల నున్న మహామధువుంగలంది దు
స్తర మగు నచ్యుతాతిశయచక్రము గన్గొని సంభ్రమింపుచున్. 138

ఉ. మిళితగరుత్కలాపముల మించుకుమారశిలీముఖాళిసోఁ
కుల నిజహృత్పుటుల్ విరిసి కోమలపత్రవిశాలలోచనాం
చలముల నీరుగప్ప మణిజాబిలిరాలకుఁ గాక మోహినీ
కళ దుళకించుపద్మినులఁ గన్గొని గంధగుణంబు నొందుచున్. 139

చ. తనభువనప్రశస్తబలదర్పమునం జననీక నిచ్చలుం
దనివిసనం బహుద్విజవతంసములం దినుము న్నిరంకుశ
ధ్వనిఁ బ్రకటైకచక్రసవిధస్థలిఁ గ్రాలుబకున్ మహత్తరు
ల్గను శిరసావహింపఁ దగులావరిఁ గన్గొని తెల్వినొందుచున్. 140

ఉ. బారులుగొన్న నీరకణపంక్తులు క్రొచ్చవిరచ్చదెల్ప నిం
డారినకేసరంబులు శుభాక్షతరేఖఘటింప సారకా
సారవధూటిసాంగజవసంతున కీనమరించు పచ్చరా
యారతిపళ్ళెరంబుల క్రియం దగుతామరపాకుఁ జూచుచున్. 141

వ. కదియుంజని ప్రహృష్టచక్రంబు గావున రాజహంసోపలాలితంబయి సిద్ధసంతాన వేష్టితంబు గావున మత్స్యకూర్మకుక్కుటాద్యాసనభాసమానంబయి విడంబితశంబరారంభంబు గావున నాక్రాంతపాఠీనాంకంబయి కుముదప్రకాశోదయంబు గావున నావిష్కృతపుష్కరంబయి యలరుచుండుట కలరుబోండ్లు. 142

క. ఒసపరినడకలు మృదుసా, రసవిసరవిజేత లగుకరంబులు గంధో
ల్లసనము కొమ్ములు నమరఁగఁ, గుసుమాస్త్రునిమదపుఁజేనుఁగులగతిఁ జెలువల్. 143

వ. కాసారంబు ప్రవేశించి. 144

మ. పొగడంజొచ్చినభంగి రత్నవలయంబుల్ మ్రోయఁ జేయెత్తి కెం
జిగురుం గొమ్మునవైచె నొర్తు నొకరాజీవాస్య యవ్వేటునం
బగులం గంచుకముబ్బి చన్నుఁగిన చూపట్టె న్ముఖాగ్రంబులం
దగ నండంబులు వ్రచ్చి వెల్వడునరిద్వంద్వంబుచందంబునన్. 145

ఉ. పూని ఘటాకృతుల్ మోడుము బుజ్జిటకొమ్మున నీరునించి యొ
రో సెలుజాణ నా నొకధరాకటి యొండొకబోటిపై వె
మ్మే నదరంటఁ దాఁకి సెటిమించినఁ బయ్యెదప్రయ్య నంత న
మ్మానిని యొప్పె పేరొఱఁ దెమల్చినపూవిలుకాని వా లనన్. 146

చ. మరువిరితూపురూపుపసమాపు నొయారపుఁజూపు నూరెలం
దిరువులుగట్టి విభ్రమవతీమణి యొర్తుక యన్నుగన్నులం

దొరలజలంబుఁ జల్లె నది దోయిటవక్త్రముఁ గప్పె రోహిణీ
చిరవిరహార్తినొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. 147

ఉ. చేనొకబోటి కెంజివురుఁ జిమ్మన గ్రోవియొనర్చి తమ్మిపూఁ
దేనియఁబీల్చి సోగవిరిదిండుగ నొండొకకొమ్మ జిమ్మనె
మ్మే వనుకైన నమ్మెలఁతి మించె జగంబులు గెల్చి కాంతిరే
ఖానియతి న్మరుండు గడుగం గడుఁ గ్రాలు మెఱుంగువాలనన్. 148

చ. పొలఁతుకయోర్తు గెంజివురు బుట్టటకొమ్మన ప్రుక్క నొక్కనె
చ్చెలి చలివీడిపైవ నది చిత్తజుఁ డేడ్తెఱఁజూచి వైమకే
ఏలకరవాలసంహతులవై ఖరి గానఁబడంగ దానికే
పలకరవాలసంహతులవంచి వికావికనవ్వెఁ గ్రొవ్వునన్. 149

చ. విరహులమారుమారుఘనవీరబలం బని పాంథకంధర
ల్దఱుగురమాకుమారు నడిదాలనిరాగవియోగజాతకా
తరగుణదాత్ృమన్మథపతాకని తేంట్ల నదల్చి కమ్మదా
మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. 150

చ. గతి యతివేలరాగకరిగా నెఱిగాంచినవాలువాలముల్
ప్రతిరహితాంఘ్రులం బెనఁగఁ బైపస ముద్దులుగుల్క సమ్మద
స్థితి మితిమీఱఁ గొమ్ములను జేతులు పుష్కరలక్ష్మిఁ దెల్పఁ గా
హితసరసిం జయించి రలయింతులు కంతునిదంతులో యనన్. 151

ఉ. కొమ్ములతోడిహస్తములు గుత్తపుముద్దెలముద్దుగుల్కు పాం
దమ్ములనంగవృత్తిజఘనద్వయసాంబులనిల్వ రేఁగి పైఁ
దుమ్మెదలాడఁ జూడ నవదోహదధూమమిళల్లతావితా
నమ్ములజాడఁ గుందరదన ల్గనపైరి మనోహరాకృతిన్. 152

ఆ. ప్రపవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, మునిమియో యెఱుంగ విసువులేక
తారసించి ముద్దుతమ్ములఁ జివురాకు, బోండ్లు కొలనుసొచ్చి పుచ్చుకొనిరి. 153

క. నాళీకజైత్రనేత్రలు, హాళిం గేళీసరోవిహారశ్రీలం
దేలి కటీఘటితపటీ, జాలములు కలాపవేషసంగతు లమరన్. 154

ఉ. మందమరుల్కిశోరహతి మవ్వపుఁ దేనెలజాలువారుపూ
బందిలిక్రిందఁ గప్పురపుఁబల్కులఁ దిద్దినగద్దె నిందిరా
నందనునిల్పి వృత్తజఘన ల్రతివర్ణితభారతిం దదా
లిందమునం ఘటించి కదళీదళగర్భలతాంతసంతతుల్. 155

క. కరములఁ గైకొని చెలువ, ల్మరుజాపగుణీకృతభ్రమరుఁ బ్రతివినతా
మరు జైత్రార్పితమణిచా, మరు నారాధించి రప్రమత్తప్రజ్ఞన్. 156

క. ఆరాధ్యద్యుమణిప్రభు, నారాధనవిధులఁ దనిపి యతిశయవర్షా
ధారాధరవేణుల మధు, ధారాధరఫణితి వినయతాయుత లగుచున్. 157

సీ. తలయేఱుపట్టించె నెలదాల్పునకు భవత్కాంతనిష్కాంతహుంకారరవము
వికటిలత్రోటికోటికి దచ్చె భారతీకాంత దావకభయంకరశరంబు
ముష్కనిర్భేదనంబున సాధుజేసె నీవైరంబు మతిదివ్యవృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీతెఱదాడిఁ జేరఁడు గ్రహరాజశేఖరుండు

తే. నీప్రతాపాగ్ని దపియించి నీరజారి, సంశ్రయించె సురాచార్యశరణభూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు, శంబరామరవిమతహింసారిరంస 158

సీ. వివిధాగమాంతప్రవేశచాతురి నెన్నదగుకుశకాదులు వినీతతఘటింప
శుహిసురాప్తిసుహృత్తమహిమ గాంచినయుత్తమాళులు హితవృత్తి ననుసరింప
ఘనదానవేగరాగముల మీఱినజగత్ప్రాణుండు నీమనోరథము గడప
నాకువాగ్గ్రహణమేధాశక్తి మాధవాదృతి భజించినమహాద్విజాలుఁ గొలువ

తే. కువలయప్రీతికాముఁడై నెవఁడు రాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి, వేమునకు బోయుపాలయ్యె వృద్ధసేవ. 159

ఉ. పూతమరందబృందకరము ల్కరము ల్ప్రతిపర్వసంధిసం
జాతమధూద్ధతంబు విలుసారసమీరకుమారవారణో
ద్ధూతసుజాతిచూతరసతుందిలతార రమాకుమార నీ
చేతిగుణంబుమాన వెదిచేతిగుణం బిటులయ్యె నక్కటా. 160

సీ. ఆర్తివహించు నీయస్త్రశీతమునకు నిలుపుగన్నులనిక నివ్వటిల్లె
నతిముక్తమగుతాపకాయోధంబున కహో దొరకె జండాలురతోడిమైత్రి
భ్రాంతిఁబాయని భవద్ధ్వజవాశ్చరమునకుఁ గలిగెఁ బేరలుఁగులఁ బొలిసి పోవ
బుట్టుగుడ్డైన నీబూమెర తేజికిఁ దగిలె మహావినీతప్రతీతి

తే. యకట జాతికిఁ బాసిన యనుఁగుఁజెలిక, నెసఁగె మజీవేళవేళ మానిసితనంబు
నొడలుమాపిన నీకయ్యె నుగ్రకృత్య, మంగభవనిందితులకు మేలావహాలునె. 161

ఘ. అమదప్రక్రియ మూఁడుగాళ్ళజతుం డైయున్నతండ్రిం ద్రివి
క్రమునిం దమ్ములఁ జేరి తత్ప్రబలపత్రచ్ఛాయ వర్తించునా
దిమసాధ్వి న్రమఁజేర రమ్మనక యుద్వృత్తి న్విజృంభింతు నీ
తిమనీషాదయలాభ మెట్లు జనికర్త్రుద్రోహియౌ వానికిన్. 162

ఉ. అల్లనఁ గాచి మిత్రగృహ మారటఁబెట్టుసఖుండు నీతిపొం
దొల్లఁడు మంత్రి మామలకు నొప్పమిఁ జేయు రథంబు నీవునుం
బల్లవధర్మ మూఁది రతిపైఁ దమినత్తిలు దట్టినీకు ను
త్ఫుల్లదయానయాదిగుణము ల్జనియించునె శంబరాంతకా. 163

వ. అని యనంగు నంగవారత్వంబులు దూఱి తన్మాతులుండగు నీరజారిం బేర్కొని. 164

ఉ. నీదయ పంచబాణశరనిర్భరతాపదవాగ్ని గ్రాఁగి పో
నీదయ నీదయోదయసమృద్ధి సదా వెదచల్లుచుండుఁ దా
నీదయ సేదఁ దేర దొకయింత యిదెక్కడివింత నేఁడు నీ
పాదములాన మావికచపంకజనేత్రకు సారసాంతకా. 165

ఉ. కాలగతిం ద్వదీయజనికర్తృప్రతిక్షపము న్గరాళకో
త్తాలకృపీటజన్మ పరితశ్శిఖలం గడు గ్రాఁగు నాతనిన్
బోలి కళంకివై మొదలఁబుట్టినవానికి నీకు శైత్య మే
వేళ జనించు విత్తొకటివిత్తినఁ జెట్టొకటౌనె జాబిలీ. 166

చ. పరమమహాకృపీటభవభావము నీయెడ సత్యమత్తెఱం
గరయక నిన్ను శీతకరుఁ డందురటే నిసుజాతశీతల
స్ఫురణ పయోధికిం గలదె పొంగుకళంకము పేరఁ గ్రొంబొగ
ల్గురియుదె మింటవాలికలు గ్రోయుదె లోలకళాచ్ఛలంబునన్. 167

చ. పరిధిమిషంబునం గుడుసుపడ్డశరాసముఁ బూని శైత్యవి
స్ఫురణ మెఱుంగులీను ఘృణిభూరిశరంబుల వేఁడిగా రహిన్
విరహిజనాళి నొంచెదవు వేఱె మనోభవుఁ డేల నీపయిన్
సరసత లేదనంతపదసంశ్రయ మేమయిపోయె జాబిలీ. 168

ఉ. గోత్రులు రాకపోక నినుఁ గోల్కొనసీరు దురంతశీతరు
జ్జైత్రిదృఢాంబరాశ్రయము మానవు నిన్న విరోధియు నీకళా
మాత్రవిభూతి నిట్టియిడుమం బడితో హరిణాంక వారిరు
ట్పత్రసుగంధలం గిరణపాతనశాతనరీతి నొంతురే. 169

ఉ. కందళితానురాగములు గావు మనంబులు విన్నయంతలో
నందఱు పారవశ్యపదమందురు చల్లఁదనం బొకింతలే
దిందున శంకరాభరణ మెట్లయితీవు శశాంక నీపదం
బుం దుది నంతశూన్యమగుఁ బో వివరింపఁగ మాటలేటికిన్. 170

చ. సదవనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియు న్సఖులబ్ధపటుప్రసాదసం

పదబలవత్త్వమోదశనపాండితియుం దగు రాజవైన నీ
కదయత కామినీజనులయుం మదయించుట పాడియే శశీ. 171

మ. కృతదక్షాపకృతి న్మహామయుఁ గళంకి న్సోదరీమందిర
ప్రతిపక్షు న్రజనీచరుం గురుకళత్రప్రాప్తభూయఃకళా
పతను న్ని న్నిరసావహించెఁ ద్రిపురప్రత్యర్థి సర్వజ్ఞ లా
శ్రితదోషస్మృతివిస్మృతివ్రతులు గారే రోహిణీవల్లభా. 172

ఉ. మేదిని నర్జువస్ఫురణ మించి చరించుట సింధుచక్ర
క్షాదృతి నీ కవంతతిలకాంతమువో హరిణాంకకృష్ణప
క్షోదయము స్వరూపకృతియుక్ ఝషకేతువిరోధివిగ్రహా
హ్లాదము లేదదేమి చెప్పుమా. వెలుఁగయ్యెడు నీకు నక్కటా. 173

వ. అని హాలాహలవిరోధి శిరోధిగృహమేధి యగు నవ్వనజవిరోధింబలికి చెలికిఁ దాపో
పశాంతిఁ గానక వరారోహలు గంధవాహు నుద్దేశించి. 174

సీ. కాండభృద్ఘనబాధ గాసినొందినమిత్రు నోమవే సుఖవృత్తి నుల్లసిల్ల
మోచివచ్చినకార్యములఁ బోటనోసఁగవే కుసుమబాణునకు నెక్కుడుధనంబు
చెలిమిఁ బక్షీకరించినమహాశిఖికిఁ జేరుపవె లావరిసమారోహణంబు
మొదలనిన్ను సహస్రముఖములఁ గొనియాడుచక్రి కీవె నితాంతసత్త్వగరిమ
తే. నీవిహారంబు దాక్షిణ్యనిర్భరంబు, నిను సదాగతిగాఁ జూచునిఖిలలోక
మోజగత్ప్రాణ నీవంటియుత్తమునకు, నర్హమే పాంథయోషానిబర్హణంబు. 175

మ. సలిలాహారులు గణ్యపుణ్యతరులం జంద్రాస్యలం గాక నీ
బల ముత్కృష్టబలాధినాథులఁ దరల్పంజాలునే నిన్నుఁ గే
వలముం దైవము దెచ్చి మూలఁబడవైవ న్మించునీలావు లం
కలపాలై చన నీభవంబు దునియల్ గా కృష్ణవర్త్మప్రియా. 176

చ. గరళగళప్రసాదమునఁ గన్నసుతుక్ హరివంటివానిఁ గే
సరిసతి కీవె తజ్జఠరజజ్వలనైకశిఖాప్రశాంతికై
పరుషగతి న్మహామునులఁ బల్లటఁ బెట్టవె యట్టి నీకు నో
కరువలి మేఘవేణికల గాసియొనర్చుట ధాత్రిఁ జిత్రమే. 177

ఉ. కొమ్మలఁ బోట నీకుఁ బ్రతికూలతపుట్టుటయెంత చొక్కపుం
దమ్ముల సాధుమత్సరమునం దలఁకింతువు నిచ్చలుం బరా
గమ్ములఁ రేఁతు వేమఱవు కాలుపదం బిటువంటి నిన్నుఁ దా
నమ్మకచెల్ల సర్వభువనాసువుగాఁ దలపోయఁ బోలునే. 178

వ. అని సమీరుదూఱు నవసరంబున నలరాత్రి. 179

క. స్మరమృగయుఁ విశిఖబాధా, పరవశ యయి యున్న దానిఁ బద్మిని గాఢ
త్వరఁ బరుషరీతి రుచిమత్కిరణ నఖాగ్రములఁ జంద్రకేసరి నొంచెన్. 180

క. యువతికిఁ బ్రాణంబయ్యెం, బవతుగతిం బ్రోఁదిసేసె మలయక్షితిభృ
త్పవమానుఁడు దూరితరై, పవమానుఁడు మోహదావపావకశిఖలన్. 181

వ. ఇట్లు మారతారేశకుమారసమీరబాధావిధురయై యమ్మధురభాషిణి శోష్టిల్లుచుల్లం
బున నొల్లంబోయి నెచ్చెలులఁ గలయ నాలోకించి. 182

సీ. కనలుచుక్కలరాజుకంటఁ బుట్టిననేమి గాడ్పుపేరెము వాఱుఁ గాకయేమి
కంతుఁ డాకృతిఁ బెంచుఁ గాకయేమి కుజాతకలితుఁడై మధువుండుఁ గాకయేమి
హంస మాపగవారికై పోవుఁ గాకేమి గండుఁదుమ్మెద మ్రోయుఁ గాకయేమి
చిలుకవాదులకు వచ్చినవచ్చుఁ గాకేమి కలకంఠి గలహించుఁ గాకయేమి

తే. కమ్మవిగురాకుచే మించుఁ గాకయేమి, కళిక లంతంత మొనఁజూపుఁ గాకయేమి
వెలిపు నాకేల వెన్నెల వెల్లిద్రెళ్ళి, ప్రాణసఖులార వలవంతఁ బాయుదాన. 183

క. అని మోముదమ్మి వాడ, న్మనసిజశిఖిమండ సకలమర్మస్థలముల్
దనువ్రూటాడం గన్నియ, పెనుదెగువ న్గుబ్బతిలివ భీతిలి రతివల్. 184

క. కామాస్త్రములను నాళీ, గ్రామణి వైషమ్య మొదవుఁ గా కెప్పటికిన్
సోమకుమారీమణి యీ, కౌముది దానెట్లసౌమ్యగా నేర్చునొకో. 185

వ. అని జననాథకన్య నాలోకించి. 186

సీ. దరహాసలేశధిక్కరణ మున్నదియె నీనంకి వెన్నెల కేల వహ్నిఁ గురియఁ
గినిసిమాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వగావళి యొనర్పఁ
బ్రతిపక్షి యని తిరస్కృతిఁ జేసితే సాధుపికమునకేల వాదియుసుఁ జూపఁ
జూడఁబోలనిచూపుఁ జూచితే చంచరీకమునకు నేల ఛిద్రములు వెదక

తే. గోచరింపక యొకమూలఁ గూలి చనక, మందతవహింప కిట్లు త్రిమ్మరఁగ నేటి
కని యుదాసీనుఁ జేసితో యభ్రవేణి, యనిలశిశు వేల వీచివాటయ్యె నిపుడు 187

సీ. మనసుగన్న రమాకుమారికాసుతునకుఁ బూర్వాశ్రితుం డైనపూర్ణశశికి
జీవమువంటి దక్షిణసమీరమునకుఁ జేరైనకుసుమాస్త్రబృందమునకుఁ
బలుకుమారనిముద్దుచిలుకకు నెయ్యంపుఁ జైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళియయిన గయ్యాళి తేఁటికి బెట్టు చెట్టైనలేఁ బ్రోఁదిచిగురుమావి

తే. కకట భయమందవలసె వాయనఁగవలసె, బెగడుపడియుండవలసె గంపింపవలసె
నాతురతఁ గూరవలసె బిట్టులుకువలసె, జలదరింపఁగవలసె వే జడియవలసె. 188

ఉ. చేరువమావికెంజివురుచేతికి లోనుగదమ్మ పద్మ కాం
తారమురాళిమానసము నమ్మిన దింతెగదమ్మ కింతుబ

ల్వాయువమైనచిల్కఁ మిగులాతగులాను మెఱుంగునమ్మ నీ
పైరుగదమ్మ మల్లికలు పల్లటమందఁగఁ జేల వానికిన్. 189

ఉ. దారుణభంగిఁ జేర్చ్చినతాపదవజ్వలనోష్మమంటికం
ఠీరవమధ్యతాంతదశ నీతను వల్లవహించినం దగుం
గైరవసోదరస్ఫురణఁ గాంచిన నీనిడువాలుగన్నులే
లారజనిం గుభృజ్జనికళానిధిరాకకుఁ దల్లడిల్లెడిన్. 190

క. అకటా యని చింతింపుము, లికుచకుచ ల్పిలువ సంబళింపక శుకముం
బికము న్మలయానిలశా, బకము న్మదిఁ దలఁచి వినయపాటన మమరన్. 191

ఉ. మాటకు రామ ప్రోదిశుకమా యొకి మారుఁ జయింపరానికై
లాటము జేసె దేటికి భగ్న పికమా యిఁక మాను బోటి నీ
సాటియె ప్రాణమయ్యె వడచల్లుగురే యిటులైన జోటి యె
వ్వోటికిఁ బోవు నీచలువ చూపవనా పవనాఘునాద్భుతిన్. 192

క. అనిపలికి కలికి చెలువలు, మనసిజతాపాతపోష్మమందద్యుతియై
తనరువధూతనువల్లిక, ఘనశీతలరీతిఁ దేర్పఁగాఁ దగు ననుచున్. 193

చ. చెలువలు కిస్టమూలములు శిరము లుజ్జ్వలదంబుమత్పలా
దళములు వెన్నలంబులు సదామ్రదులాకృతి మంచివారిలో
మెలఁగు మృణాళముల్ గరము మెచ్చొదవించుమధూళి మాటలో
పలియును యన్నిటం జెలికిఁ బంచశిలీముఖతాప మారదే. 194

వ. అని శీతలోపచారంబు లాచరించిన. 195

సీ. ననమావి చిగురుపానుపు మహోతను శస్త్రశయ్యగాఁ దలఁచుఁ గంజాతనయన
కడిపోని విరులకంకటి గణించు నభూతకంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపుగుంకుమపువ్వుతలిమ మంగధివాగ్నిశిఖగా విచారించు సింహమధ్య
శిరముకప్పుఁబల్కుఁ సెజ్జ సొక్కపుఁగాయుశరము గా వగదుయోపాలలామ

తే. మంచిపడనుటిపన్నీరు మకరకేతు, విషముగా బుద్ధి నూహించు విద్రుమోష్ఠి
తావిపువ్వాడి శంబరాంతకుపరాగ, మని వితర్కించు లలన మోహైకకలన. 196

వ. ఇట్లు మనోభవమోహదాహంబునం బొక్కి పొరలుచున్న కన్నియ నెచ్చెలులు నిశిత నంబునకు మరలఁ దోడ్కొనివచ్చిరంతఁ గొంతకాల మరిగిన నొక్కనాఁ డేకాంతంబున విద్యామంటపంబుననుండి చదువుఁ జెప్పుచు దదీయసౌందర్యవయోవిలాసంబు లీక్షించి మన్మథాతురుండై మందుండు భువనమోహిని కిట్లనియె. 197

చ. నిరవధికత్వదం బఱచి నీచనుగొండలసంధి డెందపుం
దెరువరిమారచోరనిహతిం బడి మోహవిదాహవేదనన్

బాఁతిలేదుఁ దేర్పపుణ్య మిదిపో యథరామృత మిచ్చి యిందునిం
దరసినగల్గునే పరహితాచరణప్రతిమానధర్మముల్. 198

క. నవలా తావకమోహా, ర్ణవ మేమిటఁగడతు దుస్తరము వివరింపన్
భవదీయస్తనకుంభ, ప్లవ మబ్బినగాక యీవిపత్సమయమునన్. 199

క. అనిద్రాసుఖితంబులు, గానేరవు లోచనములు కంఠద్వయసం
బై నీలావణ్యరసం, బో నవలా త్రేన్పు వెడలకుండుటవలనన్. 200

క. హారవిలాసము గలని, న్నారసి చీకాకుపఱుప కతనుఁడు ముక్తా
హారవిశేషము గలన, న్నారసమున గాసిసేయు టీ వెఱుఁగవో కో. 201

క. గాఢరుచి న్రుచిరం బనఁ, గూడదు నీయధరము ధరసుచచింబై కా
మ్రేడితము కానిచో నే, లా డాపునఁ జూచువారలకు నోరూరున్. 202

క. ఇన్నియును జెప్పనేటికిఁ, బన్నినమరుగానివానిఁ బాసితి నో రా
కన్నియ విన్నియ మెఱయం, గన్నెఱికపుభితి నాకుఁ గరుణింపఁగదే. 203

క. అని దీనాననుఁడై మో, డ్చినకరములతోడఁ బ్రియముఁ జేకొ మ్మనుచుం
దనుఁ బ్రార్థించుధరాసురుఁ, గనుఁగొని రాజన్యకన్యకామణి పలికెన్. 204

క. గురుఁ డనఁగఁ దండ్రి యఘుసం, హరణగుణా శిష్యురాల నైనప్పుడె కూఁ
తుర మేర దప్పి కామా, తురబుద్ధిం గోర్కి సేయుదురె నావోటన్. 205

మ. నరకద్వారకవాటభేది యవమానప్రాప్తిమూలంబు దుః
ఖరుజాపథ్యము పుణ్యలోకగమనఘ్నం బస్థలత్కీర్తి సా
గరమంథాద్రి జనాపవాదహుతభుక్కాష్ఠంబు సత్కారసం
హరణోజ్జృంభము గీడుగాదె పరభామాసంగ మెవ్వానికిన్. 206

ఆ. నీతి సాధువృత్తి నీయది ధరణీసురుఁడవు వేదపారగుఁడవు ధర్మ
తరులతాపరశ్వథము చెల్లఁబో యిట్టి, నీచవృత్తి మెట్లు నీకుఁ గలిగె. 207

తే. ఏను రాజన్యకన్యక నితరజాతి, భామ గానెట్టుపోనఁగు నీపాపవృత్తి
భూసురుఁడవైన యిది నీకు బుద్ధిగాదు, బ్రాహ్మ్యహాని తపోహాని ప్రాణహాని. 208

వ. అని యనేకప్రకారంబుల బోధించుచున్నయన్నీలవేణికి బ్రాహ్మణుం డిట్లనియె. 209

ఆ. నీవు మాటలాడనేర్తువు గురుఁ డేల, చెప్పకొను విరాలి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన, పలువనలువ గూఁతుఁ బట్టికొనఁడె. 210

క. మరుబారిఁ బాఱి చంద్రుఁడు, గురుభామం బ్రేమఁ బిలుచుకొని వినుతబుధుల్
పరిణతముని విబుధుబుధులఁ, గిరిగమనాగమనలీలఁ గాంచుట వినవే. 211

క. గౌతమభార్య నహల్యన్, శాతోదరిఁ బదరి పన్నగశాయిం గాలా
తీత ఘనదర్పయుఁ గూడిన, యాతని కింద్రునకు నేమియయ్యెం జెపుమా. 212

ఆ. ఇట్టిపట్టిసుద్దు లేటికి నీయంగ, సంగలాభ మైన జాలుఁ జెఱప
వెఱప మెఱపి మీఁదఁ బఱతెంచు వత్స్యగ్ర, పాపమునకు నరకకూపమునకు. 213

చ. కడపక నీవు నాపలుకుఁ గాదని వేదనిసర్గమార్గమం
దడిగద లేని మేనియుడియాసఁ దొఱంగి లతాంగి ప్రాణముల్
విడిచెద నీవుచూడ వలవేవడిఁ శాపములోన దీనిలో
విడిదలగాక వేకలఁచి వేచెడి దెయ్యది చూచితో మ్మనన్. 214

శా. అఘోరోక్తులు వీనులం బడిన నాహా పుట్టిరాపట్టిని
ర్ఘోఘుం బీయనమాట తుచ్ఛదురితంబు ల్ధర్మకర్మక్రియా
శ్లాఘ న్మాన్చకొనంగవచ్చుఁ దుదిఁ దైశ్యంబోనియా బ్రహ్మహ
త్యాఘం బేమిటఁబాయు నాకొకయుపాయం బెద్ది యీచేఁతకున్. 215

క. కులగోత్రశీలములకు, న్వెలియైనం దగు మహోగ్రవిప్రప్రాణా
నిలవిచ్యుతి కనొప్పం, గఁదానె యింతకంటెఁ గలుషము గలదే. 216

క. అనుచితకార్యము లేమే, నొనరించినయత్న మొప్ప నుత్తమజను లా
ర్యుని విప్రుని విధ్వస్తా, త్ముని నెప్పుడు సంతరింపుదురు మేలగుటన్. 217

ఉ. కావున నొండుపాయములుగావు మహీసురరక్షణంబ మే
లై విలసిల్లు నేమితెఱఁగైనను మంచిదె యంచు బుద్ధిలో
భావనఁజేసి యచ్చెలువ పల్కె ధరాసుర రెండుజాలలో
నీవది కేగుదెంతు సరణిం జలియింపకయుండు మిత్తటన్. 218

వ. అని యతండు విశ్వసించినట్టుగా నందులకుఁ గొన్నిశపథంబులం బలికి యక్కలికి నగరికరుగుచు నపరాహ్ణగతుం డగుగగనమణి నాలోకించి కీర్తించి కరంబు లురో జాగ్రంబులఁ గీలించి యిట్లనియె. 219

క. ఓలోకమిత్ర యొకరు, జాలయ నీకులముదాన నవసీసుర దు
శ్శీలంబు మాన్చి యిట నా, యీఱవు చెడకుండఁ బ్రోవవే నేఁ డనుచున్. 220

క. చేరఁ జనుదెంచి యలసర, నీరుహహితుఁ డబల యట్లచేయుదు చింతా
భారంబుఁ ద్రోఁచి కదలుమ, గారమునకు ననుచుఁ బఱచె గగనంబునకున్. 221

వ ఆసమయంబున. 222

చ. ఇమఁడు పనూర్ధగుం డరయ నెవ్వఁడు వానికి నీతిలేదు వీఁ
డిమఁడు పనూర్ధగుండు గయమెయ్యడి తద్విసినీదివాంతం
దనికి ప్రదోషకాలమునఁ దానిదె వారుణి నానియున్నవాఁ
డని యులకించె నక్షలె నా నడచెం దగ ఛాయ ప్రాచికిన్. 223

సీ. ఇవి చెందిరికచీరలవుఁగదా తిగిచికుచ్చెలఁబోసి కటులఁ గీల్కొలుపవచ్చు
నివి కుంకుమరసంబులవుఁగదా గబ్బిగుబ్బలజొక్కటంబుగా నలఁదవచ్చు
నివి చెంగలువసెజ్జలవుఁగదా కాఁగిళ్లఁ బ్రియులుండ మెఱసి నిద్రింపవచ్చు
నివి చిగిర్చినమావులవుగదా కటికివేసవులనీడలఁ గ్రీడ సలుపవచ్చు
తే. నివి సరోజాతరాగంబులవుగదా బెడంగడరుపేటికలఁ బెట్టి డాపవచ్చు
ననుచు వరుణావరోధకామినులుపలుక, నస్తగిరిఁ బ్రాఁకె జరఠారుణాతపములు. 224

మ. తనచిత్తంబునఁ బద్మినిం బవలుపొంద న్వారుణీకేళికిం
జనఁ బైకొన్నప్రదోషపీడకు సహించ న్నేర్చ నింకెట్లుగా
దనువో మంగలవాఁడనంచు భృగుపాతప్రీతి నేతెంచెనో
యన సేవించె సరోజబాంధవుఁడు ప్రత్యగ్భూమిభృత్కూటముల్. 225

తే. అపరపర్వతశిఖరసింహాసనమున, గొంతిదడవుండె గ్రహరాజు గ్రుంకుటుడిగి
సమయరమ మజ్జనంబాడి సాగరంబు, దండనుంచిన కుంకుమపిండ మనఁగ. 226

చ. కిరటనిషక్తఖర్జు వడఁగం జిరగర్వసమగ్రమంజన
ద్విరదము పాయుతన్మదస్రుతిం బొడుకెక్కినయస్తసానువం
దరదముఁ జారఁ బైనడుగు లానక యుర్వికి డిగ్గు నుద్ధత
త్వర ననఁ గ్రుంకె భానుఁ డవధాననికుంచితభానుహస్తుఁడై. 227

సీ. పరిపక్వబింబవిభ్రాంతి దవ్వులరాజకీరడింభములు గ్రుక్కిళ్ళుమ్రింగఁ
బ్రత్యగ్రశోణితభ్రమ నుపస్థితములై పంచాననంబుల బయలునాక
పల్లకీపల్లవచ్ఛదనశంక సగంధకరులు రిత్తకురిత్త కరము సాఁపఁ
బుంజీకృతక్రవ్యబుద్ధి నిర్ఘరవృద్ధశార్దూలములు నోళ్ళుచప్పరింప
తే. గైరికద్రవవిచికిత్స గాన నాట, పాటలోష్ఠులు పాలిండ్లఁ బ్రామఁ దివురఁ
బ్రత్యగవనీధరంబునఁ బ్రాకుదెంచె, నపుడు దివసావసానసంధ్యామరీచి. 228

తే. చరమదశఁ గన్నవాసరస్వామిఁ దలఁచి, తమ్ములామోద మతివంతఁ దలఁకుచుండ
నస్తముపగోత్రమయ్యురాగాప్తిఁబొదలె, మొదలఁ బాశ్చాత్యకృత్యమట్టిదయకాదె.

తే. సద్ద్విజశ్రేణి దివసావసానవేళ, చలువఁదేరు వనప్రదేశములఁ జేరి
కన్నులరమోడ్చి విస్పష్టగతులుమీఱ, వారవ్యాజమున జపం బాచరించె. 230

సీ. తావులకొండనెత్తము డిగ్గి చెంగల్వదొనల చల్లనినీటఁ దొప్పదోఁగి
పరిగొన్నపచ్చకప్రపుదుమారము రేచి తరుణపల్లవపరంపరఁ దెరల్చి
వికసితప్రసవజాలకరేణువులనంటి గంధసంపద దేటిగములఁ బ్రోచి
బలిమి గానవపరంపరల నుజ్జులలూచి తీవపందిళ్ళలోఁ జరిగితిరిగి
తే. రొండ పాడమూఁక పగల్లనిర్లు గవయు, తియ్యతావుల క్రీడఁ దెరువుసాగ

కల్లనల్లనఁ జనుదెంచె నతిసుభద్ర, వారణంబన సాయంసమీరణంబు. 231

చ. సరసులసంగతిం గలుగుచక్కవిత్తములఁ జేరఁబోయి క
న్నరవిగిడించి వ్రాల్చుచిగురాకులడగ్గఱి పత్త్రము ల్విశా
కరద్రుపదోఘయిల్ గదిసి కప్పుపడం బరిము క్తప్రాంతకే
సరములఁ జెంది కందునొకజక్కవ దాఁచివియోగవేదనన్. 232

సీ. నిండారుకమ్మదేనియ జుజ్జనంబాడి కడిమిపుప్పొడివన్నె మడుగుఁగట్టి
కేసుగన్నుల జంచరీకాంజనముఁ జేర్చి తనపల్లి ఫేనచందనముఁ బూసి
తులలేనితూఁడుజేతుల నూర్మికలుదాల్చి జలకణముక్తికచ్ఛటలఁ బూని
మొగ్గపాలిండ్లసొంపున హిమాంబువ్రనుంచి యామోదసంపద నతిశయిల్లి
తే. హంసకంబుల నిజపదం బలవరించి, భువనమోహన మైనవైభవముఁ గాంచి
కలువవిరిబోడి రాజరాకఁ దలంచి, పొలిచె వాసకసజ్జికాస్ఫురణ నపుడు. 233

తే. ఝంకృతివ్యాజమున పలికినతలి, యూఱడింపఁగఁ దనకన్నవారిలోన
వనపథిక్లాంతిమిత్త్రమోహార్తి ఖిన్న, తమ్మికొమరాలు పత్త్రనేత్రములు మోడ్చె.

సీ. కనలుసంధ్యార్చిఁ బేర్చినభఃకరిమేన బుటములెత్తినసీరుబొబ్బలనఁగఁ
గాలమాంత్రికుఁ డంధకారదానవబలిక్రియకు రాల్చినపేలగింజలనఁగఁ
దాండవభ్రమిఖమూర్ధజుఁ డంజలిపుటంబున విధిర్చినకమ్మపూవులనఁగ
మైరవసింధుసంపర్కశర్కరదేవమును లోనర్చినలింగమూర్తులనఁగఁ
తే. గమలగర్భాండగోస్తనీకాయమాన, జటీపరిపక్వఫలగుళుచ్ఛములనంగ
నఖిలజనలోచనోత్సవం బాచరించెఁ, దామరసవైరికులదారతారకములు 235

ఉ. స్నేహవిరక్తిఁ గాలగతిచేఁ గని మిత్త్రుఁడు చామగక్రియా
మోహితుఁ డౌటఁ గన్గొని ప్రమోదవిధిం దనుఁజేర నీగురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయనిపూనినశక్రదిగ్గజ
స్త్రోహినిమోము విన్నఁదనమో యనఁ బాండిమదోఁచె నెయ్యెడన్. 236

సీ. బలభిద్దిశావశాప్రతిమ గామినిముద్దుగులుకుటీరికనవ్వ తెలివిచెప్ప
యుదయమస్తక్రీడ నాడికోటులుమోవఁ గూలినచొదంతికొమ్ముఁబోలి
గగనవాహినిరోంపి గాడికొండొకదోఁచు కమలాప్తురథరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణికరంబున నెత్తిచూచు క్రొన్నెమలీకసురటి నొరసి
తే. యంచు గనుపట్టి మఱియుంచుకంత మెఱసి, సగముపర్యాయకమున సాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ, జదలఁ బూర్ణకళాసీమ చందమామ. 237

సీ. అది సుధాకరబింబమా కాదు మదికామునన్నె వేలుపుటన్నవత్తిగాని
యాది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలుదంతపుటరిగోలఁ గాని

యది నిండుచలివెలుంగా కాదు మబ్బుటేనుఁగుఁదోలుతెలనోటి మొగముగాని
యది చకోరములవిందా కాదు దుగ్ధాబ్ధికడ జనించిన వెన్నకరుడుగాని
తే. యది నిశామిత్రమా కాదు మదవియుక్త, యువఘరట్టశిలావలయంబుగాని
యని జను ల్వొచ్చి కీర్తింప నతిశయిల్లెఁ, బ్రోషజాదిలికలువపూఁబోడికలిమి 238

సీ. ఇనకరాంకురముల కెడయాని మ్రాని క్రీనీడజాడల డాఁకి నిలిచెఁ గొన్ని
మధురసప్రస్నిగ్ధమాక్షికచ్ఛత్రభాగవులో గవులో నడఁగెఁ గొన్ని
కలనైనవిఱుగెఱుంగనిపోటుపరికరామూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని
చేసేఁతబడి తలంచినలేసు బంతి మవ్వలువగొమ్మలదాడిఁ బఱచెఁ గొన్ని
తే. త్రాసమునఁ బొంది పద్ధతి భ్రంశనముల, గూపకుహరాంతరంబులఁ గూడెఁ గొన్ని
యిరులు తప్పరు లన నప్పుడేమిచెప్ప, రాజు బరచక్రహరణసంరంభుఁ జూచి 239

సీ. ప్రాయమింకినవాలుపాలిండ్ల వెలయాండ్రు పసుపుపుట్టక మూలఁబడి కృశింప
నేపురేగినరంకుటెలదీఁగబోఁడులు వింతకాఁగిలిలేక వెతలఁబొందఁ
కడిపోనితెరనాటకపుటూరుజంగాలు కేళికల్ గూడ కోగిరము లెత్త
తడక ద్రోపరిమ్రుచ్చుపొగుపులు మఱి దొంగపనిముక్కవాలైనఁబస్తుపోర
తే. గంటవేఁటల దిసుగాడుకలసులెలుకు,మూఁక పెఱజిక్కికాళ్ళు మోములను వావఁ
బిండిచల్లినచందానఁ బేదవారి, దివిచువెన్నెల సాంద్రదీధితి వహించె. 240

సీ. చేఁపుపుట్టినగభస్తికలు ముక్కులఁ గ్రుచ్చి త్రచ్చి యూరటలేక క్రోలఁ గొన్ని
యల్లులానఁగఁ ద్రావి యసుమరుచ్ఛరణపఁ జోటుచాలక నేలఁ జూడఁ గొన్ని
కదుసిగ్గుకేరుతొల్పడుపుదోమటఁ జొక్కి యానందమున జిందులాడుఁ గొన్ని
నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంతసించుఁ గొన్ని
తే. యొలముల డాఁగి తలచూపనోడి తల్లడించు నరికోటిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁబట్టించి పేరెము ల్వారుఁగొన్ని, కైరవాప్తాతపములఁ జకోరకములు. 241

వ. ఆసమయంబున. 242

సీ. కట్టినజినుగుసిరాక్కవిధోవతి పింజయాపార్ష్ణిలంబిరయై యతిశయిల్ల
ఘాతోత్తరీయవస్త్రములోను శుభ్రశుభ్రంబులై బ్రహ్మసూత్రములు మెఱయఁ
గవకవీరుద్గ్రంధికలు కపోవాలావాలసీమబచ్చనిడాలు చిమ్మరువెట్ట
నామోదరసపుష్టి నచ్ఛిద్రమై ఫాలతలమున గోపిచందనము గ్రాల
తే. నపటుశిటఖేలనంబున నమరుబిళ్ళ, సికచొకాటంబువిరులతోఁ జెలిమిసేయ
నడుమ జగజంపుదోఁపుఁబచ్చపెము దనర, వైదికబ్రాహ్మణుఁడు నిండువన్నె మెఱసి.
తే. క్రముకభంగపరంపరాకలితముఖున, నన్నెతీకతిత్తిమేఖలావల్లి నిఱిరి

యాకు లక్షించి యలబలం బడఁగు టరసి, యునికి వెలువడి బ్రాహ్మణుం డొక్కరుండు.

ఉ. అప్పు డధిజ్యచాపధరుఁడై మరుఁ డేర్పడి వెంటనంటి రాఁ
జొప్పున జాలిమాలి యఘుసూరుఁడు పాఱుఁడు వచ్చివచ్చి యా
యొప్పులకుప్పరామికి నయో విధియంచు దిశాశ్రుధారలం
గప్పఁగ మోహనిశ్వసనకంపితచారుతరాధరోష్ఠుఁడై. 245

క. చెదరెడి మేనును జెక్కున, గదిసిన కెంగేలు గ్రాలఁగా విప్రుఁడు లే
నిదురెఱుఁగనికంటంబడి, వది యగు మరుమంట మంటపంబున నుండెన్. 246

ఆ. చీమ చిటుకుమన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న, నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుం డాలించు, నప్పు డబల కాలిచప్పు డనుచు. 247

క. రాదా యొఁ జూచితే యను, రాదా యడ్డంకి బట్టి రాదను నిర్మ
ర్యాదలు సీమంతినులను, హా దైవము ప్రొద్దుపోయె నని తలయూఁచున్. 248

క. ఎదురుకొన నతిగి చాయను, గదలుతలారులకు వెఱచి క్రమ్మరు నేన
మ్మదవతికి నేలదాదులు, పొదివికొన న్నిదురపోయెఁ బొమ్మని పలుకున్. 249

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీగీర్వాణుండు చలితవిరో
గిప్రాణుం డగుపంచబాణుం దలంచి. 250

మ. ద్విజరాజుం దలదాల్చుకొన్న తనిదృగ్దప్తిప్రభూతాగ్నులన్
రజమై పోయిననిన్ను నీతిరసదూరా మార యీకేవల
ద్విజరా జల్గిన నేమి సేయునొ ప్రశాంతిం గాంతి మత్ప్రాయక
వ్రజముం గూర్పకు నారి నారి ననుఁ గూర్పం దేర్పఁ బుణ్యంబగున్. 251

చ. శివ గణనాయకా యనిన శీఘ్రమె కార్యము లడ్డపాటులే
కవు యనునాథపంచవిశిఖా యన హస్తపదాస్థికాండముల్
చివికిడువట్టినొప్పు లోడిసె ప్రసవాస్త్రులు గంట్లు బిబ్బపుం
డ్లవు నిటువంటిపుత్త్రుఁ దగవా కన నమ్మధుకైటభారికిన్. 252

వ. అని పనివి పనివి యనంగబాణమూర్ఛితుండుం బోలె నమ్మహీసురుండు నిద్రాముద్రా
లోచనుం డయ్యె నయ్యవసరంబున. 253

క. అనిశ ధరణీసురునకుఁ, దా నిచ్చినమాటపట్టు దలఁచి తదీయ
స్థానీయపాలిక న్దా, దీనాకృతిగాక నగరతిత్వర వెడలెన్. 254

క. జలధరమాలికలోపలి, తొలుకార్మెఱుఁగనఁగ యమవిధుంతుద హాలా
హలకాచమేచకద్యుతి, గలనీలాంబరము ముసుఁగుగాఁ గైకొనుచున్. 255

క. పరివృత్తికంధరయై దిశ, లరయుచు నడ దడపడంగ నరుదెంచి ధరా
సురు నిద్రపోయెదే యని, కరసంజ్ఞం దెలుప మేలుకని వాఁ డంతన్. 256

వ. ఆదిత్యచోదితుండై క్రోధించి. 257

శా. అయ్యో యేఁడిట కేఁగుదెంతువని నీ కాశించి యిచ్చోట గ
న్నయ్యంజాలక నిద్రగాచి యిపుడే మోహార్తి న్మాతృజా
లయ్యె న్వ్యాలవజాముఁ జొచ్చె దడవాయ న్వచ్చి విచ్చేయుమీ
పర్యాటంబు దిశఁజాలు రోసితి వనుస్థానార్థినై పోయెదన్. 258

చ. కడువడి రెండుజాము లగుగం బరిరంభణ మీఁదలంచి నీ
కడ కరుదెంతు రానిపనిగల్గిన నాఁటికిఁ దండ్రిఁ గాశిలోఁ
బొడిచిన క్రూరకర్మమునఁ బోవుదు వంటివి నూన్యతంబు నీ
కొడుకయి పోయె రాక కిదిగో గురులింపఁబురాత్రిపాపముల్. 259

క. కడుసరసములకుఁ బ్రొద్దై, క్కడిది దురంతోపగూహగతులకుఁ బ్రొద్దె
క్కడిది యొకసెలవు సేసితె, కడజామున వచ్చి చాల్చొకాలుకుబుద్ధిన్. 260

ఆ. కొదవలేక రతుల గోవావుఁ గోడనై, పొదలఁ బెద్దతపవు ప్రొద్దులేమ
నోరసి తెడ్డు నాఁకి యుపవాసకర్మంబు, చెలుదుకొనఁగ దీనిచేత నేమి 261

క. అని చిందరేఁగిన ట్లచ్చినఁ టిధరాసురుఁడు చెంతఁ జేపడినవిధి
న్మని గాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బాసి యబ్బగాఁడుగఁ బోయెన్. 262

క. చనఁ దనకు మనసువచ్చిన, పని యది గా కునికిఁ దీనఁ బట్టక చనుఁ గా
కని యూరకుండె నట్లుం, డి నరాధిపకన్య దనకు డెందములోనన్. 263

క. సరిప్రొద్దున నరుదెంచితి, వరుణోదయసమయము మెట్టులయ్యె దురంత
స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్. 264

క. కామాంధోపి నపశ్యతి, నా మును నే విన్నదాననకదా వెలఁగే
లా మందునిమాటలకని, యాముద్దుంగుమ్మ మందహాసముఁ దాల్చెన్. 265

క. వానీరచరాగ్రణి బహు, మానున కిట్లనియె నట్లు మహీసురుఁ డన్య
స్థానస్థుఁ డయినపిమ్మట, నానెలఁతుక యేమిసేసె నన గపి పలికెన్. 266

క. మహీసురుఁ డట్లరిగిన న, మ్మహిళారత్నంబు తొడసుమాలితి నని దు
స్సహరయమున భయమున నిజ, గృహమునకుం బోవఁ దత్తరింపఁగ నంతన్. 267

చ. ఐనదసమృద్ధి నీలికడవంబలె నంబరమొప్పఁ జంచలల్
మినమినలీన దోన నుఱిమె న్వడి గండులు వ్రాలె వ్రాలెఁ దొ
ల్చినుకును దూర్పుఁటీదరొలసెం బలసెం జడివానసోనతో
రనఁ బుకవిద్విషద్గళసహస్రభవాకృతిఁ బర్వెఁ జీఁకటుల్. 268

క. ఇది రాయిరప్ప పల్లం, బిది మిట్టిది మాకుమట్ట యిది పామిది గా
మిది యని వివరింపఁగఁ బె, ట్టిదమై యొప్పెసఁగు నక్కటికిఁ జీఁకటిలోన్. 269

చ. సుడిపడి యింటిత్రోవయనుచుం జెరచొప్పునఁ బోయిపోయి య
ప్పడఁతి దృషద్వతీసరిదుపాంతదురంతవనాంతరంబులం
బడి మలుదీవలుం దవిలి భంగములై కురులుం దుకూలముం
దొడిగినకంచుకం బెడలఁ దొట్టినభీతి నొడల్వడంకఁగాన్. 270

క. ఈరము లూఱట నొందక, దూఱుచు నో రలయ నలువ దూఱుచు రొంపిం
జాఱుచు నెంతేవెలవెలఁ, బాఱుచు రాజన్యకన్య పఱచి యటంతన్. 271

శా. ఆయుగ్రాటవి నొక్కచోట భయదంబై తోఁచురక్షోవట
చ్ఛాయం బీనుఁగుఁ ద్రొక్కి కోమలకరాబ్జాతంబునంబట్టి య
య్యో యీమానవుఁ డెవ్వఁడొక్కొ మృతికేమో హేతు వంచు న్విచా
రాయత్తం బగునాత్మఁ బోఁ దెరువులే కచ్చోటఁ దా నున్నెడన్. 272

క. ఆవటమునఁ ద్రింశద్వ, ర్షావధిగా నున్నభూసురాసురుఁడు విశా
లావరపుత్రికి హితసం, భావన సాక్షాత్కరించి పలికెం బ్రీతిన్. 273

క. మనుజాలు మిట్టాడని యీ, ఘనగహనంబున నిశీథకాలమునం జ
చ్చినవరువక్కటి తెక్కటిఁ, దనుమధ్యా సంచరించెదవు నిశ్శంకన్. 274

తే. ముంచు కన్నీరు మంచున మోమువన్మి, వాడియున్నది దీర్ఘనిశ్వాసనిహతిఁ
దల్లడిల్లెమనధరోష్ఠపల్లవంబు, ఇంతసలనంత నవ్వ నీ వెవ్వ రనుచు. 275

క. అనుమానింపక తనుభృ, త్తినువిసర వపారసప్రదానవిధాన
స్వనమల్లుకింబు వదనం, బున ద్రిప్పుపలాశి కింగుముఖి యిట్లనియెన్. 276

క. వినయవిశాల విశాలా, వనిపాలునిపుత్రి దైవవశమున నస్త
జ్జననీజనకుల జనకుల, వినతులపా త్రైడసి యాటవికసతి యయితిన్. 277

శా. ఏ నిత్సేరుట యెట్లు లీపడినవాఁ డెవ్వాఁడు వర్షాతమః
పౌనఃపున్యముఁ దెల్పువల్పువచనలా ప్రత్యగ్ర లాలోకముల్
మేనభ్రంలివా ముగ్రమృత్యుముఖగంభీకంబునో రెవ్వర
య్యా నిన్నూచిన గుండె ఝల్లురనుఁ దథ్యం బానతీవే యనన్. 278

మ. అతఁ డత్యంతితమప్రపన్నహృదయుండై పల్కె నే నంచిత
శ్రుతిసంపన్నుఁడ బ్రహ్మరాక్షసుఁడ నిచ్చోఁ గాపురం బుండుదున్
మతి భీతిల్లకు నీకు నొజ్జ లితఁడమ్మా నీకు నేకారి యీ
క్షితిజచ్ఛాయమనోజబాణహతి నొచ్చె న్మాట లింకేటికిన్. 279

క. గురుఁడ నిది శిష్యురా, లితరుణీమణి గనయ దుష్కృతం బని మఱిలో
నరసి రొఱుంగనియీద్భళ, నరపశువుల మేలుపొందునా రొండైనన్. 280

క. నూరిశ్రేష్ఠునకు వరా, చారగరిష్ఠునకు నీకు సద్విప్రా యీ
ఘోరనిశాచరవేషం, బేరూపునఁ గలిగె ననిన నెఱిఁగింతుఁ జెలీ. 281

సీ. మొదల గౌశాంబి నుండుదు వేదశాస్త్రార్థచతురుండ నాపేరు చండశర్మ
కులకాంత కాంత యచ్చెలువతమ్ముఁడు మూలఘటకాంకుఁ డతఁ డొక్క-కన్యఁ బెండ్లి
గాఁబోవుటయు గోడిగములకు నేనును బనిబూని యటువాని ననుసరించి
యతిసభ్యునట్ల పోయితిఁ బోవ నను బెండ్లిపెద్దగాఁ దలఁచి యావిప్రతండ్రి
తే. కదిసి యుల్లనిగుణరూపగౌరవములు, వేఁడుటయు నావివేకంబు వీటిఁబోవ
నవగుణంబులప్రోవు మూర్ఖాత్ముఁ డంటి, ననిన నమ్మాట లతఁడు సత్యములఁ జేసి 282

క. కాతాళంబున నిచ్చిన, కూఁతు నతం డీక పెడలఁగొట్టిన నపుడా
చేతను నాహృదయంబు, జ్జూతశఁ బ్రేంఖోళనప్రయోజన మానెన్. 283

క. మఱఁది యని యఱుగుపోకల, నెఱుఁగక యిట్లాడి లోను లగ్గింపం దేం
పరినై కూడినపెండిలిఁ, జెఱిచితి నాకన్నఁ గష్టశీలుఁడు గలఁడే. 284

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నయో హృత్ప్రతీపపరితాపశిఖిం
గాయము వేఁగెడునని పల, చేయి కపోలమునఁ జేర్చి చింతిలుచుంటిన్. 285

చ. అగణితధర్మకర్మరతుఁ డంచట ము న్నరుదెంచియున్నవాఁ
డగుట మదుగ్రకృత్యము పు డారసి ముద్గలనామమైత్రికుం
డగలక నన్నుఁజూచి కుటిలాత్మ కళత్రసహోదరున్నహా
సుగుణధురీణుఁ గానిమనుజుండని యూరక పల్కఁబోలునే. 286

ఆ. వేయుబాంకి పెండ్లిసేయుదు రుత్తము, జను లతిప్రయాసమునను నోర్చి
చెనఁటినేఁత నిట్లు మనువులఁ జెఱిచిన, విసపువిత్తుఁ జెప్ప వినము గాని. 287

ఉ. మోఘము గాక నీవు తలమోచియొనర్చిన యట్టియుద్ధురం
బౌఘము నేఁడు పిల్లికొలరయి చరణంబులఁ బ్రాఁకుసజ్జన
శ్లాఘనయోగ్యభూమిసురజన్మము వీడ్కొని కానలోఁ గ్రశా
ఖాఘనవృత్తవర్తివయి క్రాలునిశాచరవేష మేర్పడన్. 288

ఉ. వంకరకష్టకింగలము వైద్యము నీకిది వోలునంచు ని
శ్శంకనవృత్తి ముద్గలుఁడు శాపము నిచ్చిన శోకబాష్పభా
రాంకితనేత్రపంకజుఁడనై చరణంబుల వ్రాలి యోదయా
లంకృతచిత్త యోబుధకళానిధి యోగుణధుర్య కావవే. 2·9

చ. అనుఁగుమఱఁదిగానఁ బరిహాసపురస్సరభాషలాడ నీ
పనిజనియించె నీచరణపంకరుహంబులు సాక్షిగా మదిం

గవలు వహించి యిట్టిలోఁ బగాని ప్రయోజన మాచరింప నీ
యనుపమదివ్యదృష్టి కొకఁ దద్దమె చూడుము శౌర్యశేరముల్. 290

క. అని యేను మేను వడఁక, న్వనితాజనతార్తిఁ బాగల వారించి ప్రబో
ధనిరీక్షణములసర్వముఁ, గనుఁగొని యితఁ డవపరాధిగా యని శాంతిన్. 291

వ. ముద్గలుండు వ న్నాలోకించి యిట్లనియె. 292

చ. కలుషముఁ బూని పెండ్లిపనికిం బ్రతికూలుఁడ వైతి విట్టు మె
క్కుల మిదిగాదె నీమ్న సకల్మష మానటులైనఁ గేరడం
బుల కిది చోటె మోహమయి పోవకు పావచనంబు గన్నచా
యలు నీకు బ్రహ్మరాక్షసుఁడవై యిల నీవు చరింపుచుండఁగన్. 293

ఉ. అల్లనవంతమూలఘటకాంకుఁడు భూమినిలింపకన్యకా
హల్లకభల్లభగ్నహృదయస్థలుఁడై తను పుజ్జగించి ము
త్పల్లున కుద్భవించుజయసేనుఁడు నా నలివిప్రకన్య యు
త్ఫుల్లసరోజనేత్ర ప్రియపుత్రిక యై పొడము న్సకీర్తికిన్. 294

ఉ. ఆరెలనాగ దైవగతి నద్ధనికం గతిదప్పి నీతరు
చ్ఛాయకు వచ్చు నాసరసిజచ్ఛదనేత్రకు నవ్వసుంధరా
నాయకమూర్తికిం దగులొనర్పుము సంశయమేది యంతలోఁ
బాయుమహీసురాసురత బ్రహ్మపదంబు భజింతు పిమ్మటన్. 295

మ. అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోవం బోవ నాలోన నె
ట్టని గ్రుడ్లుం గులిశంబులుం దెగడుకోఱ ల్బాడబజ్వాలజితా
ననముం జంజారువెండ్రుక ల్బ్రహుదకర్ణద్వంద్వముం గల్గి మే
దినికిన్ క్రొవ్విగుక బ్రహ్మరాక్షసుఁడ నైతిం జంచరీకాలకా. 296

వ. అట్లుర్వీపూర్వగీర్వాణుండనై సకలప్రాణిభక్షణంబునఁ గాక్షింభర్యంబు ప్రవర్తిల్ల నివ్వటపి నాశ్రయించి యుండితి నిప్పటికి ముప్పదిసంవత్సరంబులు గడచె నమ్ముద్గలుండు చెప్పినట్లు నామరంది జయసేనుండై పుట్టె నవ్విప్రకన్యకవు నీవు నిన్నన్నగనాథకుమారునకుం బరిణయంబు సేసి యాసురం బగు నివ్వేషం బపనయించెద ననుటయు వలరుమొగంబున రాజన్యకన్య భూసురాసురున కిట్లనియె 297

క. ఇచ్చోట నానిమిత్తము, వచ్చిన యవ్విప్రు సుప్రసన్నత్వము నేఁ
డచ్చుపడ మునిచి పురికిం, బుచ్చి జగద్వినతకీర్తిఁ బొగడొందఁగదే. 298

క. భూసురవాత్స్యాఘమహా, త్రాసమునకు వెఱతునని పదంబులఁ బడి గా
ఢాసక్తిం బ్రార్థించిన, నాసురకులశాత్రవుఁడు దయాభిముఖుండై. 299

ఉ. అవిరతిపల్లోఁడికృప కద్భుతమంది భవన్నిరోగ మే
లావృథయోా ఫలింపక బలాయబలా యని విప్రుఁగొంచు ర
త్నోవిభుఁడేగి కీనుఁగున సుప్రదతీర్థమునం దొరల్చి సం
జీవితుఁ జేసి మందిరముఁ జేర్చి భజించి కుమారి కిట్లనున్. 300

క. చనిపోయిన నీయొజ్జలు, మనుగడఁ గనిరి న్వసించె మందిరమున నో
తనుమధ్య మెుగిడించిన, కనుఁగవతో నిలువు రాజాకడ నినుఁజేర్తున్. 301

చ. పలుదు విలంబ మన్నఁ బ్రతివాక్యము లాడక మోడ్పుకంటితో
నిలిచిన బ్రహ్మరాక్షసుఁడు నిర్భరవేగధురాధురీణుఁడై
పొలఁతుక నప్పు డెత్తుకొనిపోయి మనోజవుఁ డాట నిల్పెఁ బా
టలనగరోపకంఠనిబిడద్రుమకాంచనసౌధవీథికన్. 302

వ. ఆసమయంబున. 303

శా. గొందుల్ వీడ్కొని పక్కణాంతరకుటీకూటాధ్వసంధు ల్పరా
స్కందుల్ వ్రాలఁడ నవక్రచక్రములు ముచ్చ ట్లాడ నిచ్ఛాగతిన్
గ్రిందుల్ మీఁదులుగా సతీపతులు గౌఁగిళ్ళూడ దీప్తుల్ధర
ల్పొందుల్ గూడఁ ద్రిభంగిగంగి మెరసెం బుంస్కకుక్కుటవ్రాతముల్. 304

చ. అతికృతికన్య నందినమురారివిరాజదనంతభోగసం
స్థితి ప్రతివారమున్ బోదల శిష్యులు పుణ్యజను ల్జయక్రియో
న్నతులు దురంతశాస్త్రకలనం బ్రతివాదుల నోర్వ సర్వతో
గతమతికుండు నిల్చెఁ గవికౌశికదిక్కటకాగ్రపీఠికన్. 305

చ. పరవసులక్ష్మి నుల్లసిలువారికి నేమిగొలంతి యీవిభా
కరునకు సంజనిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టిదో
సెరవులసొమ్ము సత్యమగునే యని వెల్వలనయ్యె పహ్నినాఁ
బరిగళితద్యుతి న్వెలకఁబారె నిశాంతనిశాంతదీపముల్. 306

చ. కనుఁగొని చైత్యనిత్యపథికప్రవిబోధకరంబులై ఖగ
స్వనము లుదగ్రబాహ్యవనవాటికల న్వినవయ్యె నయ్యెడన్
ఘనమదభృత్తమఃకరటికంపితదిగ్వటపస్ఫురన్నభో
వనరుహసంక్షరత్కుసుమవర్షము చాడ్పున జాలెఁ జుక్కలున్. 307

సీ. ధారాధరస్మయోదయవియచ్చికురబంధమునఁ దారాలతాంతములు రాలె
రోదసీతనుసమారోహాంగకార్ణణమదవిలేపనరేఖ మసఁగిపోయెఁ
జక్రవాకస్తనస్థాతృనీహారఘర్మాంబువు ప్రత్యక్షమై యుడంగె
మధుపకజ్జలభాసమానకైరవలోచనములఁ నిద్రాముద్ర సనలుపెట్టె

తే. మలయనిలయసుగంధసంబంధమంద, పవననిశ్వాసవీచిక ల్పాఱుదీఱ
సంప్రభూతకళారమ్యసౌమ్యగమ్య, గంగసంగక్రమాయామయామవతి. 308

చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు కౌఁగిలింతలం
బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములు న్భరంబునన్
దిగిచినసొమ్ములు న్మదవతీతిలకంబులచేత వేఁకువ
న్మగుడ సపర్యఁ గైకొనిరొ మాన్యులు గారె గుణప్రదీపకుల్. 3 9

చ. కవిసి కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచి లోఁ
జివికెడువారు హస్తములఁ జీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరులమోవులాని యరగన్నిడువారును శక్యులం బరా
భవ మొనరింపలేక వగపొల్పెడువారును నైరి జవ్వనుల్. 310

శా. నానాదీపమరీచికల్ గొనిరొనో నాఁ జూడ నిద్రాపరా
ధీనస్త్రీనయనంబులం బ్రియదృఢాశ్లేషప్రకుబ్జీభవ
స్తీనాక్షీకుచము ల్దిగం గనికరామ్రేడీకృతోత్క్రాంతకాం
తానుష్ఠాధరము ల్జపాసుమము చెన్నారె న్నిశాంతంబునన్. 311

మ. తులనప్రేమరసోల్లసన్మిథునచేతోజాతసంగ్రామకాం
క్షలు వారించె నుషఃప్రసూచకగతుల్ శాలాజరద్దీపికా
కళికల్ శైత్యదృఢస్తనస్తబకముక్తాహారము ల్వాసనల్
గలయం జల్లెడుపూఁత లిష్టరుచికృత్కర్పూరతాంబూలముల్. 312

సీ. శ్రమవార్ని మజ్జనజటిలాలకంబులు సంధూతకుంకుమస్థాసకములు
జాగరారుణితలోచనసరోజంబులు కాంతచుంబనముక్తకజ్జలములు
కరచపేటనిరస్తకరినక్రచిత్రంబు లభినవదిగలంకృతాధరములు
సృణినమత్కరికాభరణభృద్గళంబు లనూననిద్రాముద్రితాననములు
తే. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, కుచపయోధరశరహారకపలమణులు
కలితతాంబూలరసరక్తగల్లతలము, లమరఁ గొమరాండ్రు పొలిచి రహర్ముఖమున

శా. ఆశాఖడ్గమిళత్తమోమలినహృత్యర్ధంబు నిర్వాంత్యసం
ధ్యాశిల్పిప్రభుకల్ప్యమానకురువిందక్షోదసమ్మిశ్రలా
క్షాశాణం బనఁ బ్రాచిదోఁచె బిసినీకాంతుండు జాగ్రత్పురో
దేశాంగారకరాజినాఁగ మొదలం దీండ్రించె సంధ్యాప్రభల్. 314

సీ. ప్రసవితద్యుక్షేత్రఘుసృణసస్యంబులు హల్లకప్రియసాలపల్లవములు
తిమిరేంధనప్రవర్ధితదావశిఖ లుషఃపవనభుగ్వ్రతభోగఫలకమణులు

హరిపురంధ్రీకుసుంభాంబరంబులు ఘనప్రాక్పరివ్రాడ్జటారక్తిమములు
దంభోళిఖండితోదయపక్షరుధిరంబులై రాజితాంగసింధూరరజము
తే. పక్షిపృత్తిప్రమోదకృద్యామినీవి, యోగదవధూమ్యధాళిఖినోన్మదురమణి
నవ్యహల్లకతల్పము ల్పాఁ జెలఁగె, నంబరంబున నపుడు బాలాతపములు. 315

ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబునిధి కేగుచెడం దగ వారక న్మయూ
ఖమ్ముల నెన్నికొంచితముగా నొనరించినవేశ్వరక్తిలోఁ
గ్రమ్మఁగఁ బ్రాక్పరిస్ఫురదరవిరశ్ములఁ బద్మినివేగుపాటునం
గ్రమ్మఱ రెక్కఁబెట్టె ననఁగా వికసించె సహస్రపత్రముల్. 316

ఉ. గాసిలి రాజు మన్ననలు గాంచిన నే నొరుఁ జూడనంచుక
న్మూసినభంగిఁ గైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగజనవహ్నిసముత్థితధూమరాజులో
నాసరసీజగర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్. 317

తే. ఇట్లు సూర్యోదయంబైన నేకతమున, బ్రహ్మరాత్ముఁ డద్ధరాపాలుఁ గదిసి
పూర్వవృత్తాంతమంతయుఁ బొసఁగఁ జెప్పి, యబ్జముఖిఁ జూపి పెండ్లిగమ్మనుచునిచ్చె.

వ. ఇచ్చిన. 319

క. ఆరామామణిఁ గైకొని, యారామరుఁ డాదరార్పితాతిథ్యుండై
యారామన్యగ్రోధగ, రారహసౌధమున బ్రహ్మరాత్ముకు నునిచెన్. 320

క. ఉనిచి ప్రణమిల్లి క్రమ్మఱ, చని యవ్విప్రాసురునకు సరసాన్నని వే
దనవిధికిఁ బుణ్యభూసుర, జనుల నియోగించె జనితసౌహార్దమునన్. 321

ఉ. కూరిమి తండ్రిపాదములకుం బ్రణమిల్లి సుకీర్తికన్య నం
భోరుహలోచన న్భువనమోహినిఁ జూపి ధరామరు న్నిశా
చారుచరిత్ర మేరుపడ సర్వముఁ జెప్పినఁ బుత్రు మెచ్చి యు
ర్వీరమణుండు బంధుపృథివీగురుసంఘము బిలిపించి యిట్లనెన్. 322

సీ. ఘనులార మనకు రక్తస్పర్శసంబంధ గాఁడె సుకీర్తి విఖ్యాతమూర్తి
దైవయోగమున నాతనిపుత్రిఁ గాంచనప్రతిమానగాత్రి చేపడియె మనకు
మనజయసేనకుమారున కాపూర్ణశీతాంశుముఖిఁ బెండ్లిసేయువలయు
లాలన నవ్విశాలానాథుఁ డిచటికి వచ్చినఁ జాట్టంపువరుస గాదె
తే. యతుల నయమార్గరతుల దండాధిపతుల, ననిచి రప్పింతమా యమ్మహామహంబు
నతఁడు వీక్షింపఁ గాకన్న నాప్తమిత్రు, లుచితమిక్కార్యమొనరింప నొప్పదనిరి.

క. నావిని మత్సెల్లుఁడు హా, లావీక్షితనీతిగంత్రుల న్మంత్రుల సం
భావించి పనుపుటయు న,ప్పావనమతు లరిగి వినయపాటవ ఘనమరన్. 324

సీ. రోహిణీవిరహాభిహతసుధాకరబింబ మన ఘనగ్లానదీనాస్య మమర
శోకలునిండారి పెల్లుబ్బినశోకరసంబుతీరున వేఁడికన్నీరు దొరుగ
మెఱుఁగుటద్దపుబిళ్ళమీఁదికెంపులుతేరక్రియ గపోలములఁ గెంగేలు మెఱయ
నతిమరుచ్చలమానలతభంగి నిశ్వాసధారచంద్రిక మోవి దళ్ళడిల్లఁ
తే. దనయు నీలోన లేదుగదా ధరిత్రి, చూపుమా యంచు ప్రార్థింపఁబోయెగమున
దగ శిరంబుంచి తనలోన దానపలుకు, మనుజపతిఁ గాంచి ప్రణమిల్లిమంత్రివరులు.
క. నతులై వినయవిచారో, న్నతులై నిలుచుటయు వదనవలినములఁ దరం
గితదృష్టిచంచరీక, ప్రతతులు నటియింప ధరణిపాలుం డనియెన్. 326
క. అరుదెంచితి రెవ్వరు మీ,రయదారం జెప్పుఁ డనిన నలికతటాంత
స్ఫురదంజలిపుటులై యి, న్నరనాథుం జూచి దండనాథపతింముల్. 327
మ. క్షితినాథోత్తమ నేఁడు నీమఱఁది మత్స్యల్లుండు పుత్త్రీరప
చ్ఛితి మాలింపు తదీయభాషితము లస్త్రేయవ్రతబ్రాహ్మణ
క్రతుభుగ్వైరివంతిసయోగమున నీగారాముచెమ్మాలి యొం
డితరక్షోణికిఁ బోకచేరె మము నీ వీక్షించి పోరాఁ దగున్. 328
క. అని దేవరతో విన్నప, మొనరింపం బంపె విక్రమోపేతపతా
కినితో సంబంధిపురం, బున కరుదెం డనిన భూవిభుఁడు సుముఖుండై. 329
వ. అమ్మంత్రులకుఁ బసదనంబులిచ్చి యంతఃపురంబున కరిగి యింతికి నంతయుందెలిపి
విన్నయాదిప్రొద్దుగా సభార్యుండై చతురంగబలంబులు గొలువ వచ్చి సుకీర్తి మ
ధ్యాహ్నకాలంబునకు బాటలీపురోపకంఠంబు గదిసె నప్పుడు. 330
ఉ. ఇంకనిరీవి కావ తనయింటికి వచ్చినఁ జంద్రసేనుఁ డ
భ్రంకషసమ్మదాభ్యుదయభాసురుఁడై యెదురేఁగుదెంచి ప
ల్యంకిక నున్న యప్పచరణాబ్జములం బడి కాంతకాంతిమ
త్పంకజరాగపూగకృతధామకవీథికిఁ దెచ్చె దెచ్చినన్. 331
ఉ. ముందఱ నేగి యుబ్బునమోహిని వాహినిపోలె నుబ్బునం
తం దలచుట్టు కన్దోగల దట్టముగాఁ బ్రవహించునశ్రువా
రిం దులితేతరస్తనశరీకములం దిగుసారఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెరతో మొగమెత్తి కేడ్చినన్. 333
సీ. కడుపులోఁ జెప్పట్టి కలఁచిన ట్లగుటయు భక్తిఁ గూరిమిపట్టిఁ బట్టియెత్తి
శిర మురంబునఁ జేర్చి చెఱువు వ్రస్సినరీతి నోడి కల్గట్టి పెల్లుఱులు నశ్రు
ధారల నతితాంతిదశఁ గన్నతనువల్లి దళుపుమ గద్గదధ్వానలీల
భాషణంబుల నెంతపనియయ్యె నట్లుండె విధికృతం బనుచు నుర్వీవిభుండు

తే. గూడు కొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి పలికెట యాళిపాట
పాటలాధరవదనదర్పణముఁ గడిగి, యుచితకాంచనపీఠిఁ గూర్చుండ నిడిరి. 333

ఉ. చిత్తము చెంగలింప జయసేనుఁడు సాఁగిలిమ్రొక్కి నన్మదో
న్మత్తవిరోధిరోధిరదచిహ్నసమూర్తి సుకీర్తిభృత్తమై
నెత్తి కవుంగిలించె నపు డింపెసలారఁగఁ జంద్రసేనుఁ డు
ద్వృత్తరపత్యభాషణవిధానుఁడు భావకు మ్రొక్కి యిట్లనున్. 334

క. దళితారి నీకుమారి, వ్రళితాంగవిలాస మైన మేనల్లున కీ
వలదే యిపుడని బద్ధాం, జలి యై ప్రార్థింపటయుఁ బ్రసాదోన్ముఖుఁడై. 335

వ. బ్రహ్మరాక్షసోద్యోగంబును బాంధవ్యంబునుం దలంచి సుకీర్తిచరిత్రమానలగ్నంబున
మిథ్యావలగ్నజయసేనులకుఁ బెండ్లిజేసెద ననియె నమ్మహోత్సవంబు వీటఁ జాటిరి
నాగతసంబంధిబాంధవంబును నాయాతశైలూషిశైలూషంబును నాగచ్ఛదఖిలా
వనిపనికరంబును నాహూతబ్రాహ్మణజాతంబును నాబద్ధశుద్ధమాణిక్యతోరణంబును
నలంకృతవిపణిమార్గంబును నభిరచితరంగవల్లీమతల్లికంబును నారాధితనవగ్రహం
బును నఖండవాద్యమాననానాతూర్యంబును నై యమ్మహామహంబు ప్రవర్తిల్లె నా
సమయంబున. 336

ఉ. బంగరుపీటఁ బెట్టి దడిపంబిడి రాజకుమారి దానియీఁ
దం గదియించి తూర్యనినదంబుల రోదసి ఘూర్ణిలంగ శ్రీ
విం గడుపాటిపాట నరవెంద్రుకలం గొమరౌను వానినుల్
చెంగట నక్షతంబు లిడి చేఁడియకుం దలయంటి రాదృతిన్. 337

క. సుమతైలప్లుతి నలరా, కొమరాలికి నలరెఁ గురులు కోకనదాంత
స్సుమధూళిమగ్నమంద, భ్రమరీసమరీతివయనపర్వము లగుచున్. 338

తే. బుగులుకొను తావిసిరము కప్పురముతోడ, నడుపుదివ్యనిఘుస్సృణద్రవంబుతోడఁ
బొందుగా మేళవించిన చందనంబు, నాఁతికొండొకకలకంఠి నలుగుఁబెట్టె. 339

ఉ. అజ్జలజాక్షివస్తునుమహాన్మతిమజ్జనశాలిబాలిక
ల్మజ్జనశాలఁ జేర్చి మణిమంజులపీఠముఁ బెట్టి దువ్వి పై
గొజ్జఁగినీరుచల్లి మెఱుఁగుల్గొన విప్పి విదిర్చి యొక్కచం
చజ్జఘనాంగ పెట్టె ఘనసారయుతామలకంబు చేర్పనన్. 340

ఉ. తోరపుజాలువాపసిఁడితొట్టుల నొట్టినపశ్చిమంబుప
న్నీరపరంజిబుంగలను నించి మనోహరకక్షకాంతిబం
గారుపసంతమాడఁ గరకంకణఝంకృతు లుల్లసిల్ల హే
లారతి నార్చి యొక్కనవలా జలకం బలకంబుకంఠికిన్, 341

సీ. జిలుఁగుపావడమీఁదఁ జికురధిక్కృతమిళిందాళి యొక్కతె మొందాళిఁ గట్టి
తడియార్చి కేశపాశము దువ్వి యొకముద్దుకలికి వాల్గంటి గీల్గంటు వైచె
నిలువుటద్దముమ్రోల నిలిపి యొండొకవధూతిలకంబు తిలకంబు దిద్దె నుదుట
సరిపుట్ట నొకదిట్ట నెఱవాదితనమూఁది కనుచెలు వ్వెఱఁగంద గంధ మలఁదె
తే. నొకతె కుకాలాపహారవల్లికలు వైచె, నొకవిలాసిని మణులకంచుకముఁ దొడిగె
నొకలతాతన్వి పెట్టెఁ గేయూరకంబు, లొకతటిన్నేత్రి యిడియె బాలికకు సొమ్ము.

క. అక్కరిణీనిభగామిను, లక్కరణి నలంకరించి యాలో ధరణీ
భుక్కులచూడారత్నము, నక్కడ గైసేసి రాప్తు లగువా రంతన్. 343

మ. కదియుంబోయెఁ బతంగుఁ డస్తకుధరాగ్రక్షోణిసత్క్రించము
లొప్పదలె న్నిర్ఝరమార్గపల్వలమునన్ భూరిజ్వలజ్జ్వాలలున్
మెదలెం జాగృవిపణాగ్రముల నెమ్మెత్సని దీపచ్ఛట
ల్వదలెం జోళ్ళు రథాంగదంపతులు విల్వంచెన్ మరుం డత్తఱిన్. 344

సీ. మూరెల వెలుఁగుపంజాలకరీరవ్యస్తభూషామణిస్ఫూర్తి ప్రోదిసేయఁ
గైవారముఖరమార్గణవిలోచనకైరవముల నానవశశి వాడుదేర్ప
విమలబంధుస్వాంతవిధుకాంతముల కటాక్షజ్యోత్స్న విరవిర గరఁగుచుండఁ
గృతదృష్టికరణసంగతవధూటీహంసికల నీరజాకరము పిలువ
తే. కలువచెలికాఁడు పొడపుగుబ్బలివసించు,గతి నలంకృతసామజస్కంధ మెక్కఁ
బటహనిస్సాణముఖతూర్యపటల మెసఁగ,బుధజనాశీరవము లుబ్బ భూపసుతుఁడు.

వ. తార్క్ష్యరోహణుం డగు నారాయణునికరణి నేనుఁగు నెక్కి జయసేనుండు నర్తకీ
నర్తకగాయనీగాయనమాగధీమాగధ బ్రాహ్మణీబ్రాహ్మణనాట్యగాన స్తవనాశీర్వాద
విశేషంబు లానందసంధాయకంబులుగా స్థానీయమీనలోచనమరీచికావీచికాకవ
చితరాజమార్గంబున నేఁగుదెంచుచుండ. 346

ఉ. నీరము లాడి యాడి మదినిండినసొంపుపసం గటిస్థలిం
జీరచెఱంగు వీడిపడఁ జెక్కుచుఁ దక్కినకొంగు నేలపైఁ
జీరఁగఁ దన్నుఁ దామఱచి చెచ్చెరఁ జూడఁగవచ్చె నొక్కనీ
రేరుహపత్రనేత్ర యధరీకృతకంతుని రాజనందనున్. 347

చ. కుసుమసుగంధి యోర్తు నృపకుంజరుఁ గన్గొని మోహితాత్మయై
యసురుసురన్న దాని నికటాంగన యారసి నీకు నేటికి
ట్లుసురన యన్న నింటికడనుం డిటకుం బరువెత్తివచ్చు ను
క్కస మసుఱంటిఁ బొమ్మనుచుఁ గ్రక్కునఁ బోలఁగ బొంకె నయ్యెడన్. 348

ఉ. పొంగినశిక్కఁ దోఁచినటు పోరుచు మంచముడిగ్గినీశ చ
న్నుం గబళించుపుత్త్రునిఁ గనుంగొని యక్కట వీఁడు నాకు బ
ల్సంగడమయ్యె వేఁడనుచు శయ్యపయిం బొరలించి త్రోఁచి వ
చ్చెం గలకంఠి యొర్తు నృపసింహము నెంతయుఁ జూడవేడుకన్. 319

ఉ. కేలగలించి పట్టి రతికిం బిఱువీఁకులు సేయువల్లభుం
జాలుఁబొకాలు నిల్కిలువు సైఁచు మొకించుకతాళు మాను మీ
వేళ నిశాననం బనుచు వీడ్వడనాడి యురోజగౌరవా
ర్తాలసమధ్య యొర్తు కదియం జనుదెంచెఁ గుమారమన్మథున్. ౩౫౦

చ. అరవిరిబాగుతమ్మరస మంటిన కన్నులు డిల్లపాటు క్రొం
జెఱుచెమట ల్సను ల్స్తనపుచెక్కులు చిక్కులు గొన్నహారముల్
విరిసినకొప్పు నిశ్వసనవీచికలం దగ వేగ నొర్తురా
మఱుఁ గికనేల యీవిధము మంచిది పొమ్మని నవ్వి రంగనల్. 351

ఉ. మించి జయంబుఁ గైకొనునిమిత్తము నెత్తము లాడి యోడి యో
డించి పణంబు దెమ్మనుచుఁ డెక్కనఁ బట్టినప్రాణనాథువ
స్త్రాంచల మించుకేని విడనాడక నెవ్వడి నీడ్చుకొంచు శం
కించక నేగుదెంచె నొకకేసరిమధ్య కుమారుఁ జేరఁగన్. 352

*ఉ. కీలు ఘటిల్లువేణికతికిం బ్రతికూలత నొందఁ జంద్రజం
బాలిత మైనచన్నుఁగవ మధ్యముపై దయదప్ప ముత్తెరు
త్మేలిమి రాజిరాడఁగను మించులు కంపల గ్రమ్మటిరప మం
దాలసవృత్తి నొక్కజవరా లరుదెంచెఁ గుమారుఁ జూడఁగన్. 353

వ. ఇట్లు పురస్త్రీరత్నంబులు నిజదృష్టిమసారసారంబుల నలంకరింప నేగివచ్చి సుకీర్తి మందిరద్వారంబున నవ్వారణావతరణం బొనరించి నారీజనార్పిత నీరాజనంబు లీక్షింపుచుఁ గక్ష్యాంతరంబులు గడచి చని ముందఱ † నతిముక్తాభిరామంబై బ్రహ్మసభను పుణ్యద్రవ్యసమీచీనంబై యాజనవాటంబును బల్లవకుసుమవిలసితంబై వసంతసమయంబును బ్రసిద్ధవర్ణగౌరవంబై సంగీతంబును నాట్యకార్యంబునం

---

*ఉ. మూలమఁ దార్చి సందుసుడిమూతులు నాకెడుగిండిదాని న
వ్వేళకు నొద్దఁబెట్టి యిదె వే విడె మిచ్చెదఁ గాని చూచెదం
గోలతనంబు పెండ్లికొడుకుం దలవాకిట నంచు వెళ్ళనీఁ
జాలనిభర్తఁ దేర్చి యొకచంద్రనిభానన వచ్చె వీథికిన్.

ఇది ప్రక్షిప్తమని తోఁచెడు.

† ఈస్థలంబున నుపమానోపమావాచకంబులు సాధారణధర్మవాక్యంబులకు ముందు

దనరి భరతంబును సర్వధూర్వహంబయి భారతంబును సర్వతోరణవిహారంబయి జయశీలుని విబుధభవనసామ్యంబయి గ్రహమండలంబును రంభాలంకృతంబయి స్వర్గలోకంబును విశ్రుతావితానవితానంబయి కురుక్షేత్రంబును బ్రతిష్ఠితదధిముఖపాత్రంబయి మధువనంబును ననుకరించువివాహమంటపంబు డాయంబోయి.

ఉ. మోహనవల్లి నంత శశిముద్దియ గద్దియఁ దెచ్చినన్ మహో
త్సాహతభూమిపాలతనుసంభవుఁ డెక్క ననంతరంబ దీ
వాహితనీతిసంచితగృహార్థుఁ డొసంగ సుకీర్తిభాసుర
వ్యాహృతి కుందనంపుహరిణాముననే మధుపర్క మయ్యెడన్. 355

క. దానవశాత్రవుఁగా జయ, సేనుని నారాచకూఁతు సిరిగా మది న
మ్మానవపతి దలపోసి య, థానియతిని ధారఁబోసెఁ దనయన్ సనయన్. 356

క. లగ్నంబు గడచె గగనవ, లగ్నం బెమ్మనిన బుధులు లలితగతి న్మా
న్మగ్నలు గుచభరకించి, గ్రుబ్భగ్నలు నగుచెలులు సొంపులోఁ జని కడకన్. 357

క. కుదకొప్పు మెఱయ గవిసెన, గదియించినమరునిబంటిగతి నతిశయిలన్
దుదకొప్పు మెఱయ నింతికి, ముదితలు చిత్రాంబరమున ముసుఁగిడి వేడ్కన్. 358

క. నడపింపఁగ మడుఁగులపై, నుడురాజనిభాస్య యడుగు లొప్పెం గడున
య్యడుగులు కూర్మము లగునఁట, మడుగులపై బొరయకేల మానఁగ నేర్చున్. 359

*ఉ. మోహనశమ్ముగాని తెలియు త్రైపుసొమ్ములతోడికమ్మపూఁ
దీవలవంటిబోంట్లు కవదివ్వెలతోఁ జెలిఁ దెచ్చి రద్దరి
త్రీవరపుత్త్రుఁజేర నధరీకృతరోహిణి రోహిణిం బ్రమో
దావహజక్క నుక్కుతునియ ల్హరిణాంకునిఁ జేర్చుచాడ్పునన్. 360

---

కొన్ని ప్రతులందుఁ గానంబడియెడిని. ఐన నీకవి యింతకుము న్నీగ్రంథముననే యిట్టిఘట్టంబుల రచియించినరచనం బట్టియుఁ గొన్నిప్రతులయం దుండుటం బట్టియు నిట్లు సంస్కరింపంబడియె.

*శా. రాకాచంద్రనిభాస్య నెచ్చెలులు దేరం బ్రీతి నత్యూర్జిత
శ్రీకిం బట్టగుమంగళాయుతవముం జేరంగ నేతెంచుచోఁ
గాకల్పారవము త్తికోకిలలజోక న్సారెలం డాసి ల
క్ష్మీకల్యాణముఁ బాడి రంతిఁ బురిహంసీయాన లుప్పొంగుచున్.

ఈపద్యము గొన్నిప్రతులలోఁ గానఁబడదయ్యెడు.

ఉ. ఆహరిణాక్షికేలు పతిహస్తమునం బతికేలు తజ్జగ
న్మోహినికేల నుల్లసిల నూతనసాత్త్వికకంకణాంకుర
వ్యూహముతోడ రాజతనయోత్తమహస్తమునన్ మహావరా
రోహకరంబునం దొడె గురుండు సమంత్రకకంకణాంకముల్. 361

ఉ. అంతటఁ జిత్రభాగ్యవనికాంతరితిం బరితశ్చరద్ధరా
కాంతిపటావకుంఠనవృతకామినిఁ గన్గొనరామి వక్త్రసం
క్రాంతివిలాసలక్ష్మిఁ గనుకైవడి గడ్డముపట్టి యెత్తి ధీ
మంతుఁడు రాజనందనుఁడు మంగళసూత్రముఁ గట్టె నింతికిన్. 362

చ. అపుడు వధూకరోన్నమితమై తెలిముత్తెపుసేసఁబ్రాలు ధరా
ధిపసుతునౌదల న్మదవతీమణి నించె విభుండు నమ్మద
ద్విపనిభయానమౌళిఁ బోదివెం దలఁబ్రాలవి జాతికెంపుల
ట్లపరిమితప్రియాప్రియకరాంబుజశోణిమ నొప్పె నంతయున్. 363

చ. సరిమెటుఁ బ్రాలపుట్టికలసందున బట్టినపట్టుపుట్టముం
దెరఁ దెరలింపఁ జూచె సుదతిం బతి యవ్విభుఁ జూచె నింతి యా
య్యిరువురచూపులం గలసి యేసెఁ బరస్పరమర్మలక్ష్యము
ల్శరముల నిల్పి యెన్నడుమ శారసబాణుఁడు సవ్యసాచియై. 364

క. విడువనితగు లిరువుర కేర్పడువున ననుకరణి నుభయవస్త్రాంచలము
ల్విడిదేరునక్షతలతో, ముడిఁబెట్టిరి పంచశరుఁడు ముడిఁబెట్టంగన్. 365

ఉ. అంబరదంశితాఖిలసమగ్రమణిస్ఫుటవేదికాంతరా
డంబరపీఠి నుండిరి వధూవరు లయ్యెలనాఁగ యగ్నిహో
త్రంబున వ్రేల్చె లాజలు ధరావరసూనుఁడు సంభృతానురా
గంబున నేమిచెప్పఁ దనకౌఁగిటి కింతిమొగంబు వ్రేల్వఁగాన్. 366

క. ఆగామిప్రణయరణోద్యోగం బణఁచుటకు నేఁడ దొరకొనె నితఁడం
చాగురుకుచవగ నయారె, భూగురుఁ డడుగూఁది సన్నెకలు పెట్టించెన్. 367

సీ. అవలోక మొనరించి యసురఘస్మరపదధ్యానసంపాదితౌత్తానపాది
నేడ్వురుబుషులతో నీక్షించి రురుకుచశ్రీజితాహార్యవసిష్ఠభార్య
గళితచేలాంచలగ్రంథులై మ్రొక్కిరి యిలువేలుపులకు బెద్దలకు భక్తి
నుర్విసుధాశవాశీర్వాదపూతాక్షతములు మస్తకములఁ దాల్చికొనిరి

తే. రాజకన్యక యంతఃపురమున నుండె, బెండ్లిచవికకు నేతెంచెఁ బెండ్లికొడుకు
విప్రులకు బంధుజనులకు విద్యవారి, కుభయనరనాథు లీప్సితం బొసఁగి రంత. 368

చ. నిరుపమశోభనాత్మతలు నించినపళ్ళెరము ల్ధరించి సు
స్వరమునఁ బాని రెన్నఁదగువర్ణములం బతియింపుచుం ధరా
మరుల బహూకరింప గరిమంబున మూఁడవనాఁడు వర్తిలెం
బరమమహాన్నభోజ్యమయి ప్రాఁకెనయమ్మఱునాఁటివేకువన్. 369

మ. వరలం గూర్చినకొప్పుతోఁ బసపుమిన్నల్దేఱు నెమ్మోముతో
గరిమ న్నాగమసానిప్రోలుదిరుగం గాఱింతులై తూర్యముల్
మొరయంగాఁ గడునొప్పె నాకబలియాలోకాటికాపేటికల్
సరసాప్తిం జదివించి రాప్తు లగురాజన్యుల్గురు ల్మీఱఁగన్. 370

చ. అతికృతులై నృపోపకృతులై హితులై తివరారుధారిణీ
పతు లతులప్రభం బురముఁ బాసి గృహంబుల కేఁగి రంత రు
ద్వ్రితిపరిపంథి రాజసమవర్తి సుకీర్తితనూజ కిచ్చె నూ
ర్జితగుణరత్న పేటికలఁ జేటికలం బదివేల ప్రేల్మిడిన్. 371

క. ధాటీఘోటీఘటితవ, రాటీబోటీహృదార్తరవుఁ డజ్జగతీ
తాటంకపతీపతిపట, పేటీకోటీశతంబు బిడ్డకు నిచ్చెన్. 372

శా. సౌరభ్యాహృతివిశ్వభూజనమనస్సంతోషము ల్విస్తృతాం
భోరుడ్రాగకరంకహృద్విహరణంబు ల్సారకర్పూరక
స్తూరీసాంకవగంధసారఘుసృణస్తోమంబుతో నిచ్చె సు
భూరిత్నంబున నేడువారముఁ సొమ్ము ల్రాజదేజంబునన్. 373

ఉ. ఆహితగంధవాహముల నద్భుతహేషణదంభదూషణ
వ్యాహృతిభర్జితద్యుమణివాహములం గతిభిన్నమానస
వ్యూహములం గులీనమహిమోజ్జ్వలవాహములం గఠోరవీ
రాహితచిత్తభల్లుఁ డగునల్లుని కిచ్చె సుకీర్తికీర్తికిన్. 374

మ. కటకస్థాతృమతంగజప్రభుమదౌత్కంఠ్యంబు వారించి యు
త్కటన క్షోణిపుచేతఁ బ్రాభృతముగాఁ గైకొన్నవైంధ్యద్విప
చ్ఛటలం భిన్నదిశావశాప్రియులఁ జంచజ్జంగమగ్రావధీ
ఘటనమూర్తుల నిచ్చె నల్లునకు భూకాంతుం డుదాత్తస్పృహన్. 375

క. అరదంబులఁ గుటిలాహిత, దరదంబులఁ గేతుపవనదళితప్రావృ
ట్చరదంబుల ధరనతది, గ్ద్విరదంబుల నిచ్చె భూమివిభుఁ డల్లునికిన్. 376

వ. వెండియుం బెరుగలవస్తువు లిచ్చి జామాత నాదరించి తాను నుపకృతుండై సుకీర్తి యాఁడుబిడ్డ నాలోకించి యుప్పొడ త్రమిత్రితాత్ముండై యిట్లనియె. 377

క. జనియించినయింటికిఁ జొ,చ్చినయింటికిఁ గ్రొత్తక్రొత్తసిరిరా సరిరా
ననబోండ్లు మేలుమే లన, మనుమీ వనుమితుల మైనమా కిం పొలయున్. 378

వ. మలసి ఋణానుబంధమహిమన్ హృదయేశ్వరుఁ డత్త నత్తమా
మలతల గాకయుండఁ బతిమాన్తురు కాంతలు వారికన్నఁడున్
గలుగవు వన్నెవాసు లటుగావునఁ బుట్టినచోటు బుద్ధిలోఁ
దలఁచి తదంఘ్రిభక్తి పరతంత్రవు గమ్ము కుమారికామణీ. 379

చ. కృతనుతశీలయైనసతికిం బతివంటిగురుండు లేఁడు ని
శ్చిత మిది యమ్మ నీకిఁ విశిష్టగురు ల్దలిదండ్రు లమ్మహా
మతు లుసురన్న విప్రుఁ బరిమార్చినపాపము వచ్చుఁ గాన నీ
మతముఁ దలంచి యత్తకును మామకు సేవయొనర్చు మోర్పునన్. 380

సీ. అత్తమామలచిత్త మలర వర్తిలవమ్మ ధవుని దైవంబుగఁ దలఁపవమ్మ
తోడికోడండ్రపొత్తును బాయనీకమ్మ మఱఁదుఁ గని మని తిరుగవమ్మ
యనుఁగుఁజుట్టములపట్టున వెట్టగాకమ్మ పఱవుళ్ళపై భక్తి వదలకమ్మ
కాఁగానిచెలుల డగ్గఱి చరింపకుమమ్మ యుత్తమస్త్రీలపొం దుడుగకమ్మ
తే. తోడుతోనైన నందనుతోడనైన, నొంటిపాటున భాషించు టుడుగవమ్మ
పనులఁగొనకమ్మ భూసురాంగనలచేత, వ్రేలఁ జూపింపఁగొనక జీవింపవమ్మ. 381

ఉ. శ్రీవరవర్ణినీదనుజశిక్షణదీక్షులయట్లు దేవియున్
దేవరబోలి నీవు భవదీయవిభుండు నఖండసౌఖ్యసం
భావితులై మహాతనుకుమారు నఖర్వసుపర్వనర్మ నా
శావినుతైకకీర్తిధను జంపతు లూర్జితలీలఁ గాంచుఁడీ. 382

శా. తల్లీ నిన్నెడఁబాసి యుండొకముహూర్తంబైన సైరింప నా
యుల్లం బోర్చునె పుత్రు నీక నిను నయోగ్య దైన మిట్లిచ్చునే
వెల్లింబోయినపంతఁ గుందవలసె న్వైయ్యంబుఁ బ్రార్థించి వి
ద్యుల్లేఖానిభదేహ నిన్బంపఁబుత్తున్ శీఘ్రకాలంబునన్. 383

వ. అని సుకీర్తి యార్తిం దలవంచుకొనియె నంతఁ దదీయసతి కాంతిమతి పుత్రిం గవుం గిలించుకొనుచుఁ గన్నీరుకరతలంబున నందుడిచి దగ్గుత్తికఁ బెట్టి యొట్టకేలకు ధైర్యంబు చిక్కంబట్టి యిట్లనియె. 384

క. నాయనుజాఁడు మఱ్ఱిల్లుం, డీయిలు నాయిలు సునేనుఁ డీజయసేనుం
డోయబలా నీపెనిమిటి, పాయకసమున నేయిదొరఁగుబో గేర్పడియెన్. 385

చ. ఇరువుర మేము లాతయుఁగ నెక్కడ నుండినసేమి యిక్కడం
ధరలదు గాదె మాయనువితానము నిన్నది వర్తమానవ

త్వరముతఁ బిల్వఁబంచెద వివాలకు నెమ్మదిఁ గుంకుఁ బోయి క్ర
మ్మతిఁ దొడ నంచుఁ బుత్రిఁ దళుమాటలఁ దేర్చి సగౌరవంబునన్. 396

వ. వివిధాభరణంబులు చిత్రవస్త్రంబులు పరిమళప్రముఖంబు లగుసర్వవస్తువు లిచ్చి బంధుజనుల నియోగంబు వడసి చతురంతయానాధిరూఢ యగుచుఁ జతురంగసేనాపరివృతుం డగుసుకీర్తితోన మరలి పురంబున కరిగి సుఖం బుండె. 387

ఉ. ఆజయసేనుఁ డంతఁ బరమాదరణంబున బ్రహ్మరాక్షసుం
బూజలఁ దన్పి కేల్మొగిచి పొందిక మీరఁగ నుత్సహించి గో
త్రాజరదైత్యుఁ డానరవరాత్మజు మన్నన సేసిపోయె నం
భోజభవాలయంబునకుఁ బుష్పకమెక్కి సుఖం బ్భజింపఁగన్. 388

వ. ఆరాత్రి మజ్జనభోజనాదికార్యంబు లాచరించి. 389

సీ. చంద్రికపూవన్నె జిలుఁగు దువ్వలువ మేల్కట్టుదంతపుఁగోళ్ళపట్టెమంచ
ము జిలుగుదిల్లులపట్టుపఱుపుక ప్రపుఁబలుకు సురటి క్రొవ్విరులు కస్తూరిరాయి
పూపుగట్టినగందపొడికదంబము పెట్టె కలపంబు చికిలిబాగాలబరణి
పండుటాకులు నానావాల్పొవకములును గందచక్కెర తెల్లపిండిపంట
తే. పంజసరిపట్టుబకదారిజాతిపారువములు గుజరాతికెంపుదీపములు బూతు
చిత్రపటములు కుడిసిరుచెంబు గలిగి, తనరుసదనంబు రాజనందనుఁడు సొచ్చె. 390

సీ. మంచికప్రము మేళవించినపన్నీట సరసాళిజనము మజ్జనముఁ జేసి
జిలుగుమాంధాళి కుచ్చెళ్లఁ బోసి కట్టి దేహమునఁ గుంకుమరసం బప్పళించి
చికిలిపైఠాణికంచుకము గీలించి చొక్కము లైనమణులహారములు వైచి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖ యమర్చి కురులు ముద్దుచెక్కుల ఘటించి
తే. గోరజవ్వాదిపదనిచ్చి గూడదువ్వి, కుసుమగర్భంబుగా జాఱుకొప్పుఁ బెట్టి
చవులచేర్చుక్క సీమంతసరణిఁ గూర్చి, కన్య నిష్టాన్నసంతుష్టఁగా నొనర్చి. 391

ఉ. కూరిమి బుజ్జగించి యనుఁగుం జెలు లద్దముఁ దేర సమ్మదాం
కూరమహోవిలంబమునకుం బనిలే దనఁ బోవఁబోకుమం
చూఱట లేక సిగ్గు తిరుగుండఁగ ముందఱఁ బోయి పిమ్మటం
గ్రూరవిపాణమేషమయి కొమ్మ చనుం జనలేక క్రమ్మఱున్. 392

ఆ. వనిత నిలిచి నిలిచి వచ్చుచు మంజీర, మండనములు మాని మాని మొఱయ
లజ్జ విడువరాదు లావణ్యవతులకుఁ, బ్రాణనాథుతగులుఁ బాయరాదు. 393

వ. ఇట్లు కేళిమందిరంబు చేరం దెచ్చి 394

ఆ. చెలులు బలిమిఁ జేసి పిలిచినఁ దల్పంబు, చేరరాక సిగ్గు చేర్లుకొనఁగఁ
గ్రొమ్ముడియును మోము గొండొకమూపట్టఁ, దలుపు దండగొనుచు నిలిచియుండె.

క. రతిఁబోటులంత మంత, స్మితచంద్రికవదనపద్మశీతద్యుతులం
దతులగతి మెఱయఁ దేజో, న్నతునకు నృపసూతి కిట్లనిరి నేర్పెలఁదుల్. 396

క. ఈపాఁపప్రాఁప వయసుది, నీపాదములాన మెత్తనిది పేర్కొనరా
దేపనిపాటలకేనియుఁ, గాపాడుదుగాని గానిఁ గావింపకుమీ. 397

తే. ఎంతతమకంబు గలిగిన నిగురుఁబోండ్లు, చేర నొల్లరు మగవారు చేరుదమక
వది యథార్థీకరించి నీయలరుఁబోఁడిఁ, గదిసి పిలుతువుగాని కొంకదవుసుమ్మి. 398

క. అని నగుచు మగువలందఱు, పనిసెపమున నొక్కరొకరె పఱచిన లజ్జా
వనతాస్య యగుచు నంగన, మనమున ననుసిగ్గు దేరి మాటాకత్తెన్. 399

ఉ. ఉవ్విళులూఱుచు న్వికసితోత్పలలోచన చూచు వల్లభున్
దవ్వులఁజామభర్త దను వర్తిలిఁ జూచినఁ జూచ డెంతలో
బువ్విలు వంచిఁ బాణ మఱి బోసి రయంబున డాసి శింజినిం
జివ్వనఁ బాపి యేసె వలచిత్తజుఁ డిద్దఱ సవ్యసాచియై. 400

క. ఆత్తఱి రాజకుమారుం, డెత్తివతమకమున ననునయోక్తుల సరసా
యత్తవిచేష్టలఁ గన్నియ, చిత్తము గరఁగించి సజ్జఁజేరఁగఁ దెచ్చెన్. 401

సీ. మగువ నీకంకణమణుల నర్ఘ్యము లని పరికింపు సెపమునఁ గరముఁ బట్టె
నెత్తమ్మితావు లీనెడునీ మొగం బని మూర్కొనువిధమున ముద్దుఁబెట్టె
లేమ నీకంఠమాలిక దొడ్డసొమ్మని తడవులాగున ఘనస్తనములంటె
బిఱుచుట్టుబిగువున విఱుగదేనడు మని సడలింపుగతి జీరముడి వదల్చె
తే. నాఁతినీబొమ్మునాబొమ్మునకు సమాన, మయ్యెడినొ కాదొ యనఁగాముల రయావలయు
నని మహాకైతవంబున నధిపపుత్త్రుఁ, డంబుజాననపరిరంభ మాచరించె. 402

ఉ. వేడుక లంకురింపఁ బృథివీవరుఁ గౌఁగిలి మందుఁ సోఁకి పి
గ్గాడని బాడిన న్నగుఁ బ్రియుండు హసించినఁ బిల్వ మాఱుమా
టాడు మొగంబునం దెలివి యచ్చుపడం దఱితోడ నిమ్మనన్
వీడియ మిచ్చుఁ గన్నులకు విందగుచుం గలకంఠి వేమఱున్. 403

ఉ. జీనువముక్క తోడఁ బ్రతిసేయఁగవచ్చిన గోరఁదీరుగా
నీనియ లొల్చి చుట్టి తనకిచ్చినవాగరఖండ మూర్వరా
జానిసగంబు వోఁ గొఱికి చావరదంబుల కందియయ్యె నా
లో నవిసొప్పె వజ్రములలోఁ దళుకొత్తెడుకుందనం బనన్. 404

ఉ. చాతురిమీఱ మస్తకము సందిట బిగ్గరఁ గ్రుచ్చిపట్టి యా
నాఁతిసుధాధరంబు రదనంబున నొక్కెనఁ దాళలేక నీ

రాతిశయార్త్వ మేది బొమలార్చుచు కన్నరమూసి వల్లభుం
జేతుఁ ద్రోచి రాజముఖి సీత్కరణం బొనరించెఁ బల్లటన్. 405

ఉ. అంగజసాంపరాయము సమాప్తివహించిన నిర్భరత్రపా
లింగితచిత్తయై యబల లేచి కటిస్మృదులాంబరాంచలం
బుం గదియించి హేమమణిపుత్రిక చాటున కేగుచోఁ బున
స్సంగమవాంఛ పుట్టె నృపజన్మున కిష్టవిలోకనాయతిన్. 406

వ. ఇట్లిచ్ఛామరూపవిలాసంబులం బొదలి సుఖించి రద్దంపతులు మఱియును. 407

సీ. సురభిపుష్పామోదఁ జొక్కించె నారామసీమ నారాజన్యచిత్తజుండు
కలహంసగమనఁ దెప్పలఁదేల్చెఁ గాసారతటముల నానృపోత్తమసుతుండు
కంఠీరవవలగ్నఁ గరఁగించెఁ గృతకాద్రిగుహల నద్ధాత్రీశకుంజరుండు
కలకంఠి తనురాగ మొలయించెఁ జివురుఁజప్పరముల నవ్వైరిభంజనుండు

తే. గారుడాశ్మచ్ఛటాచ్ఛస్వకనకసౌధ, పాళికల నావితీర్ణవిభ్రాజితుండు
రతులఁ బొలయించె నాశరద్రాజవదన, నతిశయప్రీతిలతిక మాఱాకులిడఁగ. 408

క. మహిళారత్నంబును నమ్మహిరమణసుతుండు భోగమహనీయకళా
వహలీల నుండి రని యల, బహుమానుఁడు క్రకచుఁ జూచి పలికె న్మఱియున్.

క. దొరికినవిశ్వంభరిత్రి, వరకన్యక విడిచె వెఱ్ఱివాఁడై యడవిన్
మరణమయి మనివమందుఁడు, పురుడింపఁగ నీకు దోడుఁ బోఁడె క్రకచా. 410

ఆ. తనకుఁ దెవులు మూఁడె నని భార్య సెప్పిన, నీవు దానిమాట నిజముసేసి
సెయ్యుఁ డనక నన్ను నిర్జింపఁజూచితి, చెడుఁగ నిన్ను విశ్వసింప వగునె. 411

క. వెడమాయలపుట్టిల్లగు, చెడుగుం గశ్మలు పాపశేషంబునఁ జే
పడినకతంబునఁ గాఁపుర, గొడు కొక్కఁడు రాజబాధ గుందఁడె తొల్లిన్. 412

క. నావిని జలచరరమణుం, డావానరవిభుని కనియె వదిఱొట్లు ధరా
దేవస్తుత యాకథఁజెప్పు,మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 413

సీ. అరసాతలగభీరాపారజలఖేయ మానాకరమ్యసాలాభిరామ
మాచంద్రమండలవ్యాయామమణిసౌధ మాబ్రహ్మశుద్ధవిప్రాన్వవాయ
మాప్రాణపవనశౌర్యాయూధనక్షత్ర మాఘటోద్యమసముద్యమకిరాట
మాదార్ఢ్యధర్మకార్యారంభచరణజంబాచక్రవాళశైలాశుతురగ

తే. మాంబరప్రాంశుదానధారాఢ్యనాగ, మాధ్రువస్థానపథశతాంగాతిశయము
బ్రహ్మకైనను బ్రస్తుతింపఁగఁదరంబె, భూపగురునూపురంబు కాంచీపురంబు. 414

క. అలకాంచితమయి తనరిన, యలకాంచివిహారభద్రుఁడను పేర మహా

హాలికుఁ డొకఁ డుండు వలంది, కృకలబారం గలిమిచెట్టుకొడు కితఁ డనఁగన్.

సీ. అలుగుంపులు గొజియలదొడ్లు లేఁబూరిరెనుములమునిమంద లెడ్లకదుపు
లులుగరంబులు వాఁకుపొలమువాకిటఁ బదికట్టుబండ్లింటికిఁ జుట్టుమగులు
తలుపుదూలము కొట్టములు సోగరాగాడిమచ్చు ముంగిట రెండు రచ్చమాకు
లీనుగోడిగె వేగురింటిబిడ్డలు మాళ్లతార్పులు నూబపాఁతిఅలఁ గొలుచు

తే. కలుపుకలిలేరుదండయుఁగమ్మతీగ, పాగడము పూసె నానెట్టె బవిరపడిగె
చుక్కబొట్టును జిటిపొటిసొమ్ము గలిగి, కాఁపురము సేయుసవ్వటఁ గాఁపుకొడుకు.

క. వానికి నిచ్ఛావతి యనఁ, గా నొకయిల్లాలు గలదు కమనీయవయో
నూనవనంబున నది జా, రానందలతాలవాలయై వర్తిల్లున్. 417

వ. అది యొక్కనాఁడు. 418

చ. తలఁ బెనుగుండఁ దాల్చి వితతస్తనభారమున న్వలగ్న మా
కులత వహింపఁ గాఁప వలిగుబ్బెత పట్టపగ ల్జలాశ ని
ర్వ్యాలువడి మన్మథాస్త్ర పటలీనిశితొక్షకటాక్షమాలికల్
గెలఁకులఁబర్వ వేగవతికిం జని తత్తటినీతటంబునన్. 419

ఉ. కోమలధూళిధూసరితకుంతలు నాతపరక్తరక్తదృ
క్తామరసుం గటీరపరిధాననిబద్ధకరాసిఁ బాదర
క్షామిళదంఘ్రిపద్మముఖసంస్తరణేతరచిత్తు గాఢచిం
తామయుసాద్రు వధ్వజనితశ్రమపీడితుఁ గాంచె నొక్కనిన్. 420

క. కాంచి దృగంచలశోభా, చంచచ్చంద్రాతపమున. శాంతశ్రముఁ గా
వించి యలవిందునకు మదిఁ, గొంచించక హాలికలికుచకుచ యిట్లనియెన్. 421

మ. నిలువం జోటులు లేవె నీకుఁ జెపుమా నీరాటి కీవేల హా
తెలిసెం బాంథగతాగతైతదిధపృథ్వీభృత్పురస్త్రీకరా
కలితాస్యద్విజరాజబింబకృతసాక్షాత్కారసంభావనా
కలనన్ దూరపథప్రయాణజనితగ్లానిం దృణింపం జామీ. 422

క. కలదుగదా యని మోపిన్, బలుమించులు సందడింపఁ బలికినఁ జింతా
కులహృదయుఁ డగుట వాఁ డ, చ్చెలిమాటలు వినక సరకుసేయక యుండెన్. 423

వ. అట్లదత్తప్రతివచనుండై యుండ నమ్మిండత వెండియుఁ దెరువరి నీక్షించి. 424

శా. అంపంజాలము చింత నీమనసు చీకాకాట నామాట లా
లింపం గూడదు నేఁడు క్రొమ్మెఱుఁగుదూలె న్నేను వీక్షించినన్
స్వాం పాక్కింతయు గావరా దెఱుఁగవచ్చుం జెల్లఁబో చుట్టమా
కొంపం బో రుదయించి రావుగద నాకుం జెప్పుమా నీకథల్. 425

క. అని పరిదాఁకంబలికిన, విని కొండొకమనము పల్లవించిన దానిం
గనుఁగొని యతఁ డనునా; డ్నునఁ దెలిసితి వింటఁబోరు పుట్టుట తరుణీ. 426

ఉ. చేర వెంకింతలేమియును నిర్దయు లైనను గన్నతల్లి దు
ష్కార్యరత దొర్చి రాయుఁ దనకోడలి రేలు పగల్లు కంట వ
గ్గోంము జూడలేక మదిఁ గుందుచు నిద్దిగనాడి పోయితిన్
వారణలేక రాజుఁ గొలువం జిరకాలము దండుఁ జేసితిన్. 427

ఉ. నా కవనీశుఁ డిచ్చె నదనం గదనంబున నస్మదీయశా
తాకరవాలధారభటదారులు గూలినఁ జూచి మెచ్చి కో
రాకృతకృత్యయుండు సవరాలు వరాలు సరోలు రూకలుం
గోకలు మానికంపుఁదళుకుల్ మృగనాభిజవాదికప్రముల్. 428

ఉ. ఆకమనీయవస్తుతతు లన్నియుఁ దెచ్చి నమస్కరించి యు
త్సేకరసం బెలర్పఁ దనచేతికి నిచ్చిన దాని నన్నియున్
గైకొని జల్లి బాష్పకలికాతరళీకృతలోచనాంతయై
కాకుతనంబు సేసి కొడుకా యిఁక నేమన నేర్తుఁ గోడలిన్. 429

ఉ. తిట్టినఁ దిట్టు బెట్టుఁ జిటిదిండికిఁ గొల్చిన కొల్చు సాగ ది
చ్చిట్టక మన్న మాతులకుఁ జేతులు సాఁచు నొకప్పుడేని యి
ల్వట్టదు సంతకూటములఁ బాయదు చేయదు చెప్పినట్లు నీ
యట్టడిజంత యిల్వెతిచె రాతనయా యనయానుషంగతిన్. 430

క. కాపురమున నెండియు నది, గావించినపనులు పెక్కుగల వవి నాకే
లా వినుపింపఁగఁ బిమ్మట, నీవె యెఱింగెదవు డాఁగునే యపకీర్తుల్. 431

క. నీవఁట యదియుఁట నలసిన, త్రోవం జనుఁ డింక మమ్ము దూఱఁగఁబనిలే
దీవఱదను కారోఁతల, దేవళ్లంబడితి వినివితిం గోడలిచేన్. 432

చ. కొలపగ గాక యత్తకును గోడలికిం బరికింప నెయ్యముల్
గలవె వలానిమచ్చరముఁ గైకొని యీముదిముండ చెప్పెడున్
బలుమఱు నండ్రు దానిగుఱిఖంగు లెఱుంగనివారు సర్వమున్
దలిసెడుఁ గాదె చేయఁగలితే మఱి దాఁగునె పుణ్యపాపముల్. 433

క. పూవకపూఁచెం గడపట, కావకయు న్గాచె ననుచుఁ గడగన్నులఁ గెం
పావహిలఁ దల్లిసెప్పిన, యావాక్యము లనృతమయములని యవ్వేళన్ 441

తే. తల్లిపలుకులు గాదనఁ దాల్మిలేక, యుత్తమాంగనఁ గులకాంత నొందునవక
ప్రతుకుభాగ్యము విడిచి నిర్భరవిరక్తి, నరుగుదెంచితి ననిన నయ్యంబుజాక్షి: 435

ఉ. అతనిఁ జూచి యిట్లనియె నట్టిద తప్పదు నాఁతి నీతితో
జాతి దలంచి సిగ్గులకుఁ జచ్చుచునుండిన నుండెగాక కా
మాతురతాతిరేకమున నాఁడిపోకలఁ బోవఁజూచినన్
జేతరవుండి పట్టుకొన నీరజగర్భునకైన శక్యమే. 436

క. కులసతి యుత్తమురాలని, తెలిసియు నీతల్లి మనసు తెలిపియు దగదీ
యాలుక మతివెట్టి తెలిసెన్, దల యోకలి చుట్టు మనువిధం బిదిగాదే. 437

క. నావిని యతఁ డిట్లనుఁ జెడు, త్రోవఁ బోకుండ మదపతుల నెప్పటికిన్
గావఁగరాదా పతులకు, నీవనియెదొ యెల్లవారనిరో యిబ్భంగిన్. 438

క. మిన్నులపైఁ బోవదుగద, యిన్నేలనెకద మృగాక్షి యిటు లెవ్వరికిన్
గన్నాఁదను న్నె చెప్పఘున, నన్నెలఁతుక నవ్వి వాని కపు డిట్లనియెన్. 439

క. పరసతి నని చని యనుఁగుం, బురుషునితోఁ గూడి నిలయమున వాఁడోసఁగన్
సురతసుఖశుల్కమును గొని, యిరవందగ నీకు విత్తమిత్తుం బుత్తున్. 440

క. నను జూడఁగలవె తొల్లిటి, ఘనజఘనలకైన తపంబు కతలుం గితలున్
వినిపింప నేటి కన్నియుఁ, గనుఁగొనియెదు గాక నేఁ డఖండప్రీతిన్. 441

ఉ. ఇచ్చట నుండ నేల తొలియిల్లు పడం బసిబిడ్డతల్లితో
వచ్చితి నేఁ బ్రవాసి నిలువన్వలెఁ బ్రొద్దుదయించుదాఁకనం
చచ్చుపడంగఁ బల్కి తమయాతనితోఁ దలసాఁపనిల్చి యో
ముచ్చట కోపయేనయట ముందటికార్యము లాచరించెదన్. 442

క. అని వేగవతీజలముఁ, గొని యామణిమంతుఁ దోడుకొని మృదుగతులన్
జనియె నొరు లెఱుఁగకుండం, దనయిలు రడిసాని యపుడతని కటెఁగించెన్. 443

ఉ. అంతట వేఁడివేలు పపరాద్రిఁ దిరోహితుఁ డయ్యె వాసరాం
తాంతరుచు ల్సెలంగెఁ గలయం దొలిచీకటిపర్వె నీరనీ
మంతినిమాటమీఁద మణిమంతుఁడు చీరముసుం గొనర్చి యొ
క్కింతభయంబులేక పడి నేగెఁ గృషీవలునిల్లుచేరఁగన్. 444

వ. ఏగి యాఖండోత్కలికుం డగుహాలికున కిట్లనియె. 445

ఉ. నాపడుపాటు కేవగవ నా కనుకూలగతిం జరించునీ
పాపనితల్లి కీవికచపంకజలోచనకైన దురంతసం
తాపముఁ బొందెదం దగినతావిది గావున వచ్చినాఁడ నేఁ
డీపని గాడిదండ వసియించి ప్రభాతమునందుఁ బోయెదన్. 446

క. ఊరదుదునా యన నాయన, మందును నిట్లనియె మంచిమాటే యిది మా

యిండులు విడుదులె పురి గుడి,గుండంబులు లేవె పండుకొను మనోప్పేటన్. 447

క. పొసఁగ దని ముక్కుడుస్సిన, పసరముగతి లేఁగి రెడ్డి పలికిన నాలోఁ
బసిబిడ్డ నెత్తుకొని సం,తసమున రెడిసానివచ్చి తనపతి కనియెన్. 448

ఉ. చెప్పవ దేమి యేలరాదసేసెను నాఁకిటవాఁ డెల్వగం
చప్పలుగాకి తా నెఱుఁగన ట్లడుగం బ్రియుఁ జూచి వాఁ డనున్
గప్పినమబ్బులో నితఁ డొకం డిదె వాకిట నిల్చి చోటుకై
జొప్పెడు నెన్నఁడేనియు నెఱుంగుదునో ననుఁ దా నెఱుంగునో 449

ఉ. అలఁట చంటిపాఁపడఁట యంగడిలేదె ప్రచారముల్ గృహం
బేల ప్రవాసి గాఁడె తన కెక్కడనైనఁ బరుండరాదె యీ
నేలయెగాని నిల్వఁ బెఱనేల మనోజ్ఞముగాదె యంకచం
డాలముగాదె యిట్టునికి నా నది రెడ్డినిఁ జూచి యిట్లనున్. 450

ఉ. అలఁట చంటిపాఁపడఁట యాయన యెంతటివాఁడో యేరికిన్
జాలిది గాదె యిల్వెడలఁ జాలనివారు బయళ్ళనుందురె
వేలుపులైనఁ దక్కరుల వేఁడరె యక్క అపాటునం జలం
బేల పరుండనిమ్ము మన కిప్పని పుణ్యముగాదె వల్లభా. 451

క. పసిబిడ్డతల్లితోఁ గ,క్కస మొండొకదెసకు నరుగఁగా నితనికి ని
వ్వసుధఁ దలఁ గట్టుకొనియెదె, కసరకు నేఁడెల్ల నుండుఁ గాకిచ్చోటన్. 452

క. చాలుఁ బిసలింపకు మని, యాలరి రెడిసాని మగని నదలించి సుతుం
డాలును నీవును నిచ్చోఁ, దాలిమి వసియింపు మని యతని లాలించెన్. 453

వ. ఇట్లుపలాలితుండై మణిమంతుం డయ్యింటిపసులకొట్టంబున నుండె నంత. 454

సీ. కలదండి పసిఁబిండి కాఁచి చేమిరిఁ బెట్టి యొఱగకుండఁగఁ బట్టి యుట్టినొట్టి
కోళ్ళసంకటితోడఁ గూడు నీళ్ళిడి జాగు నెరపక బంటుబానిసలఁ బనిచి
తనివెచ్చకలినీటఁ దా నమర్చి యనుంగునిసువు జోలఁ బాడి నిద్రఁ బుచ్చి
యోతువు గొనిపోవకుండఁ గూయిడదెచ్చి కోడితండంబులఁ గూండ్లఁగమ్మి

తే. దాలిఁ గాఁగిన నీరాడి నీలికమ్మి, మడుఁగుఁ బైఁగప్పుకొని కాళ్ళు ముడిచిపట్టి
మంచమునఁ గూలి నిదురించుమగని లేపి, కూరయును వెన్నఁ బడవైచి కూడొసంగి.

తే. సన్నజాఁదపునేఁతమంచంబుమీఁద, దుద్దుగంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు
మగనిఁ గూర్కకు మనుచు నమ్మాయలాఁడి,వెడదగంగాళమునఁ గూడుగుడిచిలేచి.

క. గుడుగుంబోఁకలు బ్రద్దలు,ప్పడ అోఁకటఁ గుమ్మితెచ్చి పతికిడి సున్నం
బిడక యొకకొన్నిసున్నం,బిడి యొండొకకొన్ని మడుపు లిచ్చుచుఁ బలికెన్. 457

క. మగవాఁ డవఁగాఁ దుష్మైద, పొగయం బ్రాయమునఁ గన్నపూవుల నెల్లన్
దగిలి రమియించఁ గలదే, మగవానికి నెందు సరిసమానము జగతిన్. 458

ఉ. వారణలేక హస్తిగిరివల్లభు సేవకు వచ్చిపోవుచి
న్నారిమిటారు లీపురమునం గల రచ్చవురాకుబోండ్లతోఁ
దారసమైనతీరుగలదాని నొకానొకపోటి నెన్నఁడై
నా రతిఁ దేల్చవే కడువినం బ్రియమయ్యెడు నాకు నింతయున్. 459

చ. పలుచని మేను నిబ్బరపుఁ బ్రాయము వాఁడవు కంది కప్పుడుం
గలిగిన రెడ్డివిం గొనఁగఁ గత్తవు కాఁపుర మెచ్చునిన్ను నే
వెలయొలనాగ పిల్వ దది వేడుకఁ బోలిన నీకుఁ జిత్తమే
పొలఁతుక మీఁద నుంచు నిది బొంకక నాకెఱుఁగంగఁ జెప్పుమా. 460

క. తడవుల నుండియు నిది ని, న్నడిగెద నని యుండు మఱతు నను టయ్యుఁ గాఁపుం
గొడుకు విడియంపుసొంపుం, జడుపుం బెనఁగొనఁగ నప్పసాలికి ననిరోన్ 461

ఉ. ధీరత మంచిదానిపగిదిన్ మృదురీతుల వేఁడిమాట లే
తీరున నైనఁ బిల్చుకొని తిట్టుదుఁ గొట్టుదు నంచుఁ జూచెదే
యూరకయున్న జాల్వెఱతు నుండు మెఱుంగుదు నిన్నుఁ బోల ది
క్కేరడ మిట్టిగోల కెఱఁగింపక యొవ్వరితోడఁ జెప్పుదున్. 462

క. నావిని వెండియు నలయి, చాపవతి పతిఁ జూచి పలికె సుసత నైనై
కానలెనని చేఁడుగునఁట, నావలనం గనలుపుట్టునా యింతైనన్. 463

క. వేడుకపుట్టెడు విన నా, తోడుసుమీ చెప్పకున్న దోషము లేదే
చేఁడియుఁ బోయితి వనఁ జలి, పిడి కృషీవలుఁడు నవ్వి వెలఁదికి ననియెన్. 464

ఉ. ఒట్టవు సత్య మేనెఱుఁగ నొండొకభోగము దానిఁ గాంచికా
పట్టణమందుఁ గూడి గడపై మనవాకట నాడి పద్యముం
గట్టినపీటిం జగుతిగాఁ దిరుగాడ నెఱుంగ వేమొ నా
చుట్టఱికంబునం బ్రియముసు మ్మిఁక మాటలు వేయునేటికిన్. 465

ఉ. నావిని గోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై
యావెడమాయలాఁడి యను నాతని కోరి మెఱుంగుబోఁడు లే
కై పడినైన వేఁడుదురుగాద మొఱుంగు లెఱుంగఁగోరువా
రై వినరానిమాట లకటా మగవానికిఁ జెప్పవచ్చునే. 466

క. దాపురము లేక యీ క్రియ, గాపురములు సేయుచున్న గరితలతో నీ
తీపురములు వాక్రుత్తురె, కాఁపుల నినువంటివారిఁ గానవె తులువా. 467

క. అని కలసి పులుకుపులుకునఁ, దను జాడం జూడఁబట్టి తన్నం గొట్టెన్
దనివిసనఁ దిట్టె ననలుం, గొనబుగ రోద మగని చెగనికొం డాటమునన్. 468

ఉ. కావర మెత్తి యిట్లు తనుఁ గాతియఁ బెట్టుచు నున్నదాని ని
చ్ఛావతిఁ జూచి లేచి రభసంబున రెడ్డనపల్కె నోసి నీ
చేవ రయొఱింగికాదె మును జెప్పక గుంజిలిపెట్టియుంటి నీ
ర్వే వయదన్న వేఁడుకొనవే మఱియేనయి చెప్పినాఁడనే. 469

క. నాతోడని నన్నడుగుట, యీతెగుదెంపునకు ముగిసె నిఁక సేమనుచున్
రాతికొడు కతఁడు హాళసం, జాతకిణాశ్వాతికరినశయమునఁ జఱిచెన్. 470

వ. ఇట్లు వేల్రిటుపడి దండతాడితభుజంగియుంబోలె నమ్మోహనాంగి నింగిముట్టిన యులుకం బట్టిన సికవీడి నిలఁపంబడి యులువెలువడి. 471

క. అడికలం బడితినొ అం,కాడితినో యిల్లు ముంగిలననో తఱితోఁ
గుంపసనొ స్వీల్లవననో, కూడున యిల్లాలి నన్నుఁ గొట్టం దిట్టన్. 472

క. విరసమునఁ గొట్టుపడి నా,సరిగరితలలోన బ్రతుక సైఁతునె మఱి నే
నురెఁ బోదు త్రాటఁబోదున్, ధరియింతునె సైఁపు మింతదడ విన్నోటన్.

క. ననుఁ గన్నతల్లి ప్రజలకు, వినిపించినపిదప నచుచు వెసఁ బుట్టిల్లం
దునికి యటకేగు కైతవ,మున నుసవల్లభునికటమున కదిపోయెన్. 474

క. ఏతెంచి నిర్ణిరుద్ధ, ప్రీతి న్మణిమంతుఁ గ్రుచ్చి బిగికౌఁగిటవ్యా
జ్జాతపృథుప్రథనంబున, శాతోదరి పెనఁగె రెండుజాలవ్వేళన్. 675

క. విసువక చనుసెనుకెడున,ప్పనిపాఁపఁడు తల్లి దాఁపుఁ బాయుటఁ గడువె
(క్కసమున నాఁకలి గొని తా,) నసురుసురై చెవులు గింత్రు మన వాపోయెన్.

వ. అయ్యేడుప్పు విని యుపపతికి నయ్యువతి యిట్లనియె. 477

చ. అడలెడుఁ జంటిపాఁపఁ పదె యాకొని వానికి నేను జన్నుబా
లిడి చనుదెంతు నింటిమగఁ డింతయుఁ ఱుంగకయుండ నీవు నా
రొయిడన వసించి యేమినిసు వేడ్చెడు రెడ్డన నాకుఁ దెల్పుమం
చడుగు మతండు చంటికొఱకై యని నిక్కమ మొప్పఁ జెప్పెడున్. 478

ఉ. చెప్పినఁ దల్లి యొందరిగెఁ జిన్నికుమారుని డించి సర్వముం
జెప్పఁగదయ్య యివ్విధము చిత్రము నాకని వేఁడఁ మాతఁ డి
ట్లొప్పనిమోముతో నను దురుక్తులఁ బల్కుచు మందబుద్ధి యే
తప్పునులేమి నిల్వెడలి తల్లిగృహంబున కేగె నంతగన్. 479

క. నావిని మాయాతనితో, నీనను నుతు విడిచిపోయెనే యకటా నీ
దేవియుఁ బుట్టింటికి న,య్యో వలదని మాన్ప కెట్టులుండితి విచటన్. 480

ఉ. ఐన నిఁకేమిసేయఁగల మాకట నేడ్చుకుమారుఁబట్టి కొ
ట్లీనిశి రోసరించి నిలు మోపు మదీయవధూటి వచ్చి నీ
కానకకన్నపట్టి కిడుఁగాని ఘనస్తనదుగ్ధ మంచు స
న్మాన మెలర్ప నాడు మనుమానముతే కతఁ డోసరించినన్. 481

వ. పంతంబు చెల్లించుకొనుదాన నని చెప్పిన మణిమంజుం దమ్మాటలు గాఁపుకొడుకున
కెఱింగించె నెఱింగించిన. 482

ఉ. ఉండెదఁ జెప్పినట్లు నిలుపోపనియాఁకట నేడ్చి యేడ్చి యా
క్కొండినవంటిపాఁపఁ డిప్పుడేమగునో మఱిలేరు బిడ్డ లా
క్కొండిదె వీఁడు నాకొడుకు గాఁడు ధనత్తనయుండు సత్కృపా
మండన వీనిఁ బ్రోచికొనుమా యని పాలికిఁ డోసరించినన్. 483

క. అప్పలువచేలువ జారుని, గుప్పటిముసు కొవరించి తోగపుమురిపం
బుప్పతిలఁ గులుకునడలం, జొప్పెప్పెసుండ దనశిశువుకడ కరిగెన్. 484

తే. అరిగి పెరిగినయాఁకట నఱచి యఱచి, యేమ్పు విడువనితనపట్టి నెత్తి పట్టి
కులికి చన్నిచ్చి పొత్తిపొత్తుల నమర్చి, మగనికెంగేలఁ జేనకి యాస్మగుచ వెడలె.

క. ఆలరితనమున లీలం, గేలం దనుఁ జెనకి చనినగిరిపుచ తనయి
ల్లాలని తెలియక పఱవి, ల్లాలని యాగడ్డబిడ్డఁ డపరు విరాళిన్. 486

శా. రావే వల్లనిగుమ్మ ఏననుచు నారాటంబునన్ వేడ్డి నా
నావిభ్రాంతులఁ గుబ్బతిల్లునెడ నోనద్యనకేతుండు కీ
శ్యైవైచెం గొలకమ్ములం బొడిచెఁ గాలం గేల మర్దించె నా
పోవన్నమ్మెటఁ గొట్టెఁ దిట్టెఁ జిలునిప్పు ల్రాల్చె నేత్రంబులన్. 487

క. చేసెడువలరాయుని కై, కాసములకుఁ గాక జడిసెఁ గాపుంగొడు కా
లో సుదతిఁ దెచ్చుటకు ని, ద్రాసక్తుని మీఁటెఁ జన్ను ద్రావెడుకొడుకున్. 488

క. మీటుటయు మిట్టిపడి యా,చ్చోట నృధిరంబు గ్రమ్మ సుక్కుము నోడ లా
రాటపడఁ జంటిపాపఁడు, కాటుకకన్నీరు దొరుగఁ గావున నేడ్చెన్. 489

వ. అయ్యేడ్పు విని యిచ్ఛావతి యయ్యుపతి కిట్లనియె. 490

క. కొడుకుం గుఱ్ఱుకుఁ జనుబా, లిడ నీతో రతుఁబెనఁగ నేతెంచుచు నా
కడకేలం దాఁకించితి, గిడుదెర్లికపుట్టి పొఱలఁగా మా రెడ్డిన్. 491

చ. తమకముపుట్టి నేఁ డదికతంబున రెడ్డన నిద్రఁబోవుతేఁ
గొమరుని నేడిపించె నదిగో తిరుగంబడి చన్నొసంగి ర
మ్ము మరల నంచు నన్నటకుఁ బొమ్మని నీవనుపం దృఢానురా
గమునఁ బ్రియంబుఁ జెప్పి నను గౌఁగిటఁ జేర్చి సుఖించుదానిఁ కెన్. 492

శా. పోరం బోచ్చెఁగదయ్య యూఁకటికి నీపుత్త్రుం డయో యింటికిం
రారాదా వెడిపోని యి ట్లలుకం గాఁబట్టఁగా వచ్చునే
దూరక్షోణి వసింపవన్నాసఁగఁబుత్త్రుం గూర్చి నిల్లాలు నీ
తూరిన్ లోపలికంపుఁ బల్కు మతఁడుం దుం గొంది నంచాడినన్. 493

క. కలితవమునఁ జని యలనా, పలుకుం బంతంబు చెల్లుబడిగా రెడ్డిన్
గలసి యొకముడుపుఁ గైకొని, పిలిచిన నీకిత్తు నేం పెట్టుదు మగనిన్. 494

వ. అని యుస్సు డప్పిసాళి మణికుంతుం దత్తమిన నతం డది పలుకుమన్నట్లు పలికె నమ్మాటలు విని కర్షకుం డుత్కర్షింపను నిట్లనియె. 495

క. ఎడగలుగ నుండెఁ దనమే, న్వడకెడు మతిపసులంటివారము చనుబా
లిడుఁగాని పుణ్యమయ్యెడు, విడనాడక యిటుకుఁ బనుపవే యిల్లాలిన్. 496

క. నావానిమాటలకు లోలో వెడవెడ నగుచు నింటిలోపలి కలయి
చ్చానతి పోయెం బోయినఁ, గోపరపుంబ్రేమఁ గాఁపుకొడు కవ్వేళన్. 497

ఉ. కే లగలించిపట్టి రతికిం బిఱుబీకులు సేయ లోనుగా
కాలరిజంత నేఁజెడితి నమ్మక సిగ్గులవాఁడవౌదు నీ
యాలనె వింతదాన మగనాల నయో తెకతేఱ నన్నుఁ బ్రా
ల్మాలుపఁ జూచెదో తెగర మామగవార లెఱింగిరేనియున్. 498

ఉ. మేనికిఁ జేటుగాదె పులిమీసల నుయ్యెలలూఁగ మాను నేఁ
గానటునంటిదానఁ గొఱగానిపను ల్దలమీఁదవచ్చునే
రానిఁకఁజాలుఁ జే విడువరా యని సూత్క్రరవంబున న్సరో
జానన పల్కునన్ వాలికుఁ డాజగతోఁగకుఁ బ్రీతి నిట్లనెన్. 499

క. ఇటువంటిదాన వేలా, చిటిపొటికెం గేలు నన్నుఁ జెనకితి నినుబా
యుట ప్రాణంబులఁ బాయుట, కుటిలాలక కరుణలేదకో యిట్లాడన్. 500

క. అని బాఁతిఁబాఁతిపెట్టిన, పెనుబ్రాతవరాలసోలఁ బెకలించి ఘన
స్తన కిచ్చి క్రుచ్చి కౌఁగిట, నెనయించెం బంచబాణుఁ డెసకొల్పంగన్. 501

క. అది యాత్తెఱఁగున నతనిన్, గదియంబడనిచ్చి పెఱపుగలదానిగతిన్
గుదులుకొను నేలబుసకో, ట్టైద వను నేనెట్లుచేపడితి నను నపులన్. 502

క. పోవలె వడిగా వడిగా, లేవయ్యా ప్రక్క లోన లేకుంటే నేఁ
గావఁడు మగఁడని యలయి, చ్చానతి కర్షకునిఁ ద్రోచెఁ జదికిలబడఁగన్. 503

వ. కరాపాతంబుకంటె మున్నుగా లేచి యప్పలువచెలువ కన్నులసాం పామతింపఁ
జని విత్తిమిచ్చు పంతంబు చెల్లెఁగదా యని జారుని నిజకరంబునం జఱచి చక్కిలి

గింతపెట్టె నప్పుడు చతుర్ఘటికావశేషంబుగా రాత్రి చనియె దిక్కులు ప్రకాశ ప్రతతిం బొందెఁ బిచ్చుకలు పిచపిచ మనియెఁ గాకంబులు గూకలిడియె దధిమ థనఘుమఘుమధ్వానంబులు సెరసె గోవత్సకోలాహలంబులు వినవచ్చె నయ్యెడ గృహంబు వెడలి పెరడు చొచ్చి వచ్చుటకు విహారగృహంబు పోయినఁ గనుచేచు కునియుండి. 504

క. అపు డిచ్ఛావతి యచ్చో, నుపవల్లభు నిలువఁబనిచి యోడక యిలుసొ
చ్చి పాదవుగల మచ్చపయిం, గపటవ్యాపార మమరఁగాఁ గూర్చుండెన్. 505

క. హాలికుం డాలోపల లో,పలికిం జనుదెంచి మచ్చుపైఁ దనయిల్లాల్
నిలిచినతెఱఁ గెఱుఁగక యపు, డిటువెడలినబుద్ధి నిశ్చయించి కనలుచోన్. 506

ఉ. ఈలువు వంగడంబు గల దీజవరాలని యొలి రొక్కరొ
క్కాలిడి యొట్టిఱంకు తడక న్వరియించితి దీని నక్కటా
చాలు సహింప దీచెనఁటిసంగతి యొండొకమాయపన్ని యో
యాలరిజంతఁ జంపి సుఖినై యొకదిక్కునఁ బెండ్లియాడెదన్. 507

వ. అని హుమ్మని యాడుగటిచి నిూసంబులు దీటుచుండ నయ్యండజయాన మచ్చు డిగ్గ నుఱికి యెదుర నిలువంబడి యిట్లనియె. 508

ఉ. ఈలువు వంగడంబు గలదే మును బోంట్లకు నీకుఁ గాక రొ
క్కాలిడి యిట్టిఱంకుతడక న్వరియించుట రోఁతగాదె నీ
కేలసహింతు నన్ను మఱియింపు మొకానొకనాఁటఁ బెండ్లిఁగ
మ్మాలనె నీకు నేఁ దగుదునా చను నీ కిటులాడ నిచ్చలున్. 509

ఉ. నిక్కము రెడ్డిబిడ్డవని నిన్నుని నమ్మి గృహంబుఁ జేరి యీ
దిక్కున నున్న హూద్రసుదతి న్మఱుపిచ్చి రమించినాఁడ వి
త్తైక్కలిఱంకు నాకుఁ గలదే యని ముందలఁ బట్టి యీడ్చి యా
రక్కసదన్నె ముక్కు చెదరం జరణంబున వాని నెవ్వడిన్. 510

ఉ. తన్నిన వాఁడు తచ్చరణతామరసంబుల వ్రాలి నిన్ను నే
మన్నది లేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నా
పిన్నతనం బొకళ్లచెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గువోవు నా
వన్నియసన్నమా వగరివారికి దండుగఁ బెట్టనిమ్మగున్. 511

క. చెఱుపకుము కాఁపురంబని, పఱిపరి యగుతాల్మి నట్లు ప్రార్థింపంగాఁ
గుఱఁగట నేగుచుఁ దలవరు, లరిమురికర్షకునిమాట లాలించి తగన్. 512

క. గిలుకలువైచిన సుదయులు, ఘులుఘుల్లున నూఁదికొనుచుఁ గదియాం జని యా
హాలికునిఁ గొని చని ధరణీ, తలవల్లభుమ్రోల నిలుపఁ దప్పేర్పడఁగన్. 513

క. నరపతి దండుగఁ గొని యు,ప్పరి వెడలం గొట్టె నపుడు భువనచరాదు
ల్పరియాలగు నీకు నుదా, హరణం బిది యనుచు వానరాగ్రణి చెప్పెన్. 514

వ. చెప్పి వెండియు బహూమానుండు. 515

క. తులువా నీయిల్లాల,య్యాలి వేణికిఁ దోడుబోయినది దానిమ్మాహో
క్తులకుఁ దెగఁజూచితివి నీ,తలద్రెవ్వను బొలిసిపోయెదవు తరువాతన్. 516

క. చేపడినసొమ్ము దూరం,బై పోయె న్మోసమయ్యె నని యంతస్సం
తాపమునఁ బొక్కి పొఱలకు, మీపాటిం బొమ్ము చాలు నింటికిఁ గ్రకచా. 517

క. క్రించామూర్ధుని నిను ద,క్కించుట యన నెంత సింధుకీలాలమునన్
వంచింపఁబడదె మున్నొక,వంచక మభిజాతకమఠపల్లభుచేతన్. 518

క. నావిని కాననచరగో, త్రావరు నీక్షించి పలికెఁ గ్రకచుఁడు నయవి
ద్యావైభవగుణసుభగం, భావుక వివరింపు మాయుపాఖ్యానంబున్. 519

ఆ. కుటిలుఁ డప్రయోజకుఁడు వీఁడు వినితో, నేటిజోలి నన్నుబోఁటి కనక
వివరపుట్టఁజెప్పవే నిష్కళంకస్వ,భావ నావుఁ డలర ప్లవగవిభుఁడు. 520

వ. క్రకచునకు నక్కథఁ జెప్పందొణంగె. 521

సీ. కలిగొట్టు మోఁదుగు కానుఁగు గలుగువావిలి మేడి నేరేడు నెలసు బలుసు
మఱ్ఱి మంకెన మద్ది మారేడు బూరుగు గోరంట లొద్దుగు క్రోవి రావి
జావ్విమామిడి జీడి సుయుగుడు మొలుగుపాపట చంద్ర పనిరిక పాల రేల
పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప గుమ్ముడందు గురువింద గోను రేను
తే. చిల్ల చింత మొగలి చీకిరే ఱూఁదుగ, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి
వేగి వేము మొదలుగాఁ గలమ్రాకుల,కాన నగుచు నొక్కకాన మెఱయు. 522

వ. కరిపుటికాంతరాళచులుకక్రమణాయితసింధుసర్వతః
పరివృతకృత్రిరోదములు వాసిన దర్ఘుటజాన్యపాణిజ
ఝరితములై నభోగతికిఁ జాలక పల్వలము ల్భజించె నాఁ
గర మలరు న్నమగ్రబలకాయము లవ్వనికాలులాయముల్. 523

ఉ. ఆహ్వృతజంతుభీషణబలాభ్యుదయాప్తి గుహాసురక్తి గో
త్రాహితివృత్తి వజ్రకఠినాతిశయాకృతి శౌర్యగర్వరే
ఖాహమికం బ్రసిద్ధరుధిరామృతపారణజంభదానవో
త్సాహవిఘాతిచందమునఁ దద్గహనంబునఁ గ్రాలుబెబ్బులుల్. 524

మ. చరణప్రాంతచరిష్ణువుల్నిరుపమోచ్చస్థావసంక్రీడన
స్ఫురణం జన్మఘనత్వమంద నరుదెంచుం గీడు మీ కంచు మ

త్సరబుద్ధిం బలెఁ జెంచుమేఘముల దంతత్రోటికోటిం జలా
హరణారంభణజృంభణంబులు దదీయవ్యాళశుండాలముల్. 525

మ. తనరస్సుల్కవిసంభవాండభువనధ్వాంతచ్ఛిదాచంచువు
ల్వనఁ జెప్ప న్వెలఁగెమహాతిమిరపాళి న్విచ్చిపోఁ దోలలే
వని రక్షోర్థశరజోదర స్తిమితదీక్షాభోగులై హేళిక
న్గాన నఘోరతరాటవి న్మనుచెలంగు ల్గుంపులై వేసవిన్ 526

శా. పైపైఁ బ్రాణిపథప్రధానగుణ మొప్పం గారగారద్యుతుల్
దీపింప న్విషమాంబకభ్రమిఁ బ్రభీతిం జేయు నత్యుత్కటా
టోపం బుగ్రగజాహ్వాతివ్యసనకండూలంబుగా నుండుగుం
పై పంచాస్యము లయ్యరణ్యమునఁ బంచాస్యప్రకారంబునన్. 527

శా. క్రందై పెల్లడు ఘుర్ఘురధ్వనిమృదంగస్థాయిగాఁ దాలుని
ష్యందస్థూలవిశాలలాలసవరంబై యొప్పశృంగోద్ధతిం
జెందుల్ ద్రొక్కఁ గుడుంగిరంగముల నిస్సీమత్వరాతిభ్రమిం
బందుల్ దిక్కులగయుచ్ఛిదాగుణపరిస్పందుల్ దగున్రాటవిన్. 528

క. అలఘుతరవారిధారా, దళితప్రతికూలసకలధరణీభృత్సం
కులమై యొకసెలయేఱు, పొల్పలమున జగదేకవీరుపోలిక నమరున్. 529

వ. అది రామలక్ష్మణాలంకృతంబై పంచవటస్థానంబును సత్వసంపన్నంబై సమీర
ణంబును గజగవయవిహారయోగ్యంబై కిష్కింధానగరంబును నుపాసితపరమ
హంసంబై వేదాంతశాస్త్రంబును నఖండశబ్దక్రియానిరూపణంబై వ్యాకరణం
బును ప్రబోధితనిగమజాలంబై ధర్మంబును ఘనరసప్రధానంబై విద్వత్ప్రి
బంధంబు ననుకరించిన యమ్మహాప్రవాహంబున. 530

క. నీతికళానిధిగలఁ డభి,జాతుం డనుకమఠవిభుఁడు సంతతపంక
స్థాతృత నొందియు నచ్ఛత, మాతిం డేవంకఁ బంక మంటక తిరుగున్. 531

శా. ఆతాఁ జే లోకనాఁటిరేయి ధరణీవ్యాపారలిప్సాపరం
బై తానంబులఁ బాసి తీరశరతృణ్యావీథుల న్మిల్వభూ
జాతచ్ఛాయలశీతలానిలకృతాంచద్వాలుకాలేఖికా
వ్రాతాభ్యక్రముల న్విశృంఖలగతి న్వర్తించె వర్తింపఁగన్. 532

చ. అటిముటి చిచ్చు నాఁ బొగులు నాఁకట బ్రుంగుడునంగుడై యొడల్
సుఱసుఱ స్రుక్క నయ్యడవిలో నొకనక్క తటస్ఫుటంబులన్
బొతియలఁ దోఁకఁ జొన్పి వెలిభూమికిఁ దార్చిన యెండ్రి తండముల్
గొఱుకుచు వచ్చి వచ్చి యలకూర్మముఁ గాంచి ప్రహృష్టచిత్తమై. 533

క. ఘనరభసంబునఁ గదియం, జనునపు డక్కమలవిభుఁడు స్వాగతంబున వి
ట్లని తలఁచె నిప్పుడిమ దుఁడ, నని యుండుదు నేఁటితుదకు నది బొంకయ్యెన్. 534

ఆ. సకలదుష్టజంతుసంక్రాంతజలదుర్గ, సీమనుండు వెట్టచెట్టలేక
చెదుగుఁబాము గాముచేఁ బెద్దమీనుచే, నీరుకుక్కచేత నెగడుచేత. 535

ఆ. పాయ్యపుర్వు గ్రొవ్వి రోధోవసుంధర, కగసి తెగినపగిది నిట్టులేల
జలములంబు విడిచి చనుదెంచి నా బుద్ధి, పుర్వుమేయఁ జెట్ట బొందఁ గంటి 536

క. కాలంబు దాఁట నెవ్వరు, చాలుగు రని వగచి నిరవసాదవిషాద
జ్వాలం దూలి కబంధచ, రాంకరణంబు నపుడుపాహితకంబై. 537

క. రాతింబలె నతినిశ్చల, రీతి న్నిలుచుటయుఁ గని గరీయఃక్షుద్బా
ధాతురకృశంబు జంబుక, మాతతదంష్ట్రికలఁ గచ్ఛపాగ్రణిఁ బట్టెన్. 538

క. పొదివి తెకతేఱఁ గలిగెం, గద నాకీకమ్మతే నెకరుఁడని దానిన్
దుదకోఱలు కొరలుపోఁ, గొదలే కటుసేయుఁ బొరల్చి కొఱుకుచు నుండెన్. 539

క. విఱుగుట గానక నెరయం, దఱతఱకలు వాఱఁ గొంతదడ వది గొఱికెన్
గొఱికిన నొగులదు పగులదు, చిఱుమొఱకలు పోయెఁ బుల్లసిలె దంతంబుల్. 540

వ. ఇట్లు మృగధూర్తదశనదంశననిర్వ్యాకలితమర్మం బై యక్కూర్మంబు తనలో
నిట్లని వితర్కించె. 541

చ. జరుగదు రోసి పో విడుఁనఁజాలదు వేసటలేక కోఱలం
గొఱికెడు దీనికేమి తుద గోరము వాటిలె నాయుపాయ మం
దఱుఁ గొనియాడ నిచ్చెనఁటినక్క దటాలునఁ డక్కఁ బెట్టి యే
మఱక ననశ్వరం బయినమన్నడఁ గాంచెద నిరుపాచ్చెదన్. 542

క. అని నిశ్చయించి ధీర, త్వనిరూఢుం డగుచుఁ గమఠవరుఁ డానక్కన్
గనుఁగొని యిట్లను నేలా, తిను వలయక మల్లిపోయెదవు పిసవెత్తిన్. 543

క. మఱవక యేఁడులుపూఁడులు, గొఱికిన నాయొడలు మృదువగునె నీకేలా
వెరవిడిచందము పుట్టెన్, దరిదీనికి వెరవుఁ జెప్పెద న్వినుమర్థిన్. 544

క. నావకమ్మరుమార్గమునకు, రానేరదు మేల నీచరణ మనఘా నా
పై నునిచి యేతదంబు, స్థానములోఁ బెట్టు కొంతదడ వట్లయినన్. 545

క. చెన్నార నపుడు చేసిన, వెన్నవలె న్మెత్తనగు విపులవపు సం
పన్నము నుమ్మీ తను వాఁ, కొన్నమహాత్ముడకు నీకు గుడునఁగవచ్చున్. 546

క. తనివిసనఁ దినకపోవని, మనమునఁ దలపోసి రోసి మనుగడపై నీ
కనువైనవెరవుఁ జెప్పితి, నని కూర్మప్రవరుఁ డాడె నట్లాడుటయున్. 547

వ. అప్పలుకులు సిద్ధాంతీకరించి యవ్వంచకం బట్లచేసెఁ జేసి ముహూర్తమాత్ర మూర
కుండ యయ్యభిజాతున కిట్లనియె. 548

క. తడవయ్యె నీటిలో ని, న్నిడి మే నేమైన నానె నే తనివిసనన్
గుడువవలె నిజముఁ జెపుమా, జడియక నీ వనిన వారిసత్త్వము తనలోన్ 549

క. ఈవంచకంబు నామా, యావాగురఁ జిక్కి దక్కె నసుపంచకమం
చావిర్భూతోత్కళికా, ప్రావృతమై యపుడు కచ్ఛపం బిట్లనియెన్. 550

క. ఆసమోదక మంటఁగ నా, నె సమృద్ధము లంగకములు నీపాదము క్రిం
దిసుమంతనాన దెవ్విధి, మెసవెదు నీవంటి కెట్లు మృదువై యుండున్. 551

క. మెత్తనగుఁగాని శీఘ్రము, గుత్తముగా వెన్నుఁ ద్రొక్కుకొనియున్న పదం
బెత్తుము నీరంటఁగనవెల్ల, జిత్తము సుఖపారణావశీకరమైనన్. 552

క. పోఁగుఁగఁబో యీ వాఁకట, జాగేమిటికంచుఁ బలుక సంతుద్బాధా
జాగరణబుద్ధి జంబుక, మాగోచరుమాట నిశ్చయము పొ మ్మనుచున్. 553

క. పై దారుణముగ నూఁదిన, పాదము దివియుటయు గచ్ఛపము సంతోష
ప్రాదుర్భావప్రాప్తము, హోదంచద్వేగి మగుచు నురువడిఁ బఱచెన్. 554

క. క్రకచా యీచాడ్పునన, క్కుకు మోసము గల్గియుండెఁగా మఱి నినుబోఁ
టికిఁ దగులుటెంత యని కీశకులాగ్రణి చెప్పి మఱియుఁ జలచరుఁ బలికెన్.

క. వెడమాయనక్కమాటల, కడవికిఁ జని తిరిగి వచ్చి యప్పటియుం దా
నడవిఁ బడి బడుగుహరిచేఁ, గడతేఱినగర్దభిమ్ము గాఁ జూప్పు శఠా. 556

క. అనినవిని శింశుమారుఁడు, వనచరు నీక్షించి యింతవాఁడవు గాకుం
డిన ముదిసి ముప్పదను కా, మనుదే యిది తెలియఁబలుకుమా వినవలతున్. 557

వ. అని యడిగిన బహుమానుండు. 558

సీ. కలదొక దుర్దాంతకాంతార మరవిందబంధుఘృణ్యంతర్థి పాదపంబు
దీర్ఘదంష్ట్రాభిఖ్యఁ దేజరిల్లుమహోగ్రసింహ మచ్చో నివసించియుండు
దానికి ఘటకాభిధానజంబుక మొకం డహరహం బాప్తకృత్యము లొనర్చు
చట్లు కొండొకకాల మరిగినఁ గర్మానుకూలత నపదృత్కుక్షిరోగ

తే. మసృణతరవేదనాకంపమాన మగుచు, వెగ్గలంబైనధృతి జారి యగ్గజారి
పాఱలు నాపోవు నలమరుఁ బొక్కుప్రుక్కు, బోరగిలఁబడు నిట్టూరుపులు నిగుడ్చు.

క. ఈరీతిఁ గడుపునొప్పిం, గూరాకై యుడికి గోఁడు గుడుచుచు శుండా
లారి యొకనాఁడు నిజర, క్షారససంఘుటకుఘుటకుఁ గనుఁగొని పలికెన్. 560

చ. తినదెసఁ జూచినాఁడవక దా ఘటకా కటకాంతభూమికిం
జని మఱిగోచనం బమరఁ జంపి శరీరము ద్రచ్చి లోపలం

గనుఁగొనవైన గర్దభముకందనగాయ గ్రహించి తెచ్చి యి
చ్చి నిలుపుపానిపోఁ జలిదిఁ జేకొని యుండెదు జీవితంబులన్. 561

చ. తడసినఁ జత్తుఁ బొమ్మనినఁ దచ్చరణంబుల సమ్మదంబునం
బడిపడి లేచి యప్పనికిఁ బొల్పడి జంబుక మేగి యొక్కచో
గడుకృశమైనదాని నొకగర్దభముం గని చేరి యిట్లనున్
బడలితి వేల రాసభ శుభంబగు నాకతెఁగింపవే యనన్. 562

వ. గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 563

క. చాకలవాని కఠినమనై కోకలు మోసి తెత్తు నాపణవీథి
వ్యాకీర్ణప్రీహితుష, స్వీకృతి మేన్ బ్రోతు నెట్లు చిక్కక యుందున్. 564

క. కానఁ గనవిపాపకర్తుఁడు, తను నాహారాధివిధులఁ దనుపఁడు మేయన్
జననీఁడు కాలుగట్టు, న్మనుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్విధ మనఘా. 565

ఉత్సాహ. మీను పొందుగాదు లేదు మేను సౌఖ్య మక్కటా
దైవవానిచేతి పేనుచంద మైతి నంచు న
మ్రానవంబుతోడనున్న వార్త లేని నెయ్యమున్
గానరాఁ జెనంటి జంబుకంబు దాని కిట్లనెన్. 566

మత్తకోకిల. కాలఁ గుంటివి గావు బీఁకువు గావు గర్దభముఖ్య ని
కేలయివ్విధి నెవ్వచేఁ గృశియింపఁబోదము రమ్ము మ
త్కేళికాననశాద్వలంబులఁ గ్రీడసల్పఁగ మత్తసే
వాలఘుత్వము చాలు నీకు గవారివారితృణావళుల్. 567

క. అని చెలువు గులుకుపలుకుల, మనమూటించుటయుఁ దేఱి మనఃజానసీనం
బున నునిక కష్టమని ఖర, మనశంబై నక్కబడి మహాటవి కరిగెన్. 568

క. అరిగినఁ బరిచితపటుసం, భరమున్ ఖరము న్నిమ్ము క్తబలగర్దభశే
ఖరముం గురవము ఖరమున్, హరిపాలం బెట్టి నక్క యక్కటికమునన్. 569

క. నెఱిసరిగ దానిపైఁ బడి, కఱవన్ లాఘవములేమి గాళ్ళీడ్చుచు న
డ్వీలుపం గదిసిన నత్తెఱఁ, గెఱిఁగి ఖరం బదరి తిరిగి యేగుచు నుండెన్. 570

క. గునుకత్తుచున్న గాడిదె, గనుఁగొని సింహంబు పలికె ఘటకునితో నీ
చనుఖరము దరిమికొన నా, తనువున నడిలేకు తెమ్ము దగ్గఱఁ జేసన్. 571

చ. చనుమన వట్లకాక యని జంబుక మప్పుడు గర్దభంబుఁ జే
ర నరిగి యేఁటపోయెద కటా వసనంబులమోవ బస్తుఁన్
పనదఁగ వేడ్క యయ్యెడినొ నల్దిటువంటికుబుద్ధు లివ్వనం
బునఁ గొన మేఁపు నీళ్లు గలవో పతిమన్న న నీకుఁ జాలదో. 572

వ. తమ్మనిన గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 573

క. కేసరివన ముద్యోగముఁ, జేసిన నగ్గమక మెఱిఁగి చెలికాఁడా సం
త్రాసమునఁ దలఁగి వచ్చితి, గాసిలి ప్రాణములు తీఁపుగా యెవ్వరికిన్. 574

క. నావిని ఘటకుం డనుఁ దగ,వా వెరవఁగ నధిపుఁ డట్టివాఁడా విను సం
భావించుటకె ట్లొరయుం,గా వచ్చుట యింగుకేల గళవళమందన్. 575

చ. తవతవ గ్రొత్తక్రొత్త యగుటం జనియించెను నీకు నేఁడు శే
పవుటయు మమ్ము మీరఁ జనువంతయు నీయది కొంక నేల ర
మ్మవసర మిప్పు డేమఁ జను నాఖును న్మరలించి తెచ్చి గా
రవగుణ మెక్క నక్క మృగరాణ్నికటంబున బెట్టెఁబెట్టినన్ 576

తే. కలుకులుకునఁ గుత్తుకఁ గఱచి విఱిచి, నక్క నక్కఱఁ జీరి కుండాంపైరి
గర్దభము కుక్షి భేదించి కర్ణహృదయ, ముదయు దాహ్లాదమున దివ్వ మోపవనక.

వ. ఏను సెలయేటిజలంబు లానివచ్చెద నని చెప్పి యాఁడు గామడగా నరిగిన. 578

సీ. ఖరశరీరము విప్పగా గొప్పలగుదంతసంతసంఘుంబుఁ గ్రుచ్చి క్రుచ్చి
మృగధూర్త మాకర్ణహృదయంబు భేదించి యది యనర్ఘంబగు టెఱిఁగి కాచె
యతుంరంహము సింహ మాశించె భక్షింప నత్యాజ్య మిన్వస్తు వనుచుఁ దాన
భక్షించి పరిశుద్ధుపగిది నూరక యుండె నపుడు కంఠీరవ మరుగుదెంచి

తే. కొనలయు నౌంఢంబు దెమ్మనినఁ గొంకు, కొసరులే కది పలికె నోకుంభివైరి
గర్దభాకారమున లేరు కర్ణహృదయ, మరియు కలిగిన నిన్నేల కదియవచ్చు 579

సీ. అని నక్క తక్క కిట్లాగుమాటలు యథార్థీకరించి యాదల్పఁ దెరువులేమి
నుడిగెఁ గేసరి యూరకుండె న ట్లాపంచకము మహాకపటవాక్యములు నమ్మి
గహనమండలి సొచ్చి క్రమ్మఱ మఱియు నేతెంచి దుర్వ్యథితద్విరదవైరిఁ
జేరి తద్దంష్ట్రికదారినఖకముగాఁ దలఁపకు నన్నని బలిముఖుండు

తే. పలుక నేమియు ననక యజ్జలచరుండు, లబ్ధనాశవ్యథాజాతలఘుగుణోతి
రావిలపిపాస దీఱ నీ రానిచనియె, నద్భుతత్వరతోడ నిల్లాలిఁ జూడ. 580

క. అని విష్ణుశర్మఁ డాదర,మునఁ జెప్పినరాజసుతులు ముదమున గురునిన్
గనుఁగొని పంచమతంత్రం, బనఘా మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 581

మ. అతి హృద్బోద్ధ్రిపమోహ భక్తినతదివ్యవ్యూహ విఘ్నార్జిత
క్రతుపుంజార్చితపాద వర్ధితపటుప్రహ్లాద పుణ్యవ్రతా
యతనాథ్వన్య జగత్త్రయీభరణవిద్యాధన్య త్ర్యంతకీ
ర్తితపీతాంబర కృత్తిధారణకు గాధివ్యాధినిర్వారణా. 582

క. అదృతశుకముక్తిమహా, పాదపకిసలాయము నపదయుగనానా
వేదశిరః ప్రసవప్రా, సాదవ్యాపారదీనజనమందారా. 583

మాలిని. హరిముఖసురమాళివ్యస్తపాదాంబుజాతా
పరహితరతిధామప్రాంతయుక్పారిజాతా
పరుషతిరవిలోకప్రాంశుధూతారిజాతా
చరణశరణరక్షాజాగరూకైకచేతా. 584

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధసరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృతసీహారపర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతంబైన పంచతంత్రంబున లబ్ధనాశం బన్నది చతుర్థాశ్వాసము.

---

శ్రీ రస్తు.

# పంచతంత్రము

## పంచమాశ్వాసము.



హిమగుప్రియతనయా
మోహాస్నేహావలోకముగ్ధభ్రమర
వ్యూహాసముపాస్యసిద్ధ
వ్యాహృతిమధుముఖసరోజ హరిహరనాథా. 1

వ. దేవా యసమీక్ష్యకారిత్వాభిధానం బగుపంచమతంత్ర మాకర్ణింపు మధీతనీతిశా
స్త్రమర్మం డగువిష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. అపరీక్షితం బకార్యము, సుపరీక్షిత మభిమతంబు సురి మ్మెన్వారి క
య్యపరీక్షితవిధిఁ గాదా, యుపతాపము పుట్టె విప్రయువతికిఁ బతికిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రది వీనులవిం
దై వెలయఁగ నీకథఁ జెపు,మా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. గౌడదేశంబునఁ గలఁ డాగమాభ్యాసజడుఁడు విప్రుఁడు దేవశర్మ యనఁగ
నతఁడు సోమసుధాత్మసుత యాజ్ఞసేని నాఁ బెంపొందుకులకన్యఁ బెండ్లియయ్యె
సంతులే కలశరజ్జలజలోచన తాయి గన్న తౌతికిఁగుండు గన్నగుంటి
కెఱఁగుచు మఱుగుచు నెవ్వరే వ్రతములఁ జెప్పి రా వ్రతములఁ జేకొనుచును

తే. సుతులఁ గనిపెంచుగరితలఁ జూచి యేచి,యిచ్చ ముచ్చట నొందుచు నిట్టులుండఁ
గొంతగాలంబు పోయిన గొడ్డుపీగి, కాంతిజితహేమసుమగర్భగర్భమయ్యె. 5

సీ. ఓఁకర బలిసె జిట్టుములసందడి మించెఁ గలకవాతెఱఁగపోలఫలకయుగళి
బుద్ధిమృద్భక్షణంబునకు నువ్విళులూరె రశ్మిచామనమేన అచ్చుజేసెఁ
గాళిమ గుఱకుచాగ్రములఁ బాళెము డిగ్గె గార్శ్యంబునకు బొమ్మగట్టె నడుము
నిద్రారతిప్రీతి నేత్రంబులకుఁ గల్గె ముఱిపంబు ముంగర మోసులెత్తె

తే. నరుచి యాహారసుఖముల నడ్డగించె, మధురరుచులకు నెదురెక్కె మానసంబు
విశ్వరక్రాంతి నడకల కెవ్వడొసఁగెను, నక్కటంగోత్తునకుఁ జీర చిక్కటయెను. 6

క. కులలక్షణములలీలన్, చూలాలై యున్న జాయ సుగుణనికాయన్
జేలాతీత ప్రీతిం, బాలితనిజగోత్ర సమితిపతి యిట్లనియెన్. 7

క. దైవముకృప గలదావవు, గా వంధ్యాత్వంబు వీడెఁగా నీతికళా
కోవిదుఁ డగుసుతుఁ గనియెదు, గా వంశము వృద్ధిఁబొందఁగా నా కనుచున్. 8

వ. మనోరథంబునం బొట్టుపొఁడలగుమగసిం గని నగుమొగంబున ఘటప్రతిఘటస్తని యిట్లనియె 9

క. బహుళమనోరథభీషణ, గహనంబునఁ జిక్కి వెడలఁ గావనినీచో
త్సాహానుఁడు చనుసక్తురజః, పిహితుం డగుసోమశర్మపితచందమునన్. 10

క. నావిని దేవికి విపులా, దేవుం డిట్లనియె గుణవతీ యొక్కట్టా
నీవికథ నాతోఁ జెప్పు, మా వినియెద ననినఁ బతికి మానిని పలికెన్. 11

సీ. కలఁడు దాశార్ణభూతలమున నత్యర్థసారశర్ముఁడు సోమశర్మ యనఁగ
నతనికి నెనమండ్రుసుతు లందులో నగ్రపుత్రుండు పిత్రన్నభోక్త వాఁడు
కడుపారఁ గృష్ణపక్షశ్రాద్ధమున నొక్క భూమినిర్జరుగృహంబున భుజించి
యొకసక్తుఘటము పైతృకకర్తచేఁ గొని చని విజనప్రదేశమున నిలిచి

తే. ఘటము గలయంపిగా నీరుగా విషంచెఁ, బఱచి శయనించియె యిటుగాఁ బాణి నిలిపి
యాత్మ నరమోడ్చి ధనవృద్ధమై చరింతు, నని దుఃఖంతోద్యమంబున నతఁడు దలఁచె

సీ. అవన నీసక్తు వమ్మెద నమ్మి యొక మేఁక గొనియెదఁ గొవకొని కొనిన మంద
నేటేట నొకరెంటి నీనెడునవియును నవియు వానికిఁ బుట్టినవియు నీన
బహువత్సరములకు బహుసహస్రంబులై నెగడెడువాని నన్నింటి విలిచి
సంతరించెద ధేనుశత మది పెట్టినకో డెలచే ధారఁ గొనిన చేల

తే. విరివిగాఁబైరు విత్తింతు వేళ్ళుగొలుచు, గాఁగ మామకసస్యము ల్గడుఫలించు
పంటకొలువమ్మి కూర్తు నపారధనము, ధనికుఁ డనివాకు నొకఁడిచ్చుఁ దనకుమారి.

క. దొడ్డతన మరసి యీక్రియ, గడ్డాయం బనిన విప్రకన్యకవలనన్
గొడ్డ కొకసుతునిఁ గని యా, బిడ్డని మాసోమశర్మ పేరే యిడుదున్. 14

క. ఆయర్భకుఁ డూర్జితగతి, హాయనపరిమితవయస్కుఁ డగుఁ బోషింపన్
పాయంతినమున గృహకా, ర్యాయత్తమనీషభామ యశ్వాలకునిన్. 15

క. కరుణఁ దనచంక నిడుకొని, యరుగక యటువైచి పోవు ననునాలో భూ
సురుఁ డీషన్నిద్రాసం, భరముద్రితనయనుఁ డగుచు మఱియాలోనన్. 16

క. ధేనువు లేతెంచిన నిటు, లైన న్వడిఁ ద్రొక్క నాత్మజునిఁ జేవోసీ
పీని నిటువైచి పోఁదగు, నే నీచంకకు భరంబె నిసువానుకొనన్. 17

క. అని కలవరించి లగుడముఁ, గొని త్రిప్పుచు నిక్కువంబు కుపతి యానుచున్
వినఁటిఁ రాసురుఁ డాగ్రహ, మున సక్తుఘటంబు భిన్నములుగా వైచెన్. 18

వ. సక్తుమార్గ పాండూకృతుండును విషాదవిహ్వలుండును నయ్యె నిది మనోరథరాజ్యపాలనఫలం బని చెప్పి యప్పల్లవాధర సుముహూర్తంబునఁ గుమారుం గాంచి పంచమదివసంబున. 19

క. అత్తలలేనికుమారునిఁ, బొత్తులలో నునిచి గూర్మిఁ బురుషుని రక్షా
వృత్తికి నియమించి ధరా, భృత్తిలకో రాజజనని గృహమున కరిగెన్. 20

క. ఆలోఁ బెంపుడునకులము, బాలునకుం గాపువెట్టి బ్రాహ్మణుఁడు నికే
తాళిందమునకుఁ జనియెం, గాలోరగ మపుడు బిలముఖము వెలువడుచున్. 21

క. ఆలభూమిసురతనూభవు, తలిమంబునఁ బఱచె నూర్జితక్రోధసమా
కులమై నకులము చెలువన్, బలువాతెన్ గఱచి ద్రుంచి పాఱఁగ వైచెన్. 22

ఉ. ఆసమయంబున న్మహీసురాగ్రణి పుత్త్రుఁ దలంచి గాఢసం
త్రాసము పేర్మి లోఁగిటికి త్రిమ్మర వచ్చుచు నంతఁ జూచి యు
ల్లాసరసం బెలర్ప నకులంబు ఫణిప్రదరప్రపంకసం
భాసితవక్త్రమై యెగురఁ ద్ద్విపదాబ్జములం బనంగినన్. 23

చ. ప్రకటభుజంగమక్షతజపంకవిలిప్తముఖంబు నప్పహా
నకులముఁ జూచి భూమిసురుఁ డాహతభీతపరీతచిత్తుఁడై
యొకగడెసేపు రిమ్మగొని యుండి పదంపడి తేటి నిప్పరీ
క్షకుఁ డసమీక్ష్యకారియును గావున రోషవశుండు గావునన్. 24

క. తప్పదు చంపె న్వదనము, చొప్పక చెప్పెడును రక్తసిక్తంబయి నా
కుప్పుకలువోలెఁ గలిగిన, యిప్పాపని దీనికేన యిచ్చితి మెసవన్. 25

క. సతిమాట మీరకన్న, త్సుతు దగ్గఱఁ గాచియుండఁ జూచిన నీదు
స్థితి విచ్చుసె నాకుత్సిత, మతిగూల న్నకుల ముచితమా కావఁదిక్కెన్. 26

క. అని కన్నుల జేవుఱఁగీ, ల్కొన లగుడం బెత్తి విసరికొట్టిన వెలికిన్
గనుగ్రుడ్లు వెడల నొప్పిం, బనివి యహో నకుల మపుడు ప్రాణము విడిచెన్. 27

చ. నకులముఁ జంపి పోయి సదనంబున భూమిసురుండు గన్గొనం
జికిలిమడుంగుపానుపునఁ జెక్కుచెమర్పక యున్న పుత్త్రకున్
బ్రకటభుజంగభంగములఁ బ్రాంతమునం గని చిచ్చఁబోయి యే
టికి నిటుసేసితిం గలువరించి యయో నను రోయ నుత్తముల్. 28

వ. అని యుదరతాడనంబుఁ జేసికొనుచు బ్రాహ్మణుం డుచ్చైస్స్వనంబున రోదనంబు సేయుచుండ నంగనక్కులకలంబు చేరువఁ బుట్టినింటనునికిం జేసి యాకర్ణించి యాజ్ఞసేని గృహంబునకు వచ్చి బ్రాహ్మణేశ్వరు నాలోకించి 29

క. కడిఖండితలైనపాము, కడిడిది కడుం గ్రమఁ బెంపఁగా రాజిలు పెం
పుడునకుల మేలపాలిసెం, దడయక నీ వేటి కెడ్చెదవు చెపు మనఘా. 30

ఉ. నావిని బ్రాహ్మణుం డనియె నన్నుఁ బ్రయత్న మెలర్పఁ బట్టికిన్
గావిలిఁ బెట్టి పుట్టినిలు గాల్పఁగ నీవటుబోవ నేను నా
లో విపరంబు మాలి మృగలోచన ముంగిస నీ కిశోరర
క్షావిధి కొప్ప నేర్పఱచి జాఱితి మందిరబాహ్యభూమికిన్. 31

క. ముంగియును మన్నిరోగము, నం గదలక కాచియుండ నందును నాలో
నం గాలసర్ప మరుదే, రం గని భవదీయపుత్త్రరక్షాబుద్ధిన్. 32

క. తలఁగోఁతికి నతికి భుజగ, జ్వలదస్రరసాతిరక్తవదనముతో ధ
వ్వ్యల కెదురువచ్చి నకులము, కలకంఠీ పెనఁగఁదొణఁగెఁ గాళ్ళన్ వ్రేళ్ళన్. 33

తే. అపుడు పన్నగరక్తసిక్తాననంబు, బభ్రునేత్రంబుఁ గని గుండె పగిలి నొగిలి
తనయు నిర్జించెనిఁక నెటితాళి మనుచు,నువిద లగుడాభిహతి దీనియసురుఁగొంటి.

క. ఈముగ్రాఘం బేమిటఁ, బాయు నిశాచరుఁడఁ గాక బ్రాహ్మణుఁడనె యం
చాయన యేడ్చుచుఁ జెప్పిన, నాయిభనిభయాన ఖిన్నయై మూర్ఛిల్లెన్. 35

వ. మూర్ఛిల్లి యెట్టకేలకుం దేఱి కన్నీరు కరతలంబునం దుడిచికొనుచు సతి పతికి గద్గదస్వరయై యిట్లనియె. 36

క. కుపరీక్షితము కుదృష్టము, కుపరామృష్టంబు మఱియుఁ గుశ్రుతముం గో
సుపురుషుఁడు నాపితుని క్రియ, నపరిమితాపత్పరీతుఁడై చెడిపోవున్. 37

క. అనినవిని భూసురుఁడు సతిఁ, గనుఁగొని యోవంశపాలికా! మంగలి యే
పనిఁ జేసి చచ్చె నీకథ, విననిష్టం బయ్యెఁ జెప్పవే నాకనుడున్. 38

వ. యాజ్ఞసేని యిట్లని చెప్పందొణంగె. 39

చ. జడమతిభార్య యొక్క సెటిసాని విదర్భనివీటనుండి సొం
పడరఁగఁ గన్నలబ్ధిఁ గడుపై కడుఁబైకొనుదండినొప్పలం
బడి యది పుత్త్రుఁగాంచి పిదపం బరలోకముఁ జేర నంతలో
నడల దొడంగె నాకటికి నారసి చన్నిడలేమి బాలుఁడున్. 40

క. చుట్టంబులు పక్కంబులు, కట్టడియై వీఁడు తల్లిగండము తలగా
బుట్టె నవలక్షణుం డికఁ, గట్టా యెవ్వారి జెఱుపఁగా నున్నాఁడో. 41

ఆ. ఇంట నుండఁగూడ దిప్పుడ గొని చని, గుంటనైనఁ బెద్దకుంటనైనఁ
బెంటనైన వైచి యింటికి నరుదెం డ,నంగ నద్దురుక్తు లాలకించి. 42

క. ఆయిండ్లఁ గూలి కుప్పట, లాయముగా నిరవధీనయై మనునొకవ
ర్షీయని వేఁగినపుడిలో, బాయనితమి మ్రొక్కి నిలువఁబడి యిట్లనియెన్. 43

ఉత్సాహ. కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనాథుఁడున్
మున్నెచచ్చె యేను గుంకముండ నెట్టు లేగుదున్
మున్ను వెన్క లేదు నేఁడు మూఁడుగాళ్ళవృద్ధనా
యన్నలార వీని నీరె యంచు నేఁడి మ్రొక్కనన్. 44

మ. అరసాన్న గ్రహణాప్తిశేషవతశేవాన్ సౌఖ్యకృత్తైలసం
స్ఫురణాభావజటీకృతాలకననీషద్దైన్యతామ్యన్ముఖం
బరుష ప్రాక్పరిధానసంవృతనితంబ న్నిర్గతాలంబనా
జరఠం గన్గొని యొండునాక నగరస్వాముల్ ప్రసాదించినన్. 45

క. ఏనిత పనిఁబూని వానిన్, దనయునిగాఁ బెనుచుకొనిన దత్సుకృతం బే
మనిచెప్పవచ్చు విద్యా, ఘనుఁడు గుణాకరుఁడు ధీరతరుఁ డతఁడయ్యెన్. 46

క. అతఁ డొకనాఁడు దారి, ద్ర్యాతురుఁడై ధాత నోఁచి యలసి మహీశ
ద్యాతలమున నిదురించి య,హో తేజోలాభమూల మొకకలఁ గనియెన్. 47

ఉ. చేరి తృతీయయామమున సెట్టి గలంగి సముల్లసన్మరు
ద్భూరుహశంగిఁ గొంజడలు భూతివిశేషితమైన మేన నిం
డారగఁ గావికావు మసినంటినమోము సుతుష్మశుభ్రరో
చీరుచి సేవగింప నొకసిద్ధుఁడు వచ్చి పదాదరాయతిన్. 48

చ. అనియె నహో కిరాటతనయా వినయాదిగుణంబులంగు నే
మనుజుఁడు నీకు సాటి యలమాట లటుండెఁ బ్రభాతమైననీ
కనుఁగవకు న్ఘనత్రపణకత్రయము న్గనుపట్టు ముంగిటం
బనిపడి దానిఁ జంపు మది ధర్మనిధిత్రయమూర్తి నుండెడున్. 49

క ఆవిధులఁ బుచ్చుకొని ధని,యై నీతిఖ్యాతిరీతు లమరఁగ మనుమం
చానిత్యసఖ్యుఁ డరిగిన,మానస మలరం గిరాటమణి మేల్కనియెన్. 50

తే మేలుకని భక్తిఁ బ్రణమిల్లి మేరనిలిచి,తల్లి యూరుజకులశామతల్లికనియె
నమ్మ యిమ్మందిరంబున నలికి ముగ్గుఁ, బెట్టు మిపుడు శుభంబు లభించు మనకు.

క. పలుకు విలంబన మున న,ప్పలితగృహం బలికి పూసి పసపొసఁగం గు
గ్గులుమ్రుగ్గులు నిడి యుక్కథ, నలఘుమతిం దెలిపె సనయుఁ డగుతనయునకున్. 52

క. క్షౌరమునకు సమయంబగు, టారసి నాపితుఁడు వచ్చె నాలో దైవ
ప్రారంభమున నపూర్వవి, భూరూక్షపణకత్రయంబును వచ్చెన్. 53

వ. వచ్చిన. 54

క. మేనుపొంగఁగఁ బెంజెర, కూన న్నగు లగుడమెత్తికొని ప్రాణంబుల్
పోనడఁచె సెట్టి యాలో, దీనత్రితయంబు బహో నిధిత్రయమయ్యెన్. 55

వ. అయిన. 56

క. ఆనిధులఁ బుచ్చుకొని ధని,యై నాపితుఁజూచి వణిజుఁ డాదృతి మెఱయన్
దీనారశతక మిడి మదిఁ, బూనినకౌతూహలమునఁ బొమ్మని పల్కెన్. 57

చ వెఱగు జనింప నత్తెఱఁగు వెంగలిమంగలి నూవి కమ్మని
న్నెఱుఁగక యింటి కేగి యటుతేనును భూరినిధు ల్గడింతు నం
చఱిమఱి గొంకులేక లగుడాగ్రముఁ గైకొని యత్నమేమియున్
గొఱపడకుండ నాత్మపణకత్రితయాగమనంబుఁ గోరఁగన్. 58

క. ఒకముగురు నిగురుగప్పిన, ప్రకటాంగారము లనంగ భస్మవిలిప్తాం
గకులం చను దేర నారసి, తుకతుకపో నడచె నాపితుఁడు చేసేతన్. 59

క. లగుడంబున మస్తకముల్, పగిలి పడ న్వ్రేయఁ జచ్చిపడి రన్నఁగ న
మ్మగురును మాగురు నిధిత్రయ, మగుటయు లేదని మెఱసెన ప్రము మిడుకన్.

వ. అట్టి దుష్కృత్యంబునకుఁ బౌరులాహాకారంబు లొనర్చి రాక్షణంబ నగరరక్షకులు 61

చ. పటురభసంబున న్బ్రదిది పట్టి దురాత్మక యిట్టివారి నేఁ
డిటు నరెజేసి చంపుటకు నెవ్విధి నీమన సొర్చె నీవు ని
ష్కుటిలచరిత్రు లన్యులకుఁ గోర కొలంత యు గీడు వీరిపైఁ
గటకట మచ్చరా బెటులఁ గక్తి స్పృహా యిది పోల దెయ్యెడన్. 62

క. నిటలలిఖితాక్షరంబులు, కుటిలాత్మా మసలదెసల గొనబగు జటులం
జటులగతిఁ జంపితివని, కటములు భోంగారఁ గ్రూరగతి నా రంతన్ 63

క. ఆత్మునకుఁ డోడిపడ న, బ్భిక్షులపాదముల సరసఁబెట్టి భుజాహే
తిక్షితి దునిమిరి ధర నస, రీక్షితకార్యులు భజింపరే యాపదలన్. 64

చ ప్రశమనరేఖఁ బాదమునఁ బ్రామి మహోద్యవిశేషరోషసం
వశుఁ డగుమన్ ధరాస్థలి నవారణ నెవ్వఁడు వేగిరించి సం
భృతతరకార్యము ల్సలుపుఁ బెద్దయు వేమునునేల సర్వదు
ర్దశలు గలంచు వానిఁ దము దా గుణలుబ్ధులఁ బొందుసంపదల్. 65

వ కావున నీవును నాపితునను దోడుబోయిననాఁడ వని ప్రాణేశ్వరుం దూఱె వారు సుఖస్థితి నుండి రని విష్ణుశర్మ్యుండు సెప్పిన విలసితకథాప్రశ్నంబున సుదర్శనకుమారులు లబ్ధవర్ణులై పూర్ణులై తండ్రి నలరింపుచుండిరి 66

మ. సతతశ్రీకృతరాగదేహాకృతశోభాగరత్నాస్థిదా
మతటిత్తారకయుక్తవారిధరసమ్యక్కాయ చిద్గేయ వ
ర్ణితమోహాన్వితికర్త్రి కాను హింతగానప్రేమ గోపాంగనా
తతచామీకరచామరానిలచరాంచత్కుంతలోల్లాలకా 67

క. హాటకమణినూపురన్యక, రోటికమలాంఘ్రిచరణ రుచిరాగ్నిశిఖా
పాటీరధవళితపల్లవ, పాటలమందారపాదపప్రతిమానా 68

మాలిని త్రిపురరిపునరస్త్రీత్రివిక్రమానచ్ఛదాఢ్య, నిపుణతరవిహారా నిత్యసంతోషపూరా
జపకరణచణార్యాసక్తముక్తాభిగమ్యా, త్రిపటుతరవిలాసా దివ్యధామైకవాసా. 69

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార విస్సనామాత్యప్రబంధనిర్మాణ భోజభూవరసుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతం బయిన పంచతంత్రంబున నసమీక్ష్యకారిత్వ మన్నది సర్వంబును పంచమాశ్వాసము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.——1924.